# చతుర

సంపుటి : 6 జూలై : 1983 సంచిక : 6


## ఈ నెల సమగ్ర నవల

అందం, చదువు, ఉద్యోగం వుండి కూడా అవివాహితగా మిగిలిపోయింది ఆమె. తల్లిదండ్రులు ఆ దిగులుతోనే కన్నుమూశారు. ప్రేమించినవాడు మోసగాడని రుజువయింది. సేదదీరుస్తుందని ఆశించిన స్నేహం ఎండమావి అని తేలిపోయింది. ఒంటరిగా ఆఫీసులోని తోడేళ్ళను ఎదుర్కోవలసి వచ్చినా నగటు ఆడపిల్లలా ఆత్మహత్య చేసుకోలేదు. ధైర్యంగా నిలబడి తన జీవితాన్ని



# పూలరథం

గా మలుచుకోడానికి ఏ స్త్రీ తీసుకోలేని నిర్ణయం తీసుకుంది. ఆ నిర్ణయం ఆమె జీవన పూల రథాన్ని గమ్యం చేర్చిందా? ఆమె ఎదుర్కొన్న సమస్యలేమిటి? తన కింద పనిచేసే వివాహితుడైన పూర్ణన్ను పెళ్ళాడవలసిన పరిస్థితి ఎందుకు ఏర్పడింది? వారి సంసారం సవ్యంగా సాగిందా?

## శ్రీసుధా

వరకట్న సమస్యతో ఉందరవందర అవుతున్న కన్నెపిల్లల జీవితాలను, వారి పట్ల సమాజం అనుసరించే ధోరణుల గురించి చేసిన నిశిత పరిశీలన 'పూల రథం' ఈ నెల చతుర సమగ్ర నవల.

## కవర్ పేజీ వివరాలు

ముఖచిత్రం : ప్రవీణ్
రెండవ కవరు :
మూడవ కవరు : సూరజ్. ఎస్. శర్మ

# రచయితలకు ఆహ్వానం

**ఇతివృత్తంలో, రచనా సంవిధానంలో నూతనత్వం చూపగల రచయితలకు 'చతుర'లో నెల నెలా నవలల పోటీయే! ప్రచురించే ప్రతి నవలకూ రు. 1500, అత్యుత్తమ నవలకు రు. 2000 పారితోషికంగా అందజేసే నవనవలా వేదిక 'చతుర'.**

* నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు 'చతుర'లో అచ్చులో 60 - 70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపించగలరు.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రా గానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.

# చతుర ప్రపంచం




## లోకసంచారి

ఆధునిక మానవుడు జెట్ వేగంతో ప్రయాణం చేయాలని ఉబలాట పడుతోంటే తూర్పు ఆఫ్రికాలోని కెన్యాకి చెందిన జార్జ్ మెరాస్ మాత్రం 'ఛట్.... నాకు అవేమీ వద్దు. నడిచే వెళతాను' అంటున్నాడు. కాలినడకతో ప్రపంచాన్ని చుట్టిరావాలన్నది ఇతని నిశ్చయం.

ఇతను 1980 మే ఒకటో తేదీన జైత్రయాత్ర ప్రారంభించి ఇప్పటివరకూ 83 దేశాలలోంచి ప్రయాణం చేశాడు. జార్జి చరిత్ర ఉపాధ్యాయుడు అవటాన వచ్చిన తంటా ఇది. చరిత్ర పుస్తకాలలో వివిధ దేశాల గురించి చదివి ఉత్తేజితుడై ఆ దేశాలను స్వయంగా చూడాలన్న తపనతో ఉద్యోగానికి రాజీనామా చేసి ఈ సాహసయాత్ర ప్రారంభించాడు.

ఇతని తండ్రి కూడా ప్రపంచ నడక నిపుణుడు. జార్జి తండ్రి ప్రయాణం మధ్యలో ఓ పోర్చుగీసు చిన్నదాన్ని ప్రేమించి పెళ్ళాడాడు. వారి ప్రేమ ఫలితమే జార్జి. ప్రస్తుతం 110 ఏళ్ళ వయసున్న జార్జ్ తండ్రి కెనడా ఒలింపిక్స్‌లో పాల్గొన్నాడు కూడా. పులి కడుపున పిల్లికూన పుట్టదన్నట్టు జార్జి తండ్రికేమీ తీసిపోలేదు. ఇతను 18 పుస్తకాలు రాయడమే గాక కరాటేలో బ్లాక్ బెల్ట్, జూడోలో బ్రౌన్ బెల్ట్ సాధించాడు. 1976లో ఇతను లండన్ నుంచి సింగపూర్‌కి 80 రోజుల్లో దాదాపు 3,625 కిలోమీటర్లు నడిచాడు. ఇందుకుగాను ప్రథమ బహుమతిగా 13,000 డాలర్ల విలువచేసే 17తులాల బంగారు పతకం




పొందాడు.

జార్జ్ హరేరామ హరేకృష్ణ మతంలో సభ్యుడేకాదు ఆంజనేయభక్తుడు కూడా. ప్రతి శనివారం ఆంజనేయుడికోసం ఉపవాసం చేస్తూ ఒక్క చుక్క మంచి నీళ్ళయినా తాగనంత భక్తుడు.

జార్జ్ ఇండియాలోని రాజస్థాన్ గుండా ప్రయాణిస్తున్నప్పుడు సింహం మీదపడితే ముందు దాని కళ్ళు పొడిచేసి తర్వాత చేతులోనే చంపేశాడట! జార్జ్ అభిమాన భారతీయ నటుడు రజనీకాంత్ అంటే ఆశ్చర్యపోకండి. భారతీయ సినిమాలు ఎన్ని చూసినా నవ్వురాలేదట గానీ 'సాధు అవుర్ సైతాన్' చూసి పగలబడి నవ్వాడట. మహమూద్ హాస్యం అంతగా నచ్చిందన్నమాట. సినీ నటి శోభ చనిపోయినపుడు ఇతను మద్రాసులో వున్నాడు. ఆ వార్త విన్నపుడు ఏడుపు రాలేదట గాని ఆమె నటించిన 'పసి' సినిమా చూసినపుడు భోరుమని ఏడ్చేశాడట.

ఇతనికి భారతీయ సంస్కృతి ముఖ్యంగా భారతీయ స్త్రీలు భర్తలపట్ల చూపే భయభక్తులు, ప్రేమాభిమానాలు చాలా చాలా నచ్చాయట. అందుకే కొచ్చిన్‌లోని కళాశాలలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్న మేరీని పెళ్ళాడబోతున్నాడు.

రోజుకి 80 కిలోమీటర్ల చొప్పున పయనించే ఇతను కొలంబో ద్వారా ఆస్ట్రేలియా చేరతాడు. ఈ ఏడు మే 25న కాలినడకతో ప్రపంచయాత్ర పూర్తిచేయనున్నాడు. పూర్వం నారదుడు ఒక్కడికే లోకసంచారి అన్న పేరు వుండేది. ఇప్పుడు కాస్త పిచ్చిబలం వున్నవాళ్ళంతా ఆ పేరు కొట్టేస్తున్నారు.

## మానవ రచనా యంత్రం

ఇన్నాళ్ళూ ఇళ్ళలో కూర్చుని ఏడాపెడా నవలలు రాసే ఘనత ఆడవారిదేనని తెగ కార్టూన్లు వచ్చేవి. నిజానికి పుంఖానుపుంఖంగా రచనలు చేసి రికార్డ్ సృష్టించిన ఘనత మనదేశంలో ఓ మగమహాశయుడికే దక్కుతుంది.

ఆ ఘనుడు ఎవరోకాదు – అందరికీ సుపరిచితుడైన హిందీ రచయిత గుల్షన్ నందా. ఈయన చాలా రికార్డులు బద్దలు



కొట్టారు. మనదేశంలో అత్యధికంగా అమ్ముడుపోయే నవలల రచయిత ఇతనే! ఇంకో విచిత్రం ఏమంటే పరమపద సోపానాలవంటి పత్రికల సాయం లేకుండానే ఇతను ప్రముఖ రచయిత కాగలిగాడు.

సినిమా నటుల కోసం నిర్మాతలు పడిగాపులు పడిన సందర్భాలున్నాయిగానీ రచయితల నవలలకోసం ప్రచురణకర్త వేయికళ్ళతో ఎదురుచూసిన సంఘటనలు తక్కువ. ప్రచురణకర్తలు ఎంతకాలమైనా వేచివుండే నవలా రచయిత గుల్షన్ నందా. ఇతని నవలలు మొదటి ముద్రణలోనే మూడులక్షల కాపీలు ప్రచురించబడతాయి. ఇదీ ఓ రికార్డే.

భారతీయుల్లో అధికశాతం హిందీ, ఉర్దూ కలిసిన భాష మాట్లాడటం వలన ఇతని నవలలూ ఉర్దూ కలిసిన హిందీలో వుంటాయి. బొంబాయిలో కేవలం ప్రముఖ సినీనటులు, పారిశ్రామికవేత్తలు మాత్రమే నివసించగల ప్రదేశం పాలిహిల్స్‌లో ఓ భారతీయ రచయిత నివసించగలగడం మరో ఆశ్చర్యం – అదీ కేవలం రచనల మీద వచ్చే ఆదాయంతో. ఈ వింతను గుల్షన్‌నందా నిజంచేశాడు.



పుట్టుకతో పంజాబీ అయిన గుల్షన్ నందా స్వస్థలం ఢిల్లీ. ఇతని కుటుంబం కళ్ళజోడు ఫ్రేముల తయారీ వ్యాపారం చేసేది. అయినా గుల్షన్‌నందా దృష్టి మాత్రం రచనా వ్యాసంగం మీదవుండేది. ఇతను పాతికేళ్ళ క్రితం 'ఘట్ కా పత్థర్' అనే నవలను ప్రయోగాత్మకంగారాశాడు. షరామామూలుగా ఆ నవల పట్టుకొని ప్రచురణకర్తలచుట్టూ తిరిగి లేదనిపించుకున్నాడు. అయినా పట్టువదలని విక్రమార్కుడిలా ఓ పేద ప్రచురణకర్తను పట్టుకొని కాగితాలు, ప్రచురణ ఖర్చుల కోసం ఓ 500 రూపాయలు ఇచ్చి వెయ్యి కాపీలు వేయమన్నాడు. నవలకి పేరొచ్చి లాభాలొస్తే అతని డబ్బు అతనికిచ్చేటట్లూ, లాభంలో భాగం ఇవ్వక్కరలేదనీ ఒప్పందం చేసుకున్నాడు.





తర్వాత నందా ఓ వంద కాపీలు కొని మిత్రులు, బంధువులు, అపరిచితుల క్కూడా పంచిపెట్టి నవల మీద వారి అభిప్రాయం నిస్సంకోచంగా తెలీజేయమని అడిగాడు. నవల బావుందని అందరూ మెచ్చుకోవడంతో నవల చాలా సార్లు పునర్ముద్రించబడింది.

అప్పటికి తనమీద తనకి నమ్మకం కుదిరింది. అక్కడినుంచి అతని రచనా వ్యాసంగం అంగలుపంగలుగా సాగిపోయింది. అమ్మకాలు పెరిగిపోయాయి. పుస్తకాల షాపుల్లో అతని లేటెస్ట్ నవలల కోసం అభిమానులు ఆత్రుతగా అడుగుతుంటారు.

నందా రాసిన ఖిలోనా, కటీ పతంగ్, దాగ్, షర్మీలీ, జీల్‌కి ఉస్‌పార్ వగైరా నవలలు సినిమాలుగా తీయబడి రజిత, స్వర్ణోత్సవాలు జరుపుకున్నాయి. నవల ప్రచురించబడిన తర్వాతే సినిమా తీయడానికి హక్కుల్ని అమ్ముతాడు. ఇప్పటికి యాభై నవలలకి పైగా రాసిన గుల్షన్ నందా ఇంకా రాస్తూనేవున్నాడు. అందుకే ఇతని అభిమానులు గుల్షన్‌నందాని మానవ రచనా యంత్రం అని ముద్దుగా పిలుచుకుంటారు.

## సైంటిఫిక్ జోస్యం

భవిష్యత్తులో నోటితో నవ్వుతూ నొసటితో వెక్కిరించడం, తడిగుడ్డతో గొంతులు కోయడం సాధ్యపడకపోవచ్చు. పూర్వం మునులు దివ్యదృష్టితో చూసినట్లుగా మనిషి మనస్తత్వం, ఆరోగ్య స్థితిగతులను కళ్ళకు కట్టినట్లు చూడగల రోజులు త్వరలో రానున్నాయి. దివ్య దృష్టిని ప్రసాదించే కళ్ళజోడును కనిపెట్టడానికి యూరప్, సోవియట్ యూనియన్‌లలోని పరిశోధనశాలలు పోటాపోటీగా పనిచేస్తున్నాయి. వీరి కృషి విజయవంతమయితే వైజ్ఞానికరంగంలోనే



# ప్రియ తోడుగా ఉంటే చాలు...
# మరింత సంతృప్తి!




బ్రేక్‌ఫాస్ట్ తీసుకొనేవేళ పక్కన 'ప్రియ' ఉంటే ప్రతి ఉదయం రుచులమయం. అదే 'ప్రియ' అకర్షణలోని రహస్యం. నోరూరించే పలురకాల పచ్చళ్ల లో మీకు కావలసింది ఎన్నుకోండి.

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ 300, 650 గ్రాముల సీసాల్లో దొరుకుతాయి.

* మామిడికాయ * నిమ్మకాయ * టొమాటో
* అల్లం * గోంగూర * ఉసిరికాయ * చింతకాయ
* పండు మిరపకాయ * వంకాయ
తీపిరకాలు : * మామిడికాయ * అల్లం

**ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ**

**ప్రియ ఫుడ్స్**
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI
MARKETING
PRIVATE LIMITED
Eenadu Compound
Hyderabad - 500 004.

కాదు, మానవ జీవిత విధానంలోనే విప్ల వాత్మకమైన మార్పులు వస్తాయి. ఆధునిక యుగంలోకల్లా అద్భుతమైన పరిశోధన అవుతుంది.

ఒక యూరోపియన్ సంస్థ మరో మూడేళ్ళలో తాము ప్రొటోటైప్ కళ్ళ జోళ్ళను తయారుచేయగలమని ప్రకటించింది కూడా. మరి సోవియట్ యూనియన్ ఎంతవరకూ విజయం సాధించిందో తెలియదు.

ప్రస్తుతానికి ప్రొటోటైప్ కళ్ళజోడుని 'ఆరా–గాగ్' అని పిలుస్తున్నారు. ఇవి రంగుటద్దాలతో తయారుచేసిన కళ్ళద్దాల్లా వుంటాయి. ఈ కళ్ళజోడు పెట్టుకుంటే మనుషులచుట్టూ ఇంద్రధనస్సులాంటి రంగుల కాంతి కన్పిస్తుంది. ఆ కాంతిలోని రంగులనుబట్టి ఆ ప్రాణి ఆరోగ్యమనస్థితి, ఆశయాలు, ఆలోచనలను గ్రహించవచ్చు. అంతేకాదు– ఈ ఇంద్రధనస్సు వ్యక్తిగతాన్నేకాక, ఎలాంటి వ్యాధితో ఏ విధంగా మరణిస్తాడో కూడా తెలియజేస్తుంది.

ఈ పరిశోధనకు కొంత ఆధారం వుంది. 1950లో ఒక రష్యన్ ఎలక్ట్రిషియన్, ఫొటోగ్రాఫర్ కిరియన్ కలిసి ప్రతిప్రాణి వివిధరకాల కాంతిని వెలువరిస్తుంటుందని కనుగొన్నారు. వారు ఆ కాంతిని మైక్రోస్కోప్ సాయంతో రెట్టింపుచేసి ఫొటో తీయగలిగారు. చివరికి ప్రాణులు వెలువరించే కాంతి అంతరిక్షంలోకి వెళ్ళిపోతుందని కూడా కనుగొన్నారు. పై పరిశోధనలకు ఈ వివరాలే ఆధారం అనవచ్చు.

'ఆరా–గాగ్' కళ్ళద్దాలు మార్కెట్‌లోకి వస్తే ధరించిన ప్రతివారూ ఎవరు ఎలాంటివారు, ఎవరి మనసులో ఏముందో చెప్పేయగలరట! ఈ కళ్ళజోడుతోపాటు కాంతిలోని వర్ణాలను ఎలా విశ్లేషించాలో చెప్పే నిఘంటువును కూడా సరఫరా చేస్తారు. దీని ఆధారంగా ఏ రంగు దేనికి గుర్తో సులభంగా గుర్తించవచ్చు. ఒక్కో రంగుకి ఒకో అర్థముంటుంది.

ఉదాహరణకి ఎరుపురంగు అధికంగా వుంటే ఆ వ్యక్తి శక్తివంతుడు, కోరికలు గలవాడు అయివుంటాడు. ఒక రకమైన ఎరుపు ఛాయ హంతకధోరణిని చూపిస్తే మరో తరహా ఎరుపు రంగు ఆ రంగు కన్పించిన భాగంలో కేన్సర్ వుందని సూచిస్తుందట.

ఆకుపచ్చరంగు ఆరోగ్యానికి, విద్యకు గుర్తు. మిగిలిన రంగులకన్నా ఆకుపచ్చ ఎక్కువగా కనిపిస్తే ఆ వ్యక్తి డాక్టరుగాని, టీచర్‌గాని అవుతాడని సూచిస్తుంది. పసుపుపచ్చరంగు ఆధ్యాత్మికతను సూచిస్తుంది. పసుపు పచ్చరంగు గాఢతను బట్టి ఆ వ్యక్తి ఆధ్యాత్మికస్థాయి ఉంటుంది. కాంతివంతమయిన పసుపురంగు ఎక్కువ వున్న వ్యక్తి నమ్మకస్తుడు. కనీ కనిపించని పసుపురంగు పిరికితనానికి గుర్తు.

'ఆరా–గాగ్' కళ్ళజోడు వైద్యరంగంలోనే కాదు– నేరపరిశోధన, మనో విశ్లేషణారంగం, ఆఖరికి సమాజంలో కూడా గొప్ప విప్లవం తెస్తుంది. అయితే వచ్చే చిక్కల్లా మానవ జీవితంలో రహస్యమంటూ లేకుండాపోతుంది. ఈ కళ్ళజోళ్లు పెట్టుకుంటే ఎవరు ఎవరిని ప్రేమిస్తున్నారు, ఎవర్ని పెళ్లాడాలనుకుంటున్నారు, ఏం చేస్తున్నారు, ఏం ఆలోచిస్తున్నారు–అన్నీ అరటిపండు వలిచి చేతిలో పెట్టినట్లు తెలిసిపోతుంది. ఈ పరిశోధన వరమో, శాపమో వేచిచూడాల్సిందే మరి.




# పెరిగే పాపాయిలకు




**ఎందుకంటే ఫారెక్స్ పాపాయిల సత్వరమైన మరియు సంపూర్ణమైన పెరుగుదల కోసం అధిక పుష్టికరమైన ఘన ఆహారం.**

**1.** మీ పాపాయి పెరుగుదలకు అత్యావశ్యకమైన ప్రొటీన్‌తో సమృద్ధమైనది ఫారెక్స్.

**2.** మీ పాపాయిని రక్తహీనత నుండి సంరక్షించడానికి, పాపాయి యొక్క రోగ-ప్రతిరోధక శక్తిని ఎక్కువ చేయడానికి మరియు ఆరోగ్యవంతమైన రక్తం సమకూర్చడానికోసం, బ్రాండ్ చేయబడిన మరే ఇతర ఘన ఆహారం కన్నా అధిక ఐరన్ కల్గి వున్నది ఫారెక్స్.

**3.** మీ పాపాయికి గట్టి పళ్లు మరియు ఆరోగ్యవంతమైన ఎముకలు ఏర్పడటానికి అవసరమైన కాల్షియం మరియు ఫాస్ఫరస్‌ను ఆదర్శవంతమైన నిష్పత్తిలో కలిగిన ఏకైక బ్రాండ్ చేయబడిన ఘన ఆహారం ఫారెక్స్.

**4.** మీ పాపాయి సున్నితమైన జీర్ణశక్తికి అనువుగా ప్రత్యేకంగా ముందుగానే పచనం చేయబడినది కనుక, ఎంతో సులభంగా జీర్ణమవుతుంది ఫారెక్స్.




డాక్టర్లు సిఫార్సు చేస్తారు

**ఫారెక్స్®**

గ్లాక్సో నుండి

కౌముది తలారా స్నానం చేసింది. పక్కపాపిడి తీసుకుంది. తలలో గులాబీల దండ పెట్టుకుంది. ఉన్నచీరల్లో కెల్లా బాగా నచ్చింది కట్టుకుంది. తల్లి చేయి పట్టుకుని నడిపిస్తే డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్ళి కూర్చుంది. అక్కడ అప్పుడుతండ్రి కాక ముగ్గురు వ్యక్తులు వున్నారు. ఇద్దరు పెద్దవాళ్ళు, ఒకతను యువకుడు. అతనే పెళ్ళికొడుకు!

తండ్రీ, పెద్దమనుషులూ మాట్లాడు కుంటున్నారు. ఆ మాటల వెనుక సాగే కథ తనగురించేనని కౌముదికి తెలుస్తూనే వుంది. తండ్రి బలరామ్మూర్తి కూతుర్ని ఎలా పెంచిందీ, ఎలా చదివించిందీ చెబు తున్నాడు. గుమ్మందగ్గర నుంచున్న తల్లి శాంతమ్మ కూతురుకు తెలిసిన ఇతర పని పాటల గురించి చెప్తోంది.

కౌముది అదిరే గుండెల్లో అల్లుకున్న ఆతృతతో కళ్ళు పూర్తిగా విప్పలేక చూసీ చూడనట్టు పెళ్ళికొడుకు వైపు చూసింది. అతను మౌనంగా తనవైపు చూస్తూ వుండడం గమనించింది. పావుగంట అలా కుర్చీలో కూర్చుని పెళ్ళికొడుకు తండ్రి అడిగే ప్రశ్నలకు క్లుప్తంగా జవా బులు చెప్పింది.

"నువ్వెళ్ళమ్మా లోపలికి'' అన్నాడు పెళ్ళికొడుకు తండ్రి దయగా!

తల్లి కౌముదిని లోపలికి తీసుకు వెళ్ళింది.

పెళ్ళివారిని వీధివరకూ సాగనంపి తండ్రి లోపలికి వచ్చాడు.

"కౌముది నచ్చిందిటా?''

బలరామ్మూర్తి భార్యకి సమాధానం చెప్పలేదు. వారం పది రోజులు పెళ్ళివారి దగ్గర నుంచి జవాబు కోసం ఎదురు చూడగా ఆఖరుకి ఉత్తరం వచ్చింది. 'పెళ్ళి కూతురు నచ్చింది. కానీ కట్నం పదివేలు ఇవ్వగల్గాలని' దాని సారాంశం.

బలరామ్మూర్తికి గుండెల్లో గునపం దించినట్టు అయ్యింది.

శాంతమ్మకు కళ్ళల్లో కారం జల్లి నట్టుగా వుంది.

"పదివేలే...ఎక్కడి నుంచి తెస్తాం''

"అబ్బాయి జనార్దనానికి ఉత్తరం రాయండి'' అంది కొడుకుని గుర్తు చేసు కుని శాంతమ్మ.

"వాడేం చేస్తాడే"

"వాడు కొంచెం చేయి సాయం చేస్తే మరో సంబంధమైనా చూడచ్చుగా''

"రాద్దాంలే...''

కౌముది తన పెళ్ళి తప్పి పోయి నందుకు కించిత్ బాధపడలేదు. కారణం తన కింకా పదిహేడేళ్ళే! బి.ఏ. ఫస్టియర్ చదువుతోంది. తను ఇంకా ఇంకా చదువు తుంది.ఆపైన ఉద్యోగం చేస్తుంది. అందుకే 'నాకప్పుడే పెళ్ళి ఏమిటి?' అనుకుంది మనసులో!

జీవితం నగిషీలు దిద్దుకుంటూన్న వయసది! ప్రతీ ఆనందాన్ని పదింతలు చేసుకుని గాలిలో తేలిపోయేతరుణం అది! ప్రతీ కష్టాన్ని మాది పింజలా ఊది పారేయగలమనుకుని ఆవేశంతో ఆలోచనలు చేసే వయసు అది!

* * *

"పెళ్ళి ఎప్పుడే?" అంటూ గొడవ మొదలుపెట్టారు కాలేజీలో ఈ సంగతి తెలిసిన స్నేహితురాళ్ళు.

"ఆగిపోయింది" అంటూ కౌముది సినిమాలో సంఘటనలా, నవలలో సన్ని వేశంలా విడమర్చి పెళ్ళివారి సంగతి చెప్పేసింది.

కౌముదిని అలా బి.ఏ. ఫస్ట్





ఇయర్‌లో నలుగురూ, సెకండ్‌యియర్‌లో ఆరుగురూ, ఫైనల్ యియర్‌లో యన మండుగురూ పెళ్ళిచూపుల పేరగుచ్చిగుచ్చి చూశారు. ఏవేవో కారణాలతో తిరస్కరించారు. ఈ తతంగాన్ని కౌముది మొదట్లో తేలిగ్గా తీసుకుంది. తర్వాత చిరాకు పడింది. ఆ తర్వాత మండి పడింది! ఆఖరిగా పెళ్ళికొడుకుల్ని శపించింది!

ఆ తర్వాత...ఆ తర్వాత వచ్చిన ఓ పెళ్ళికొడుకు కౌముదితో ఓ గంట ఏకాంతంగా మాట్లాడాలన్నాడు. అలా మాట్లాడితే ఒకళ్ళనొకళ్ళు తెల్సుకునే అవకాశం కల్గుతుందన్నాడు. బలరామ మ్మూర్తి దానికి ఒప్పుకున్నాడు. డ్రాయింగ్ రూమ్‌లో కౌముదిని పెళ్ళికొడుకు ముందర కూర్చోబెట్టి తక్కిన జనాభా అంతా లోపలికి వెళ్ళారు.

పెళ్ళికొడుకు కౌముదిని సాహిత్యం గురించీ, తెలుగు సినిమాల గురించీ, ఇంకొంచెం దూరం వెళ్ళి బ్లూఫిలిమ్స్ గురించీ ఏవేవో అడిగాడు. కౌముది అన్నిటికీ తమాయించుకునే జవాబు చెప్పింది.

"మీకింత వరకూ పెళ్ళికాకుండా పోవడానికి కారణం ఏమిటి" అనడిగాడు అతను చివరికి.

"అందే?"

"ఇరవై ఏళ్ళు వచ్చేసరికి మగవాడు స్త్రీ సుఖం అంటే ఏమిటో స్వానుభవంతో తెల్సుకుంటాడు. ఇది సాధారణంగా జరిగే విషయం. కానీ ఈ రోజుల్లో ఆడ పిల్లలుకూడా మగవాళ్ళకు ఏ విషయం లోనూ తీసిపోవడంలేదని మన చుట్టూ పరిస్థితులూ, సంఘటనలూ చెప్పకనే చెప్తున్నాయి..." పెళ్ళికొడుకు ఆగి కౌముది కళ్ళలోకి చూశాడు.

"మనలో లోపాల్ని ఎదుటివారికి ఆపాదించకపోతే మనిషికి తోచదు. మీరు లోకంలో ఆడవాళ్ళగురించి అడుగుతున్నారా లేక నా గురించా?"

"మీరు చాలా ధైర్యస్తుల్లా వున్నారే"

"పిరికివాళ్ళు రోజూ చస్తారుట. చావు ఒకేసారి చూడ్డం నాకిష్టం" కౌముది కటువుగా అంది.

"మీకు కోపం తెప్పించాను" అంటూ పెళ్ళికొడుకు కుర్చీలోంచి లేచి కౌముది భుజంమీద చెయ్యివేశాడు.

"ఇదో పరీక్షా? దీన్ని ఏమని పిలవాలంటారు?" అంది కౌముది ఆ చేతినే చూస్తూ.

పెళ్ళికొడుకు ఏమనుకున్నాడో చేయి తీసేశాడు.

"వెళ్ళేముందు ఓ చిన్న అనుమానం. అడగమంటారా?" కౌముది కుర్చీలోంచి లేస్తూ అంది.

"ఓ యస్. అడగండీ"

"మీరు ఇంతవరకూ ఎంతమంది అమ్మాయిల్ని ఇలా పెళ్ళిచూపుల పేర చూశారని నేను వివరాలు అడగడం లేదు. చూసినవాళ్ళందర్నీ ఇలానే ప్రశ్నించారా అనికూడా అడగను. కానీ మీ షరతులకు ఒప్పుకుని పాపం ఎంతమంది అమ్మాయిలు మీతో షికార్లకు వచ్చి వుంటారో అనేదిమాత్రం తెలుసుకోవాలని ఉంది"

"అంటే నన్ను సవాల్ చేస్తున్నారా"

కౌముది నవ్వేసింది. "మన ఇళ్ళల్లో పెళ్ళిళ్లు రకరకాలుగా జరుగుతాయి. ఎన్నో తంతులూ, ఆచారాలూ వుంటాయి. అవన్నీ తెలిస్తే మంచిదేగా"

పెళ్లికొడుకు నోరు విప్పలేదు.

"మీరు నన్ను చూశారు. మీద చేయి కూడా వేశారు. 'పరాయి మగవాడు మీద చేయి వేస్తే మీరేం చేస్తారు?' అని కూడా నన్ను అడిగి వుండాల్సింది" అని కౌముది లోపలికి వెళ్ళిపోయింది విసురుగా.

నెల గడిచింది. పెళ్ళివారి దగ్గర నుంచి అసలు జవాబు అనేదే రాకపోవడానికి కారణం బలరామ్మూర్తికి తెలియలేదు.

• * *

కౌముది బి.ఏ. పాసయ్యింది. తనేమో డిగ్రీ చేతికొచ్చిందని సంతోషిస్తూంటే ఆ ఏటితో కూతురికి ఇరవై ఒకటి నిండాయని మరింత దిగులుపడింది తల్లి. డిగ్రీ చూసైనా కౌముదిని తక్కువ కట్నానికి పెళ్ళి చేసుకునే యువకుడు దొరికితే బావుండునని తండ్రి ఆశపడ్డాడు.

తనతోపాటు చదివిన స్నేహితురాళ్ళలో మూడొంతుల మంది పైచదువులు మొదలు పెట్టారు. ఒకవంతు పెళ్ళిళ్ళు చేసుకున్నారు. ఒకళ్ళిద్దరు ఉద్యోగాలు సంపాదించుకున్నారు. అందరి జీవితాల్లోనూ చిన్నగానయినా కన్పించే చైతన్యం తన బతుకులో లోపించినట్టు కౌముది గుర్తించడం మొదలు పెట్టింది. ఆ గుర్తింపు నుంచే నిరాశ పెల్లుబికి మనిషిని నిర్వీర్యం చేస్తుందని కౌముదికి తెలుసు. పైగా నాలుగు సంవత్సరాలుగా తన పెళ్ళి గురించి ఇంట్లో జరిగే తతంగం కౌముది మర్చిపోలేదు. ఆడపిల్లని ఎంత త్వరగా వదుల్చుకుని చేతులు దులుపుకుందామా అని ప్రయత్నించే తల్లిదండ్రుల ధ్యాసలో ఆమెకి ఔచిత్యం కన్పించలేదు. ఆడదాని జీవితానికి పరమార్థం పెళ్ళితోనే అనుకోవడం ఆమెకెందుకో నచ్చలేదు. దిగాలుగా కూర్చునే తల్లినీ, తన వైపు దోషిగా చూస్తూ తనకేదో అన్యాయం చేసినట్టు బాధపడే తండ్రినీ చూస్తూ కూర్చోలేకపోయింది. అందుకే తండ్రితో అంది ఓ రోజు—

"నాకేం తోచడం లేదు. నాతో చదివినవాళ్ళు ఉద్యోగాలు చేసుకుంటున్నారు. నాకూ రికమెండేషన్ వుంటే ఈపాటికి ఏడాది సర్వీసు పుటప్ చేసి వుండేదాన్ని..."

"ఉద్యోగం చేస్తావా?"

"అవున్నాన్నా..తిని కూర్చోవాలంటే చిరాగ్గా వుంది"

"బావుందే... పెళ్ళీడు వచ్చింది. ఇక ఉద్యోగం ఒకటే తక్కువ నీకు. చూడండీ... ఈ ఉద్యోగాలూ గొడవలూ వద్దు. దానికో సంబంధం వెదకండి" అంది శాంతమ్మ అడ్డు వచ్చి.

బలరామ్మూర్తి భార్య వైపు చూసి ఊరుకున్నాడు.

"నా పెళ్ళిమాట తలపెట్టద్దమ్మా... అయినప్పుడే అవుతుందిలే! అయినా ఉద్యోగానికీ, పెళ్ళికీ ఏవిటిట సంబంధం" అంది కౌముది చిరాగ్గా.

కౌముది వరసగా నాలుగైదు రోజులు తండ్రికి పేపర్లో అడ్వర్టైజ్‌మెంట్లు చదివి విన్పించింది.

కౌముదికి ఉద్యోగం వెతికే వేటలో బలరామ్మూర్తికి రామానుజం తగులుకున్నాడు. వాళ్ళిద్దరూ చిన్నప్పుడు కలిసి చదువుకున్నారు. రామానుజం అందిన అవకాశాల్ని వదులుకోకుండా చాలా పైకి వెళ్ళాడు. ఆదర్శం, నిజాయితీ, పేట్రియాటిజం లాంటి గోరుముద్దలలాంటి మాటలు విని బలరామ్మూర్తి ఈ లోకంలో వీటికెంతో విలువ వుంటుందనుకున్నాడు. కాని కళ్ళముందు పాతికేళ్ళ లోపునే మనుష

లందరూ మూకుమ్మడిగా మనిషిలో వుండాల్సిన ఒక్కొక్క విలువకే తిలోదకా లిస్తూ పోవడం చూసి అవాక్కయి పోయాడు.

రామానుజాన్ని చూడగానే ఆరోజులన్నీ క్షణం కళ్ల ముందు కదిలాయి. రామానుజం ప్రస్తుతం రెండువేల రూపాయలు సంపా దిస్తున్నాడు.

అన్ని విషయాలు అయ్యాక ఆఖరిగా కౌముది ఇంటర్వ్యూ గురించి చెప్పాడు బలరామ్మూర్తి.

"ఆడపిల్లలు ఉద్యోగాలకి ఎగబడ్డం మూలంగానే మగవాళ్లు గోళ్ళు గిల్లు కుంటూ కూర్చోవలసి వస్తోంది" అన్నాడు- నిరుద్యోగుల మీద తీసీస్ చేసినవాడిలా రామానుజం.

"ఇప్పుడు ఇంట్లో ఆడా మగా కూడా సంపాదించకపోతే నాలుగు వేళ్ళూ లోప లికి పోవడం లేదు. కింద తరగతివాడు భార్యని, పిల్లల్ని పనిలో పెట్టి సంపాదిం చడం పూర్వంలో న్యూనతగా కనిపిం చేది. ఆ స్థాయికి ఈరోజు మధ్యతరగతి వాళ్లు కూడా వచ్చారు. అవసరం కాదు, ఆకలి ఏ పనైనా చేయిస్తుందనే సత్యం తెలియడానికి నాకు పాతికేళ్లు పట్టింది..." బలరామ్మూర్తి నెమ్మదిగా అన్నాడు.

"ఇంతకీ మీ అమ్మాయి ఏదీ?" అన్నాడు ఆఖరిగా.

బలరామ్మూర్తి తేరుకుని "రేపు తీసుకు వస్తాను" అన్నాడు.

రేపు ఇంటర్వ్యూ అనగా బల రామ్మూర్తి కౌముదిని తీసుకుని రామానుజం ఇంటికి వెళ్లాడు. రామానుజం ఆ తండ్రీ కూతుళ్ళకి తన స్వార్జితంతో కట్టు కున్న ఇల్లు పూర్తిగా చూపించాడు. చిన్న సైజు మహాభాజు మందిరంలా వుందా ఇల్లు.

రెండు గంటల తర్వాత కౌముది తండ్రితో రామానుజం ఇంటిలోంచి బయటపడింది.

వారం తర్వాత కౌముదికి ఆ ఉద్యో గానికి తను సెలక్ట్ అయినట్టు తెలిసింది. ఆర్డర్స్ పుచ్చుకుని తాయిలం దొరికిన చిన్నపిల్లలా ఇల్లంతా తిరిగింది. నళిని ఇంటికి పరిగెత్తుకు వెళ్లింది. రాత్రి తల్లినీ, తండ్రినీ రామంటున్నా వినకుండా సినిమాకి ప్రయాణం చేయించింది.

"రామానుజంగారికి థాంక్స్ చెప్పాలి" అన్నాడు సినిమా నుంచి వస్తూ బలరామ్మూర్తి.

"అవును... రేపు వెళ్లి రండి" అంది శాంతమ్మ.

కౌముది ఉద్యోగంలో చేరింది. ఓ పెద్దహాల్లో ఇరవై పాత కుర్చీల్లో రక రకాల వయసులవాళ్ళు కూర్చుని వున్నారు.

కౌముదిని చూసి సెక్షన్ హెడ్ గురుమూర్తి "కొత్తగా వచ్చావా తల్లీ! నీకు పని నేర్పాలి గావును. నా చేతి మీదుగా యాభైమందికి పని నేర్పాను. అయినా ఈ సెక్షన్ నుంచి నాకు విముక్తి లేదు. ప్రమోషన్ అసలే లేదు. నా చావు ఈ కుర్చీలోనే ఉంది కాబోలు" అన్నాడు స్వగతంగా.

సెక్షన్ హెడ్ కౌముదికి ఓ పాత టైపు మిషనూ, ఓ ఇరవై టైపు చేయ వలసిన కాగితాలూ ఇచ్చాడు. మిషన్ నిండా దుమ్ము.. దులపడానికి కాగితాలు తప్ప మరేం కనపడలేదు.

మధ్యాహ్నం లంచ్ అవర్‌లో జనం విలవిలమంటూ బయటకు వెళ్ళారు.




హాల్లో కౌముది ఒక్కతే మిగిలింది. ఓ యువకుడు అటు వచ్చి కౌముది వైపు ఆశ్చర్యంగా చూసి – "మీకెవరు కావాలి?" అని అడిగాడు.

"నేను కొత్తగా ఈరోజే ఉద్యోగంలో చేరాను."

"ఓ" అని అతగాడు ఆశ్చర్యం ప్రకటించాడు. "నేనీ సెక్షన్‌లోనే పని చేస్తాను. నా పేరు విఠల్..ఆఫీసుకిపొద్దున్న డుమ్మా కొట్టాను" అన్నాడు.

కౌముది ఏం జవాబు చెప్పలేదు. మళ్ళీ అంతా తిరిగి వచ్చారు హాల్లోకి. కౌముది అరగంటలో సెక్షన్ హెడ్ ఇచ్చిన కాగితాలు టైపు చేసింది. ఆ తర్వాత ఆమెకు చెయ్యాల్సిన పని కనపడలేదు.

ఇంతలో ప్యూనొచ్చి – "కౌముది ఎవరమ్మా ఇక్కడ... ఫోన్ వచ్చింది" అన్నాడు.

కౌముది ఆశ్చర్యంగా కుర్చీలోంచి లేచి సెక్షన్ ఆఫీసర్ రూమ్‌లోకి వెళ్ళింది.

సెక్షన్ ఆఫీసర్ కౌముది వైపు చూసి "ఊ" అన్నాడు, ఫోన్ మీకే అన్నట్టు సౌంజ్ఞచేసి.

"కౌముదిని మాట్లాడుతున్నాను" అంది ఫోన్ తీసుకుని. అవతలి కంఠం గుర్తుపట్టాక "మీరా..నమస్కారం సార్" అంది. "అలానేనండి. నాన్నగారూ,నేనూ వచ్చి మిమ్మల్ని కలుస్తాం" అంది కృతజ్ఞతా పూర్వకంగా. మళ్ళీ "ఈరోజా సార్" అంది అదోలా.

కౌముది సీటులోకి వచ్చి కూర్చుంది గానీ మనసంతా అదోలా అయ్యింది. రామానుజం తనని ఇంటికి రమ్మనమని ఆహ్వానించడం ఆమెకు అనీజీగా అన్పించింది.

ఐదు గంటలకు అందరితోపాటు కౌముది ఆఫీసు నుంచి బయటపడింది. బస్‌స్టాప్‌లో నుంచున్న విఠల్ కన్పించాడు.

"ఇంటికేనా?" పలకరించాడతను.

"అవును..."

"ఎక్కడ వుంటారు?"

కౌముది చెప్పింది. విఠల్ తనెక్కడ వుండేది ఆమె అడక్కుండానే చెప్పాడు.

"ఈ బస్‌లు ఎంతకీరావు" అంది విసుగ్గా.

"మనం ఎక్కవల్సిన బస్ అసలే రాదండీ"

"ఎందుకని?"

"ఎక్కి వెళ్ళిపోతాం కనుక"

కౌముది విసుగు మర్చిపోయి నవ్వేసింది.

* * *

కౌముది ఉద్యోగంలో చేరి ఆర్నెల్లయ్యింది. తొలి పదిహేను రోజుల్లో ఆమెకి 'ఆఫీసు నడవడిక' చాలా కొత్తగా కన్పించింది. చదువుకునే రోజుల్లో ఉద్యోగస్తుల బాధ్యతల మీదా, భారం మీదా ఆమెకి కొన్ని అభిప్రాయాలుండేవి, కానీ తీరా అనుభవంలో అవేవీ నిజం కావని తెలిశాయి. చాలామంది చేసేపని విసుక్కుంటూ చేయడమూ, పని ఎగవేతలో ఆనందం పొందడమూ ఆశ్చర్యం కల్గించాయి. అంతకుమించి పనిచేయడానికి లంచాలు గుంజడం మరీ గగుర్పాటు కల్గించింది. పార్టీలు రావడం తడవుగా వాళ్ళ వెనకే పోయి కాఫీలూ, టిఫిన్లూ తినడం, దాహటంగా ఆఫీసులోనే రేటు మాట్లాడుకోవడం సర్వసాధారణంగా జరిగిపోతున్నాయి.

ఈ వాతావరణంలో మరో నెల గడిచే సరికి కౌముదికి ఆఫీసు పనెలా చేయాలో

అర్థమయ్యింది.

ఆఫీసు గురించి ఓరోజు తండ్రితో చెబితే ఆయన నవ్వుతూ అన్నాడు-

ఈ| రోజులు వేరు. ఇప్పుడు తండ్రి తన సంతానానికి ఏ నీతి చెప్పలేదు. కారణం ఆయన వెనక లొసుగులు. తల్లి చెప్పలేదు. ఆమె ఆ అర్హత పోగొట్టుకుంటోంది. ఆఫీసరు,



టీచరు, ప్రజానాయకుడు-ఎవరైనా తన కిందవాళ్ళని శాసించలేకపోతున్నారంటే వాళ్ళు బాధ్యతల్ని విస్మరించబట్టే. ఇది యాంత్రిక యుగం"

కౌముది తండ్రి చెప్పిన మాటల్లో కొంత అర్థమయిందసుకుంటూ ఉండగానే ఆఫీసులో విఠల్‌తో జరిగిన చర్చ గుర్తొచ్చింది.

"అమాయకుడు తప్ప తెలివైన వాడెవడూ ఈరోజుల్లో నీతిగా బతకడం లేదండీ"

"మీరు జనరలైజ్ చేస్తున్నారు"

"రెండేళ్ళు సర్వీసు పుటప్ చేసిన తర్వాత చెప్పండి ఆ మాట" నవ్వుతూ అన్నాడు విఠల్.

కౌముది కళ్ళు పప్పగించి అతని వైపు చూస్తూ వుండిపోయింది.

"కట్నంలేందే ఆడదాని పెళ్ళి,రికమెండేషన్ లేనిదే మగవాడికి ఉద్యోగం దొరక వీరోజుల్లో. జీతాలతో సరిపెట్టుకుని సంసారంచేసే నాథులు నలభైశాతం వుంటున్నారీ రోజుల్లో. మిగతావాళ్ళ

అమాయకులూ, అందుబాటు లేనివాళ్ళూ. భర్త లంచాలు పట్టి ఇంటిని స్వర్గంగా మారుస్తున్నాడో, లేక స్వంత ఆర్జనతోనే ఈ కార్యక్రమం జరుగుతోందో తెలియని భార్యలుంటారని అనుకోను నేను.

కాలేజీ ప్రేమ పాఠాలూ, రాజకీయాలూ నేర్పే స్వచ్ఛంద సంస్థ! ఇల్లు తండ్రీ తల్లీ పిల్లలూ కలివిడిగావుండే ఓ నిలయం కాదు. నలుగురికీ తలదాల్చుకునే అవకాశం యిచ్చే లాడ్జి!

ఇన్ని అవకతవకల్ని, ఇన్ని లోటుపాటుల్ని వదిలి చాలా కొద్దిమంది నిజాయితీగా బతుకుతున్నారు. వాళ్ళల్లోంచి ఓ అభిమన్యుడు, ఓ వివేకానందుడు, ఓ పరశురాముడు తయారుకావాలి! అంత వరకూ ఈ ప్రవాహాన్ని ఆపలేరెవరూ"

కౌముదికి ఒంటరిగా ఆలోచించినప్పుడు వికల్ మాటల్లో నిజం వుందనిపించేది.

"ఫైనాన్స్‌లో పనిచేస్తారు చూడండి ఆవిడకి పదహారేళ్ళ కూతురు వుంది. కానీ అలంకరణలో కూతురుకన్నా ఎక్కువ మార్కులు కొట్టేస్తుంది"

కౌముది నవ్వుతుంది.

"మీ ఆడజాతి మా మగవాళ్లని ఆడిపోసుకుంటారుగానీ నిజం చెప్పండి! నలభై ఏళ్ళ తర్వాత కూడా కుర్రపోకడలు పోయే ఆడవాళ్లు మా కళ్ళకి ఎలా కన్పిస్తారు?"

"మిమ్మల్ని శల్యపరీక్ష ఎవరు చేయమన్నారు?"

"బావుంది. కళ్ళకి గంతలు కట్టుకో మన్నారు కాదు..."

కౌముది నవ్వేసేది.

"నవ్వడం కాదండీ..ఆలోచించండి.."

కౌముది ఆలోచిస్తూనే వుంది—ఒంటరిగా కూర్చున్నప్పుడూ, ఇంట్లో పడ గ్గదిలో నిద్రపట్టని రాత్రుళ్లూ! తనకి ఇరవై మూడేళ్లు వచ్చాయి. వారం క్రితం తండ్రి ఓ పెళ్లికొడుకుని తీసుకు వచ్చాడు.

"మా అమ్మాయి బి. ఏ పాసయ్యింది. ఐదువందలు సంపాదిస్తోంది" అన్నాడు బలరామ్మూర్తిగారు.

"అలానా" అని ఏ ఆశ్చర్యం, ఆనందం కన్పడనీయకుండానే పెళ్లివారు వెళ్లిపోయారు. తర్వాత కట్నంకావాలని ఉత్తరం రాశారు. తలవంచుకుని ఉత్తరం టేబిల్ మీద పడేసి ఆయన లోపలికి వెళ్లిపోయారు. తల్లి గుడ్లనీరు కుక్కుకుని వంటింటి గడపమీద తల పెట్టుకుని పడు కుంది.

కౌముదికి ఆక్షణంలో ఒకే అనుభూతి కల్గింది. అది పెళ్లి అనే తంతుమీదకోపం.

"నాపెళ్లి గురించి బెంగపెట్టుకో వద్దమ్మా...అయినా నాకు లేని దుఃఖం నీకెందుకమ్మా" అంది.

"అదికాదే..."

"నాన్నగారితో చెప్పు... నాగురించి కష్టపడి ఏ సంబంధాలూ తేవద్దని"

* * *

మరోనెల గడిచింది... విఠల్ ఖాళీగా వున్నప్పుడల్లా తనతో మాట్లాడ్డం కౌముది గమనిస్తూనే వుంది. ఒకటి రెండుసార్లు పార్కుకీ, జూకీ ఆహ్వా నించాడు. కౌముది అందంగా ఒకసారీ, అబద్ధం ఆడి మరోసారీ అతని ఆహ్వానాన్ని తిరస్కరించింది. విఠల్ ఏం అనలేదు.

కానీ అతని మాట మన్నించనందుకు కౌముది తర్వాత తనని తను నిందించు కుంది. విఠల్ గురించి ఆలోచనలు వద్దంటున్నా తననీమధ్య వేధిస్తున్నాయి. ఏపనీ లేకుండా వున్నప్పుడు, ఖాళీగా కూర్చున్నప్పుడు అతగాడు చటుక్కున మెదడులో జొరబడతాడు.

విఠల్ ఆలస్యంగా ఆఫీసుకు వస్తే తనకెందుకు అదోలా వుంటుంది? అయిదు నిముషాలకోసారయినా తను కళ్ళెత్తి అతని సీటు వైపు ఎందుకు చూడాలి??

ఆర్నెల్ల నుంచీ అతన్ని తను చూస్తోంది ఆఫీసులో. కానీ ఈ ఆరు వారాలుగానే విఠల్ తనకెందుకు ఆప్తుడుగా కన్పిస్తున్నాడు.

"చూడు కౌముదీ!నువ్విలా తప్పించుకు తిరగడం ఏం బాగోలేదు" అన్నాడు విఠల్—అలా ఓ రెండు నెలలు గడిచాక.

కౌముది మాట్లాడలేదు.

"చూడు కౌముదీ...మనం మంచి స్నేహితులం నిన్నటి వరకూ. ఇక ఈ స్నేహం అనే గడి వదిలి ప్రేమికుల మనే గూటిలోకి చేరదాం...ఏమంటావు?"

"ప్రేమికులంటే వివాహం చేసుకోని వాళ్ళని అర్థంగదా!"

"వివాహం చేసుకుందాం"

కౌముది నెమ్మదిగా అంది – "మీకు నా చరిత్ర, నా కుటుంబ చరిత్ర అంతా చెప్పాలి. మీరు అవన్నీ విన్న తర్వాత మీ అభిప్రాయం చెప్పండి. నిజమే నాకూ అన్పిస్తోంది – మిమ్మల్ని చూడకుండా వుండలేననీ, బతకలేననీ... కానీ పెళ్లి కాకుండా ఈ స్నేహానికీ, ప్రేమకీ అర్థం వుండదు. మీ నాన్నగారూ వాళ్ళూ ఒప్పు కుంటారా నన్ను చేసుకుందుకు?"





మా ఇంట్లో ఇలా ప్రేమించు కున్నామని తెలిస్తే మావాళ్లు మండి పడతారు. ఏ తపశ్శక్తి చేతో ఇక్కడ ప్రత్యక్షమయి మనల్ని శపించి వేరు చేసి పారేస్తారు. అందుకని మనం గప్ చుప్‌గా రిజిస్టర్ మేరేజ్ చేసుకుందాం"

"అంటే?

"అదేనోయ్..."

"మరి మా ఇంట్లో....?"

"చెప్పద్దు"

కౌముది ఆలోచనలో పడింది.

"నిజం కౌముదీ... నువ్వూ ఆలోచించు. మీ నాన్నగారికీ, అమ్మగారికీ చెపితే వాళ్ళు అంత త్వరగా మన ఉద్దేశంతో కాంప్రమైజ్ కారు. కంగారుపడి మీవాళ్లు మా ఇంటికి వెడితే కథ అడ్డం తిరుగుతుంది"

"సరే నేను చెప్పనులే. రిజిస్టర్ మేరేజ్ అంటే ఎలా చేసుకోవాలి?"

"మనం ముప్ఫయిరోజుల ముందుగా ఇలా మేంపెళ్లి చేసుకోబోతున్నాం అని వాళ్ళకి నోటీసు ఇవ్వాలి. ఆ తర్వాత ఇద్దరు సాక్షులతో వాళ్ల ఆఫీసుకు వెడితే పెళ్లి చేసి పారేస్తారు"

అలా కౌముదీ, విఠల్ చాలా సేపు ఆలోచించుకున్నారు. కౌముది అయిష్టంగానే విఠల్ ఉద్దేశంతో ఏకీభవించవల్సి వచ్చింది.

ఆమెకు పార్కు బయట ఫ్యాన్ రాములు ఎదురుపడ్డాడు.

"ఏం రాములూ ఇక్కడున్నావ్?"

"బజారు పనిమీదొచ్చినా"

"ఈ వేళ ఆఫీసుకు రాలేదేం" అంది.

"బిడ్డకి వంట్లో బాగుండలేదమ్మా! అయినా నే ఆఫీసుకొచ్చేది ఇంకెంత... నెల దినాలేగంద"

"అదేమిటి?"

"సర్వీసయి పోయినాది"

"అట్లానా"

"చూడు బిడ్డా... నా కొడుక్కి కొలువు యిప్పించమని అప్లికేషన్ ఎట్టుకున్నా. ఆడికి నౌఖరీ దొరుకుద్దంటావా?"

"నేను ఆఫీసులో ఫైలు చూశాను రాములూ...నీ కొడుక్కి ఉద్యోగం ఇవ్వాలని సెక్షను ఆఫీసరు గట్టిగా రాశారు. గురుమూర్తి గారిని కూడా కలుసుకో"

"పోన్లే తల్లి...గట్టా అయితే మంచిగ వుంటుంది. ఆడు కొలువులో పడితే నాకు ఫికరుండదు"

కౌముది రాములు వైపు చూసింది. రాములు తన తండ్రి ఈడువాడు. తనకి చిన్నప్పటి నుంచీ రాములూ, అతని కుటుంబం తెలుసు. అప్పట్లో రాములూ వాళ్ళు ఉండేది తమ వీధిలోనే. కౌముదికి చటుక్కున రాములు కొడుకు యాదగిరి గుర్తొచ్చాడు. యాదగిరి . నిజమే.... తను యాదగిరిని మర్చిపోలేదు. యాదగిరీ, తనూ కలసి ఎలిమెంటరీ స్కూల్లో ఏడేళ్లు కలిసి చదువుకున్నారు. యాదగిరి చదువు పదో తరగతితో ఆగిపోయింది. అతని చదువు ఆగిపోవడం కూడా తన మూలంగానే జరిగింది...

"ఇంత పొద్దు పోయిందాకా ఈడేం చేస్తున్నావ్ బిడ్డా?"

"స్నేహితులతో పార్కుకి వెళ్ళాను"

"పెద్దమ్మ నువ్వు దేర్ జేస్తే మొత్తుకుంటుంది. జల్దీ ఇంటికి పో"

"సరే రాములూ... నువ్వెళ్ళు"

"మంచిది" అంటూ రాములు వెళ్లిపోయాడు.

కౌముదికి చటుక్కున నళిని గుర్తుకొచ్చింది.

తను రెండు నెలలుగా నళినిని కలవనే లేదు. ఎన్నోసార్లు నళిని తమింటికి ఆహ్వానించింది కూడా. నళిని భర్త మోహనరావు కూడా మంచిమనిషే అనిపిస్తాడు.

కౌముది బస్ స్టాప్ పక్కన వున్న షాప్‌లోకి వెళ్ళి నళిని ఇంటికి ఫోన్ చేసింది.

"నేనే కౌముదిని..."

"ఇంతకాలానికి గుర్తుకొచ్చానా?"

"కొత్త పెళ్ళికూతురివి కదా.. చీటికీ మాటికీ వచ్చి నిన్ను డిస్టర్బ్ చేస్తే బావుండదు చూడు..."

"ఆ కొత్త పాతబడిపోయి మూణ్నెల్లు అయిందే తల్లీ''

కౌముది చిన్నగా నవ్వేసి అంది– "నీతో అర్జంటుగా మాట్లాడాలి... రేపు మీ ఇంటికి రమ్మంటావా"

"ఏవిటి కథ...?"

"పెద్దకథే వుంది"

"పెళ్ళికాని అమ్మాయి దగ్గర పెద్ద కథే వుందంటే అది కథ కాదు నవలని అర్థం. తెలిసిందా?"

"రేపు భోజనం చేసి వస్తాను"

కౌముది ఫోన్ పెట్టేసి బస్‌కోసం స్టాప్‌లో నుంచుంది.

మర్నాడు కౌముదిని చూసి నళిని కౌగలించుకున్నంత పనిచేసింది. కౌముది

తను ఉద్యోగంలో ఎదుర్కొంటున్న ఇబ్బందులు చెబితే నళిని తన కొత్త కాపురంలో సొబగులూ, భర్త మోహనరావు గుణగణాలూ, కోపతాపాలూ వర్ణించి చెప్పింది.

నళిని ఆ తర్వాత కౌముది తల్లిదండ్రుల గురించి అడిగి – "నిన్నేమిటీ కథ అన్నావ్?" అంది.

"అవునే"

"ప్రేమకథా?"

"లాంటిదే..."

"అయితే ఆగు. కాఫీ కలుపుతాను. అది తాగి ఇద్దరం స్టేషన్‌కి వెడదాం. వెడుతూ నేనో కథ చెప్తాను. నీ కథ నువ్వు చెబుదువుగాని" అంటూ లోపలికి వెళ్ళింది.

అరగంట తర్వాత ఇంటికి తాళం వేసి ఇద్దరూ రోడ్ మీద పడ్డారు. కౌముది ముందు తన కథ చెప్పింది. "ఏమంటావ్ నువ్వు? నేనేం చేయాలిప్పుడు? నా తల పగిలిపోతోందనుకో" అంది.

"రాత్రి మావారితో కలిసి ఆలోచిస్తాను. అదిసరే. మనం స్టేషన్‌కి ఎందుకు వచ్చామో చెప్తాను విను. ఈ కథ వింటే నీ గుండె విలవిల్లాడచ్చు..." అంటూ కథ మొదలుపెట్టింది.

నళిని పినతండ్రి వ్యవసాయం చేసుకుంటూ పల్లెటూర్లో వుంటాడు. ఆయనకు ఒక్కతే కూతురు. పేరు పద్మ. పద్మకి నాలుగేళ్ళనాడు పెళ్ళయ్యింది. కట్నం

వున్నంతలో ఇచ్చారు. పద్మ భర్త పాండురంగతో ఓ ఏడాది హైదరాబాద్‌లో కాపురం చేసింది. మూడేళ్ళనాడు పండక్కి ఇంటికి వెళ్లింది..అంతే! ఆ తర్వాత భర్త జాడ తెలియలేదు. మామ గారు వచ్చి అల్లుడికోసం వాకబుచేశాడు. అల్లుడి ఆచూకీ తెలియలేదు. పైగా పాండురంగకి తల్లీ దండ్రీగానీ, అక్కా చెల్లెళ్ళుగానీ లేరు. దాంతో పెద్దాయన మనసు పాడయింది. మంచంపడ్డాడు... పద్మని చదివించి ఏదో బతుకుతెరువు చూపించమని నళిని తండ్రికి ఉత్తరం రాశాడు.

"చూశావా...ఇప్పుడు మా అక్క వస్తోంది. దానికోసమే మనం స్టేషన్ వచ్చింది" అంది అంతా చెప్పి.

"ఆమె ఏమన్నా చదివిందా?"

"టెన్త్‌క్లాసు పాసయిందనుకుంటాను"

ఇంతలో 'కోణార్క్' వచ్చి స్టేషన్‌లో ఆగింది. నళిని ఒక్కొక్క కంపార్ట్ మెంటు వైపూ చూస్తూ నుంచుంది.

ఓ పెట్టెలోంచి 'నళినీ' అన్న కేక వినబడి నళినీ, కౌముదీ అటు పరిగెత్తారు. పద్మ చిన్న సూట్‌కేస్‌తో రైలు దిగింది.




మర్నాడు కౌముది లంచ్ అవర్‌లో ఎవరూ లేకుండా చూసి వికల్‌తో తను నళిని అనే స్నేహితురాలి ఇంటికి వెళ్ళడం, నళినితో తమ ప్రేమ పురాణం చెప్పి సలహా అడిగిన సంగతి అంతాచెప్పి-

"మనకేం భయంలేదు వికల్! అది నా ప్రాణ స్నేహితురాలు. అదీ, దాని మొగుడూ మన పెళ్ళికి సాక్షులుగా వుంటామన్నారు"

"అరే" అన్నాడు.

"అదేమిటీ...ఆ కంగారుదేనికి" అంది.

"కంగారు కాదు కౌముదీ! వాళ్ళుగానీ మీ నాన్నగారికి చెప్పారనుకో"

"నళిని అలాంటి మనిషి కాదు"

కౌముది నవ్వుతూ - "నాదో చిన్న కోరిక" అంది.

"ఏమిటి ఇద్దరంకలిసి సినిమాకి వెడదామా?"

"అదికాదు వికల్! రేపు సాయంకాలం మనిద్దరంకలిసి నళినీవాళ్ళింటికి వెడదాం. నళిని భర్త మోహనరావుని పరిచయం చేస్తాను. సరేనా?"

వికల్ మాట్లాడలేదు.

* * *

మర్నాడు కౌముది ఆఫీసుకు వెళ్ళే సరికి అరగంట ఆలస్యం అయ్యింది. సీటులో కూర్చుంటూనే వికల్ సీటువేపు చూసింది. కుర్చీ ఖాళీగా కన్పించింది. నిముషాలు లెక్కపెట్టుకుంటూనే పని చేసింది. మనసు ఆఫీసుపనికి మొరాయించింది. వికల్ ఆఫీసుకు ఎందుకు రాలేదు...ఎందుకు రాలేదు అని తనని తనే ప్రశ్నించుకొంది. ఆ తర్వాత వికల్ ఫోన్‌కోసం ఎదురుచూసింది. సెక్షన్ ఆఫీసర్ రూమ్‌లో ఫోన్ మోగినప్పుడల్లా ఆమె తలలో గుడిగంటలు మోగినట్టుగా అన్పించేది. ప్రతీ ఫోన్‌కాల్ మరెవరిదో అవడంతో కౌముదికి అసహనం పెరిగి పోతూ వచ్చింది.

తనేం చేయాలి? విఠల్‌కోసం ఎదురు చూస్తూ ఆఫీసులో కూర్చోవడమా లేక నళినీవాళ్లింటికి వెళ్ళడమా? తేల్చు కోలేకపోయింది కొద్ది సేపు. విఠల్‌కి తను నళిని అడ్రసు ఇచ్చింది. ఒకవేళ విఠల్ సరాసరి అటేవస్తాడేమో! కౌముది అటే వెడుతున్న రాముల్ని పిలిచి–

"చిన్నపని రాములూ" అంది.

"ఏందమ్మా"

"నేను మధ్యాహ్నం సెలవుపెట్టి స్నేహితులింటికి వెడుతున్నాను. ఒకవేళ విఠల్‌సాబ్‌వచ్చి నన్నడిగితే నేను చీటీ రాసిస్తాను అది ఆయనకివ్వు. సరేనా?"

"గట్టనే"

కౌముదికి ఆఫీసులో వుండబుద్ధికాలేదు. సెలవురాసి సెక్షన్ హెడ్‌కి ఇచ్చి ఆఫీసు నుంచి బయటపడింది.

కౌముదికి గేటు దగ్గరే నళిని ఎదు రొచ్చి లోపలికి ఆహ్వానించింది. పద్మ కౌముదిని చూసి "నమస్కారం అండీ" అంది.

"అది సరే ఒక్కర్తివే వచ్చావ్... మీ స్నేహితుడేడీ" అంది నళిని కౌముదిని చూసి.

కౌముది "ఆయనగారు ఆఫీసుకు రాలేదే... బహుశా ఇటే వస్తాడేమో" అంది.

"బావగారు నాల్గింటికల్లా ఆఫీసు నుంచి వచ్చేస్తామన్నారు. ఈలోపున ఆయనా వస్తారేమో" నళిని అంది.

* * *

కౌముదీ, విఠల్, నళినీ, మోహనరావూ హోటల్‌కి వెళ్ళి కాఫీ తాగి అక్కడే ఓ గంట గడిపారు.

విఠల్ గారూ... నేను చెప్పడం మర్చిపోయాను. మీ మేరేజ్ వచ్చే శనివారం సాయంకాలం. కాబట్టి శనివారం ఉదయం మీరు మా ఇంటికి వచ్చెయ్యండి. అఫ్‌కోర్స్ మీది రిజిస్టర్ మేరేజేకావచ్చు. ఇంటి దగ్గర కొద్దిగా సాంప్రదాయ బద్ధంగా ఫంక్షన్ చేయా లంది నళిని"

"మీ ఇష్టం..."

"మేం ఏమేం చేయబోతామో కౌముదికి చెప్పాం. అది ఆఫీసులో మీకు చెప్తుంది. సరేనా?"

విఠల్ తలఊపి ఓసారి కౌముది వైపు చూసి తల వంచుకుని వెళ్ళి పోయాడు.

కౌముది తలవంచుకుంది.

"ఏమిటి కౌముదీ... బాధపడు తున్నావా?"

కౌముదికి కన్నీళ్ళుఆగాయి కాదు....

"లేదే...లేదే" అంది జేబురుమాలుతో మొహం, కళ్ళూ తుడుచుకుంటూ.

"లేవండీ వెడదాం. ఇంకా ఇక్కడ ఎందుకు?" అంది నళిని.

* * *

"మోహనరావుగారూ" అంటూ బయటనుంచి కేకపెట్టాడు విఠల్.

"రండి రండి" అంటూ ఆహ్వా నించాడు లోపలికి మోహనరావు.

గదంతా పరకాయించి చూసి విఠల్ అక్కడున్న సోఫాలో కూర్చున్నాడు.

"ఏమిటి ఇల్లింత నిశ్శబ్దంగా వుంది"

"నిశ్శబ్దం కూడా భయం వేస్తుంది. కదూ ఒక్కొక్కసారి..." మోహన రావు చిన్నగా ప్రశ్నించాడు.

లోపలి నుంచి నళిని కాఫీ తీసుకు వచ్చి భర్తకీ, విఠల్‌కీ ఇచ్చింది.

ఇంతలో బయట నుంచి "మోహన రావూ" అంటూ పిలుపు వినబడింది.

మోహనరావు ఒక్క ఉదుటున బయటకు వెళ్ళి "రండి'' అంటూ ఆహ్వానించాడు. ఇద్దరూ లోపలికి వచ్చారు.

"ఈయన విఠల్‌గారు .... మాకు బాగా కావల్సిన మిత్రుడు" అని విఠల్ వైపు తిరిగి - "ఈయన కేశవరావు గారు...ఈ ఊళ్ళో లాయర్ .... నా మిత్రుడు ... క్లాస్‌మేట్'' అంటూ



పరిచయం చేశాడు. విఠల్, కేశవరావు చేతులు కలుపుకున్నారు.

"ఏమిటీ, అర్జంటుగా రమ్మని ఫోన్ చేశావ్" అడిగాడు కేశవరావు.

"ఓ పెద్ద గొడవ వచ్చింది. అందుకే నిన్ను రమ్మన్నాను'' అన్నాడు మోహనరావు.

"గొడవంటే..."

"నా భార్య స్నేహితురాలు వుంది. చిన్నప్పుడెప్పుడో పెళ్ళయింది శాస్త్రోక్తంగా. కానీ వాళ్ళిద్దరూ పెళ్లి అయిన తర్వాత ఓ ఏడాది మాత్రం కాపురం చేశారు.. విడిపోయారు. ఆమె మళ్ళీ పెళ్లి చేసుకోవాలనుకుంటోంది. కానీ చిక్కెక్కడంటే ఆమె గవర్నమెంటు ఉద్యోగం చేస్తోంది ? రేపొద్దున్న చిక్కులు వస్తే ఎలా ఎదుర్కోవాలి.. చిట్కాలేమన్నా చెప్పగలవా"

కేశవరావు నవ్వేశాడు. "చిట్కాలు చెప్పడానికి నేనేం నాటు వైద్యుణ్ణి కాను. లాయర్ని. కేసుల్లో వున్న ఇబ్బందులూ, కష్ట నష్టాలూ చెబుతాను. వినడం, వినక




పోవడం క్లయింట్ల ఇష్టం"

"అదికాదు నేనంటూంట. రేపొద్దున్న ఆ మొదటి భర్త కోర్టుకెక్కి మా అమ్మాయిని రచ్చకీడుస్తే..."

"అందులో ఆశ్చర్యం ఏమీ లేదు. అలా చాలా చోట్ల జరుగుతోంది. అందుకే చట్ట ప్రకారం భర్తకి విడాకులిచ్చి— మళ్ళీ పెళ్ళి చేసుకోవడం ఆ అమ్మాయికి మంచిది"

లోపలి నుంచి నళిని, కౌముది వచ్చారు.

"నమస్కారం అండీ" అంది నళిని. ఆ తర్వాత కౌముదిని పరిచయం చేసింది.

"ఈమేనా మీరు చెప్పిన..." కేశవరావు ఆగిపోయాడు.

"ఈమె కాదండీ.. అది లోపల వుంది" అంటూ—

"పద్మా" అని లోపలికి చూసి ఓ కేక పెట్టింది.

లోపలి నుంచి పద్మ నెమ్మదిగా వచ్చి నళిని పక్కన కూర్చుంది. విఠల్ లోపలి నుంచి వస్తూన్న పద్మని చూశాడు. అతని కళ్ళు వెలవెల బోయాయి. నెత్తిమీద పెద్ద బండ పెట్టి పెట్టినట్టయ్యింది.

మోహనరావు పద్మవైపోసారి చూసి "నేను చెప్పిన మనిషి ఈవిడే..." అన్నాడు.

పద్మ కేశవరావుకి నమస్కారం చేసింది.

అమ్మాయిని చూశావుగా. టెన్త్‌క్లాస్ పాసయింది. ఆంధ్ర దేశంలో ఆడదాని సగటు చదువు ఆమె చదివిందన్నమాట. కానీ ఆమెది పల్లెటూరు. తాళికట్టిన భర్త కొద్దిరోజులు కాపురం చేసి పట్నం వెళ్ళి తిరిగి వస్తానంటే నమ్మింది. పట్నం వెళ్ళిన భర్త తిరిగిరాలేదు. చుక్కలు లెక్కబెడుతూ ఎదురు చూసి నిరాశపడి బాధా సర్పద్రష్టురాలై ఈ ఊరొచ్చింది భర్తని వెదుక్కుంటూ. చూడు—నా మిత్రులు, అదే ఈయన విఠల్.. ఆవిడ భర్తగారు. పెళ్ళిద్దర్నీ మేం కలిపాం అనుకోకు. వాళ్ళు కాకతాళీయంగా ఇక్కడ కలిశారు..."

"అరే ఆశ్చర్యంగా వుందే..."

"ఇంకా ఆశ్చర్యం విను. ఈయన గారి పేరు ఈ హైదరాబాద్‌లో విఠల్.. మా పద్మని అడిగితే ఆయన పేరు పాండురంగ అని చెప్తుంది. అదే ఈ పాండురంగ విఠల్ గారు గవర్నమెంటు ఉద్యోగి. ఆర్నెల్లుగా అదిగో ఆవిడ కౌముది అని నా భార్య స్నేహితురాలితో స్నేహంచేశారు. పాపం కౌముది చదువుకుంది. డిగ్రీ కూడా తీసుకుంది. ఉద్యోగ నిర్వహణలోనే ఈ స్నేహితుడు ఆమెకి తారసపడ్డాడు! ప్రేమనటిస్తే అది సత్యం అని నమ్మింది. పెళ్ళికి సిద్ధమైంది. వీళ్ళిద్దరూ మా సహాయంతో పెళ్ళి చేసుకోవాలనుకున్నారు."

కేశవరావుకి కేసు అర్థమయినట్టు చూశాడు.

"రిజిస్ట్రారాఫీసులో పెళ్ళి నోటీసు ఇచ్చారు లాయర్! అప్పటికే నాకూ, సతినికీ ఈ విషయం తెల్సు. కానీ కథకి టెంపో తీసుకురావాలని కౌముదికీ, పద్మకీ ఈ విషయం ఆరోజు చెప్పలేదు" అనేసి విఠల్ వైపు తిరిగి - "చెప్పండి విఠల్... మీరు కౌముదిని పెళ్ళి చేసుకుంటారా? అందుకోసం పద్మ మీకు విడాకులివ్వాలా. ఇందుకు మీ సంజాయిషీ ఏమిటి?"

విఠల్ మాట్లాడలేదు.

కౌముది కళ్ళు అప్పటికే పత్తి పువ్వులయ్యాయి. ఆమె గుండె బలహీనంగా కొట్టుకుంటోంది. సభ్యతకి దడిసి ఆమె కళ్ళు కన్నీళ్ళని తెరవెనకే ఆపుకున్నాయి.

"లేదు మోహనరావుగారూ! జరిగింది చాలు. ఆర్నెల్ల పరిచయంలో ఆయన ఒక్క మాట నాతో చెప్పలేదు. అంటే ఆయన మనస్తత్వం అర్థమవుతూనే వుంది. ఆయన నన్ను దగాచేశాడు. వంచించాడు. ఫర్వాలేదు. ఇలాంటి వాళ్ళు వుంటారని వినడమే కానీ ఇలాంటి వాళ్ళ పరిచయం మూలంగా మనస్సెంత గాయపడుతుందో ఈరోజు అనుభవంలో తెల్సుకున్నాను" అనేసి కౌముది విఠల్‌వైపు చూసి-"తెలిసి నువ్వు, తెలియక నేనూ ప్రేమ అనే నిప్పుతో చెలగాటాలాడాం. తెలిసి ఆడిన మూలంగా నీ చేతులూ, మనసూ మంటల రుచి చూసి వుండకపోవచ్చు. కానీ...కానీ ఇలాంటి పనిచేసి నువ్వు పొపుకునేది తాత్కాలిక ఆనందం. ఇంతమంది ముందు నోరు విప్పలేక, బలం వుండీ ప్రతఘటించుకోలేక, మనసు వుండీ చంపుకునే ఈ అవస్థే తగినశిక్ష నీకు" అనేసి కౌముది సోఫాలోంచి లేచి లోపలికి వెళ్ళింది.

వెంటనే పద్మ అంది — "నాన్న వెళ్ళమంటే ఈ ఊరు వచ్చాను అక్కా! ఆయన నన్ను మర్చిపోలేదనుకున్నాను. మళ్ళీ నేను కన్పిస్తే నన్ను ఆదరిస్తారను




కున్నాను. అమ్మో..ఇలాంటిచుప్పనాతితో నేను కాపురం చేయను. నాకు మొగుడు వద్దు, సంసారం వద్దు. నాకు చదువు చెప్పించు నళినక్కా చాలు" అనేసి తనూ లోపలికి వెళ్ళింది పద్మ.

"ఏమంటావ్ విఠల్...పాండురంగ విఠల్"

''ఇంకెందుకు? లెట్ హిమ్ గో ... లెట్ హిమ్ సీక్ హిజ్ ఫార్చ్యున్ ఎల్స్ వేర్'' అన్నాడు కేశవరావు.

"అలాకాదు లాయర్! ఇలాంటివాళ్లని అంత తేలిగ్గా వదలకూడదు. పద్మనీ, కౌముదినీ నేను ఒప్పిస్తాను. ఇతగాడు ఎలానూ రిజిస్ట్రార్ ఆఫీసులో అప్లికేషను ఇచ్చాడు. కమిట్ అయ్యాడు. అందుచేత కోర్టుకిలాగి, న్యాయం ఎలా వాతలు పెడుతుందో రుచిచూపిద్దాం. నువ్వు నోటీసు తయారుచేయి. ఒకటి రెండేళ్లు ఖయిదులో కూర్చున్న తర్వాత, ఉద్యోగం పోయిన తర్వాతగానీ అర్థంకాదు. ఏ సెక్షన్లో ఇతగాడిమీద కేసు పెట్టొచ్చు?"

కేశవరావు నెమ్మదిగా అన్నాడు-"భార్య వుండి మళ్ళీ పెళ్లి చేసుకోవడం న్యాయధిక్కారం కిందకి వస్తుంది. ఐ. పి. సి. 494 సెక్షన్ చాలు ఉద్యోగం పోవడానికి, శ్రీకృష్ణజన్మస్థానంలో కూర్చోడానికి''

విఠల్ ముందుకు వంగాడు. అతని కళ్ళలో అప్పటికే భయం గూడుకట్టు వుంది.

''నన్ను క్షమించి వదిలేయండి. బుద్ధొచ్చింది" అన్నాడు.

"తేలిగ్గా వదిలిపెట్టమంటావా" మోహనరావు అన్నాడు.

''ఒక షరతుమీద వదిలిపెట్టండి'' అంది నళిని.

''ఏమిటది!" అన్నారు.

''మన పద్మ జీవితం సరిదిద్దాలంటే దానికి ఇతగాడితో విడాకులు అవసరం. పద్మచేత ఈరోజే విడాకులకి నోటీసు ఇప్పిద్దాం. ఇతగాడు ఏ గొడవా చేయ కుండా అధికారాలూ - అర్హతలూ ఎత్త కుండా పద్మనుంచి దూరంగా పోవాలి. పద్మకి విడాకులు దొరికిన తర్వాత అతన్ని మనం వదిలేద్దాం.

''మీరు చెప్పినట్టు వింటాను" అన్నాడు.

''లాయర్! ఇతగాడిచేత ఏ కాగితాలమీద సంతకాలు చేయించుకుంటావో నీ ఇష్టం. మనం ఎప్పుడు రమ్మంటే అప్పుడు వచ్చేటట్టు బిగించు మనిషిని"

మోహనరావు, నళినీ లోపలకు వెళ్ళారు.

కేశవరావు చెప్పినదానికల్లా తలవూప సాగాడు విఠల్.

* * *

కౌముది భగ్నప్రేమ విషయం ఆఫీసులో చాలామందికి నోళ్ళు నొక్కుకునేందుకు చోటిచ్చింది. పైగా విఠల్ సడన్‌గా రిజైన్‌చేసి వెళ్ళిపోవటంతో అగ్నికి ఆజ్యం తోడయినట్టయింది. చాలామంది హేళనగానూ, కొద్దిమంది సింపతితోనూ చూడ్డం కౌముదికి అర్థమవుతూనే వుంది.

మనుషుల్లో ఎదటివాళ్ళ జయాపజయాలమీద అంత తహతహ ఎందుకుండాలో కౌముదికిఅర్థంకాలేదు. కౌముది తండ్రిముందు ఏదీ దాచలేదు. తండ్రి టూరునుంచి వచ్చిన మర్నాడు రాత్రి అంతా చెప్పి దాపుకుంది.

''ఏం చేస్తాం, నీ దురదృష్టం. జరిగింది మర్చిపోవడానికి ప్రయత్నించు. అంతకన్నా చేసేదేం లేదు" అన్నాడాయన. ఆ పరిస్థితిలో అంతకన్నా ఏం



చెప్పాలో తెలియలేదాయనకు.

నాలుగురోజుల తర్వాత ఆఫీసునుంచి వచ్చేసరికి వాకిట్లో తండ్రితో మాట్లాడుతున్న రామానుజం కన్పించాడు. జోళ్ళు విప్పి లోపలికి పోబోయింది.

"బేబీ..ఏవిటి లోపలికి వెడుతున్నావ్! ఇటురా" అన్నాడు.

కౌముది తండ్రిపక్కన నుంచుంది.

"నిన్నుచూసి నాలుగు నెలలయ్యింది. ఆవేళ నా కారులో...''

''అవును''

''మా ఇంటికి వస్తానన్నావ్"

''మర్చిపోయాను"

కౌముది లోపలికి వెళ్ళి తల్లి ఇచ్చిన కాఫీలు తెచ్చి తండ్రికీ, రామానుజానికీ ఇచ్చింది. రామానుజం ఏదో సంబంధం గురించి తండ్రితో చెప్పడం కౌముది వింది. ఇంతలో శాంతమ్మ లోపలి నుంచి-

"మా అమ్మాయికి మీరైనా ఓ సంబంధం చూడండి అన్నగారూ... ఈయన వల్ల ఏపనీ కాదు" అంది.

కాసేపటి తర్వాత తండ్రి రామానుజం గారితో కల్సి వెళ్ళడం చూసింది.

కౌముదికి తండ్రి తన పెళ్ళి ప్రసక్తి రామానుజం దగ్గర తేవడం నచ్చలేదు. తండ్రికి గట్టిగా చెప్పాలనుకుంది.

అందుకే రాత్రి తండ్రితో చూసి—"ఆ రామానుజంగారితో మనింటి విషయాలు మాట్లాడకు నాన్నా..."

"ఆదేం"

"ఎందుకో నాకిష్టం లేదు"

"నేనుగా అనలేదు. ఆయనే అడిగాడు.. చెప్పాను. ఆయన ఎరుగున్న అతను ఒకడు వున్నాట్ట. పెళ్ళికి కావల్సిన సహాయం ఆయన చేస్తానన్నాడు"

కౌముదికి మరేం చెప్పాలో తెలియలేదు. ఎదటివాళ్లు మన కష్టాలకి చలించక మనల్ని చూసి నవ్వితే 'పిఛ్ల మనుషులా, రాళ్ళా' అని మధన పడతాం. ఎవరైనా, ముందుకు వచ్చి ఆప్యాయంగా మాట్లాడితే, మితిమీరిన చనువు తీసుకుంటే వాళ్ళని అనుమానిస్తాం. మనిషి గుణగణాలు కొలవడానికి ఏదైనా కొలమానం వుంటే ఎంత బావుణ్ను. చాలా చాలా ఇబ్బందులూ, కన్నీళ్ళూ ఈ మనుషులకు తప్పేవి అన్పించింది కౌముదికి.

కౌముదికి ఈమధ్య రాత్రుళ్లు నిద్ర పట్టడం లేదు. అతి దగ్గరగా వచ్చి మనసు మీద పెద్ద దెబ్బకొట్టిన విశాల్ తరుచు గుర్తుకువస్తాడు. అతన్ని తను ఆ రోజు చాలా తేలిగ్గా క్షమించింది. ఒక్క పరుష వాక్యం, ఒక్క ఛీత్కారం చేయలేదు. అందుకేనేమో గుండెల్లో మంట రాజుకున్న పొయ్యి మాదిరి అలానే కాలుతోంది.

జీవితంలో కన్పడని లోటు-ఇప్పుడు అగాధం అయినట్టుగా వుంది. నిజమే... ఆడదాని జీవితం అగాధం. గాలివానలు, పెనుతుఫానులు, మండుటెండలు-ఎన్ని చవిచూసినా ఆ అగాధంలో మార్పురాదు. ఋతువులు, కాలాలు ప్రపంచం అంతా పంచిపెట్టే మంచి మార్పుల్ని అగాధాలు అందుకోలేవు.

కౌముది ఒత్తిగిలి పడుకుంది. కన్నీళ్లతో తలగడ తడిసి ఆ తడి బుగ్గకి తగిలింది.

'ఏడ్వడం తప్పు... నేనేం తప్పు చేశానని' అనుకుని తనకి తనే ధైర్యం చెప్పుకుంది.

* * *

మర్నాడు బలరామ్మూర్తి కౌముదిని

చూసి, "సాయంకాలం పెందరాళే ఇంటికి వచ్చేయ్. రామానుజంగారు ఎవరో పెళ్ళి కొడుకునితీసుకువస్తామన్నారు" అన్నాడు.

కౌముది ఓ క్షణం తండ్రి మొహం వైపు చూసింది.

"ఏవిటే రాయిలా మాట్లాడవు. మళ్ళీ నళినీ అంటూ దానింటికి పోకు. ఏం చెప్పాలో తెలియక మధ్య మేం చస్తాం" అంది తల్లి శాంతమ్మ.

ఆఫీసు పని మామూలే. సెక్షన్ ఆఫీసర్ గురుమూర్తి—

"ఏవిటి అలా వున్నావ్" అన్నాడు ఆ రోజు.

"మామూలుగానే వున్నానే" అంది కౌముది.

"ఈ విఠల్ ఖాళీ చేసిన జాగాలో షురో క్లర్క్‌ని వేయమని నాల్గునెలల నాడు ఫైల్ రాసి పంపించాం. ఇంత వరకూ ఆ సీటు అలానే వుంది" అన్నాడు తనలో తనుగా.

కౌముది మాట్లాడలేదు.

"విఠల్‌కి మరోచోట మంచి ఉద్యోగం దొరికిందేమో..." అన్నాడు.

అది తననడిగే ప్రశ్న అని కౌముదికి అర్థమయ్యింది.

"పెళ్ళి చేసుకుని వుంటాడీపాటికి" తిరిగి అన్నాడు ఆయనే.

అలా ఓ గంట గురుమూర్తి కౌముదికి వినబడేటట్టు విఠల్ నామస్మరణే చేశాడు. కౌముదికి విసుగేసి ఓ లీవు రాసి గురుమూర్తి టేబిల్ మీద పెట్టి—

"పనుంది వెడుతున్నాను" అంది.

"చాలా పనుంది. ఇలా శెలవు పెట్టేస్తే ఎలా...ఇంటికేనా?" అన్నాడు చనువుగా.

"కాదు..." అనేసి కౌముది బయటకు నడిచింది. కౌముదికి తన వెనక నవ్వులు విన్పించాయి.

కౌముదికేం చేయాలో తెలియలేదు. నళిని ఇంటికి బయలుదేరింది.

"చాలా రోజుల తర్వాత కన్పించావే. మావారికి ఈ ఊరినుంచి బెంగుళూరు బ్రాంచ్‌కి ట్రాన్స్‌ఫర్ అయ్యింది. నేనే ఫోన్ చేసి చెబుదామనుకున్నాను.... నువ్వే వచ్చావ్" అంది నళిని.

కౌముది క్షణం తెల్లబోయింది. ఆ తర్వాత "మంచి స్నేహితులు మీరూ దూరంగా వెళ్ళిపోతున్నారు" అంది బాధగా.

"మంచి స్నేహితులు ఎంత దూరం అయినా ఫర్వాలేదు. పిలిస్తే పలుకుతారు. మీకేం ఇబ్బంది వచ్చినా ఉత్తరం రాయండి. రావాలనుకుంటే చెప్పా పెట్టకుండా వచ్చినా మీకు నా ఆహ్వానం ఎప్పుడూ వుంటుంది" అన్నాడు మోహనరావు నవ్వుతూ.

కౌముది నళినిని కౌగలించుకుంది. ఆమెకి గుండె ఎగసి పడింది. గబగబా గేటు దాటి వీధిలో పడింది. ఇంటికి వచ్చి వాకిట్లోకి చూసింది. తండ్రీ, రామానుజం కాకుండా మరో యువకుడు వాకిట్లో కన్పించాడు.

"త్వరగారావే అంటే ఇంత ఆలస్యమా? తొందరగా ముస్తాబుకానీ"

కౌముది మారు మాట్లాడకుండా దొడ్లో నూతిదగ్గరకు వెళ్ళింది. పావు గంటలో తయారయి తల్లి వెనకరాగా వాకిట్లోకి వెళ్ళి స్టీల్ చెయిర్‌లో కూర్చుంది.

"బేబీ పేరు కౌముది. బి.ఏ. పాస య్యింది" అంటూ రామానుజం తన గురించి చాలా చాలా చెప్పడంతో కౌముది





ఒంటి మీద తేళ్ళూ. జర్రులూ పాకినట్లుగా వుంది.

"వీడు మా అబ్బాయిలాంటివాడు. చదువు చెప్పించాను. ఉద్యోగం వేయించాను. నా మాట అంటే వేదవాక్యం. పేరు సుకుమార్..."

"నువ్వేమయినా మా అమ్మాయిని అడుగుతావా బాబూ" అన్నాడు.

"అతగాడేం అడుగుతాడు... నేనెంత చెబితే అంత" రామానుజం తిరిగి అన్నాడు,

రామానుజం అరగంట కౌముదిని ఏవేవో అడిగాడు. కౌముది అయిష్టంగానే వాటికి సమాధానం చెప్పి, "నేను లోపలికి వెడతాను నాన్నా.. తలనొప్పిగా వుంది'' అంది.

"తలనొప్పా... నా దగ్గర టేబిలెట్స్ వున్నాయ్... తీసుకో" అంటూ రామానుజం కుర్చీలోంచి లేచి ఓ టేబ్లెట్ కౌముది చేతిలో పెట్టాడు.

కౌముది లేచి లోపలికి వెళ్ళింది.

* * *

మర్నాడు బలరామ్మూర్తి రామానుజం ఇంటికి వెళ్ళి చాలా పొద్దుపోయిన తర్వాత తిరిగి వచ్చాడు. కౌముది తన గదిలో పడుకుని ఏదో నవల చదువుతూ అప్పుడే లైటార్పింది. బయట తండ్రి పిలుపు విని వెళ్ళి తలుపు తెరిచింది.

''నువ్వు కాళ్ళు కడుక్కునిరా నాన్నా...వడ్డించేస్తాను'' అంది.

"అమ్మేం చేస్తోంది... నిద్ర పోతోందా?"

"బాగా జ్వరం వచ్చింది. ఇప్పుడే పడుకుంది"

బలరామ్మూర్తి కాళ్ళు కడుక్కుని వచ్చి పీటమీద కూర్చున్నాడు. కౌముది ఆయన కెదురుగా గిన్నెలు పెట్టి పక్క పీట మీద కూర్చుంది. కౌముదికి తండ్రి ఎక్కడికి వెళ్ళాడో తెలుసు. కానీ వెళ్ళిన పని ఏమయిందని అడగాలనిపించడం లేదు. అటు బలరామ్మూర్తిగారేమనుకున్నారో, కొంచెం సేపాగి–

"ఆ అబ్బాయికి నువ్వు నచ్చావుట. కట్నం ఏం అక్కరలేదుట. మన వీలుని బట్టి ముహూర్తం పెట్టించుకోమన్నారు"

"రామానుజంగారు చెప్పారా... ఆ అబ్బాయా?" అంది కౌముది నెమ్మదిగా.

"అతగాడు కేంప్ మీద వెళ్ళాట్ట... రామానుజం చెప్పాడు. ఏం నీకేదన్నా అనుమానంగా వుందా?" తలవంచుకునే అడిగాడు.

"అనుమానం కాదుగానీ..."

"నాకు తెలుసు. రామానుజం అదో రకం మనిషి... కొంచెం అతిగా వాగుతాడు. మనిషి మంచివాడే. వాడి చదువులూ, దేశంలో తిరగడం వాటినలా తయారు చేశాయి"

కౌముది జవాబు చెప్పలేదు.

"ఇప్పట్లో ఇంతకన్నా మంచి సంబంధం దొరుకుతుందని నాకు నమ్మకం లేదు. కాళ్ళ దగ్గరకు వచ్చింది. నువ్వూ ఉద్యోగం చేస్తున్నావ్. పెళ్ళి కాకుండా మమ్మల్ని పోషించడం ఆదర్శం మాటటుంచి, మాకు వెగటుగా వుండకూడదు. అన్నయ్య దూరంగా వుండి వచ్చి చూడకపోతే మన రోజులు వెళ్ళలేదా? అలాగే ఇదీనూ! నాకు ఏదో ఒకటి రెండు ప్రైవేటు కంపెనీల్లో పని దొరికేటట్లుంది. మా ఇద్దరికీ ఎంతకావాలి..."

"అమ్మకుకి వంట్లో బాగోలేదు. నిన్న ఆస్పిటల్‌కి తీసుకు వెళ్ళాను. బ్లడ్ ప్రెషర్ వుంది... మంచి వైద్యం జరక్కపోతే..."

"అమ్మక్కి తగ్గితే నాకు వస్తుంది అనారోగ్యం. వీటి గురించి ఆలోచిస్తూ కూర్చుంటే.." బలరామ్మూర్తి చేయి కడుక్కుని భుజం మీద తువ్వాలుతో మూతీ కాళ్ళూ తుడుచుకుని వాకిట్లోకి వెళ్ళాడు. కౌముది నిశ్శబ్దంగా వంటగది శుభ్రం చేసి తన గదిలోకి వెళ్ళి మంచం మీద పడుకుంది.

మర్నాడు ఆఫీసుకు వెడుతూంటే తండ్రి "కౌముదీ" అని పిల్చాడు.

"ఏం నాన్నా..."

"ముహూర్తం పెట్టిస్తాను...సరేనా"

"సరే..."

కౌముది భుజానవున్న హేండ్‌బేగ్ మరోసారి సరిజేసుకుని బస్‌స్టాప్ వరకూ నడక సాగించింది. ఎంతోమంది ముందు నడుస్తున్నారు. వెనక కూడా మరెంత మందో వస్తున్నారు. ఒకళ్ళని దాటి ఒకళ్ళుముందుకు పోతూంటారు. కొందరు ఎప్పుడూ వెనకే పడతారు.

* * *

కౌముది ఆఫీసుకు వెళ్ళి అలవాటుగా టైపు మిషన్ శుభ్రం చేసి అర్జంటు కాగితాలు టైపుచేసి ట్రేలో పడేసింది. ఆతర్వాత బేగ్ తెరచి ఇన్‌లాండ్ కవరు తీసుకుని నళినికి ఉత్తరం రాయడం మొదలుపెట్టింది.

"మా సార్ ఈ ఉత్తరం జల్దీ కొట్టి అట్టుకురమ్మన్నారు"

కౌముది తలెత్తి చూసింది.

కొత్త ఫ్యాన్.

"ఏడీ రాములు రాలేదా ఈవేళ ఆఫీసుకు"

"నాయన శెలవ్‌లో పోయిండు"

"ఓ... నువ్వు..." అంది కౌముది. ఆపైన మరేమనలేకపోయింది.

"రాములు మా నాయనవుతాడు"

అంటే యాదగిరికి ఉద్యోగం దొరికిందన్నమాట. కౌముది తలెత్తి యాదగిరిని చూసింది. యాదగిరిని చూసి పదిహేనేళ్ళు అవుతోంది.

"ఏ సెక్షన్లో పనిచేస్తున్నావ్?"

యాదగిరి చెప్పాడు.

"నేను గుర్తున్నానా యాదగిరీ?" అంది నెమ్మదిగా.

యాదగిరి ఓసారి కౌముది కళ్ళల్లోకి చూసి "అవ్" అన్నాడు.

"ఏదో చిన్నప్పుడు.. తెలియక ఏదో గొడవ జరిగింది. మనసులో వుంచుకోకు"

"ఏం లేదులే" అన్నాడు మొహం పక్కకు తిప్పుకుని. ఆతర్వాత వెళ్ళి తండ్రికూర్చునే బల్లమీద కూర్చున్నాడు.

కౌముదికి ఒక్కసారి తిరిగి స్కూలు రోజులు గుర్తొచ్చాయి. చిన్నతనం తిరిగిరాదు.. అజ్ఞాపకాల అల్లిక..ఆఉత్సాహం, ప్రపంచాన్నీ పరిహసించే ఆ అజ్ఞానం, జ్ఞాపకాల మరుగున పడిపోతాయి. అప్పుడప్పుడు గుర్తొచ్చి తీయని కలగా మెదుస్తుంది బాల్యం... రోజూ గుర్తుకు వచ్చి

గాయంలా వేధిస్తుంది వర్తమానం. కౌముది పేపరు సైపు చేసి యాదగిరి కోసం చూసింది. యాదగిరి తనతోటి ప్యూన్‌తో కబుర్లుచెబుతున్నాడు. "యాద గిరీ...'' పిల్చింది. యాదగిరి వచ్చాడు. కాగితాలు అతని చేతికిచ్చింది. యాదగిరి చాలా మారాడు. మనిషి పొట్టిగా వుండే వాడు. పెద్దకళ్ళు.. తీరైన ముక్కు... బక్కపల్చగా వుండేవాడు. పెద్దమీసాలు, చంపలదాకా జుట్టు. పొడుగయ్యాడు... చదువుకుని వుంటే మరింత సంస్కారం అలవర్చుకునేవాడేమో! కానీ ఆ చదువు తనమూలంగానే ఆగిపోయింది!! ఇంతలో సెక్రటరీ రూమ్ నుంచి కోటైపిస్ట్ వచ్చి,

"నీకు ఫోన్ కౌముదీ" అంది. కౌముది లేచి ఫోన్ దగ్గరకు వెళ్ళింది.

"హలో నేను బేబీ..."

కౌముది ఓసారి పనిచేసుకుంటూన్న డైరక్టర్ని చూసి-

"చెప్పండి ఏమిటి..."

"కంగ్రాట్యులేషన్స్"

"దేనికి"

''పెళ్ళికూతురివయిపోయావుగా"

''సరే... తర్వాత మాట్లాడు కుందాం"

''అసలు విషయం ఏమిటంటే ఐదు గంటలకు నేను కారుతో మీగేటు ముందు నుంచుని వుంటాను. నీతో అర్జంటుగా మాట్లాడాలి"

కౌముది ఏమనాలో తెలియక "అలాగే వుంటాను" అని ఫోన్ పెట్టేసింది.

మధ్యాహ్నం మూడు గంటల నుంచీ కౌముది గుండెల్లో రైలు పరుగెత్తడం మొదలయ్యింది. రామానుజాన్ని ఎలా వదుల్చుకోవాలో ఎంత ఆలోచించినా ఆమెకు అర్థంకాక విసుగుతో తలపట్టు కుంది. తర్వాత లేచి సెక్షన్లో తిరిగింది.. స్నేహితులతో కల్పించుకుని మాట్లా డింది.

అయిదయింది. కౌముది బయటకు రాగానే రామానుజం కారులోంచే 'బేబీ' అని పిల్చాడు. కౌముది అంటూ ఇటూ చూసి తలవంచుకుని కారెక్కింది.. రామా నుజం కారు స్టార్టుచేసి, ''అంతా నే అను కున్నట్టే జరిగింది.. గుడ్" అని ఆగి,

"మీనాన్నతో నేనన్నీ మాట్లాడాను.. సుకుమార్ నీకు నచ్చినట్టేనా?"

కౌముదికి ఏమనాలో తెలియలేదు. లోపలినుంచి తన్నుకువచ్చే కోపాన్ని ఆపుకుంది.

"అతను నా ప్రయివేటు కంపెనీలో ఇంజనీరింగ్ సైడ్ వర్క్ చేస్తాడు. చాలా బుద్ధిమంతుడు. నెలకి ఆరువందలు ఇస్తు న్నాను. మీపెళ్లి అయిన వెంటనే వెయ్యి రూపాయల జీతం ఇస్తానన్నాను"

"ఆశ పెట్టారన్నమాట"

"మనిషికి ఏదో ప్రలోభం వుండాలి కదా అతనింతవరకూ బయట రూమ్‌లో వుంటున్నాడు. పెళ్లి అయిన తర్వాత మీరిద్దరూ ఇక్కడే కాపురం పెట్టాలని మరో కండిషన్ కూడా పెట్టాను"

"దానికి ఒప్పుకుని వుండాలి ఆయన గారు..."

రామానుజం నవ్వేసి "ఇప్పటి నుంచీ ఆయనగారనడం అలవాటు చేసుకో నక్కరలేదు. భర్తని నువ్వనే భార్యల్ని ఎంతోమందిని చూశాను. దానివల్ల ప్రేమేం తరిగిపోదు"

"అది కూడా మరో షరతు అనిగాని చెప్పారా?"

"నువ్వు చెప్పమంటే గట్టిగానే చెప్తాను"

కౌముదికి వాతావరణం అదోలా

 

అన్పించింది. చిన్నగా నవ్వి - "అన్నీ మీరు చెప్పినట్టేచేస్తే ఆఖరికి నేను చెప్పేదీ, ఆయన వినేదీ ఏమీవుండదేమో" అంది.

"అలావింటే భార్యాలోలుడుఅంటారు. నీకు మంచి భర్తగా అతన్ని ఎలా తర్ఫీదు చేస్తానో చూస్తావుగా..."

"కారు ఆపండి"

"ఓ" అంటూ రామానుజం కారుఆపి "నేఉన్నాను.నీకేంభయంలేదు"అన్నాడు.

కౌముదికి కారుదిగగానే బోనులోంచి బయటపడ్డట్టు అన్పించింది. మెదడంతా రామానుజం మాటలే ఘోష పెడు తున్నాయి. తనెక్కడికి పోతోంది...? ఏమిటీ జీవితం? ప్రశ్నలు వేలకువేలు. ఎవరీ సుకుమార్..ఎవరీ రామానుజం.. అసలు రామానుజం తెచ్చే సంబంధం తనెందుకు ఒప్పుకుంది? కౌముదికి కళ్లు చెమరుస్తోన్నట్టు తెలుసు. గుండె బరువవు తోనట్టు తెలుసు...మెదడు చిత్తుకాగితంగా మారినట్టూతెలుసు. అన్నీ తెలుసుకానీ...

* * *

కౌముది ఈ పెళ్ళిపట్ల తన విముఖతని తల్లిదండ్రుల ముందు ఎలా చెప్పాలా అని ఆలోచిస్తూనేవుంది. తల్లి కూతురు పెళ్ళి కుదిరిందన్న సంతోషంతో అనా రోగ్యం గురించి పట్టించుకోకుండా తిర గడం, అప్పుడే పెళ్ళి జరిగిపోతోన్నట్టే మాట్లాడ్డం చూస్తే కౌముది అవాక్కు అయిపోవల్సివచ్చింది. తండ్రి తల్లిమాదిరి హడావిడి చేయకపోయినా ఆయన కళ్ళల్లో కూడా ఏదో కొండంత వెలుగు, మనిషిలో కొత్త సత్తువ వచ్చినట్టు మాట్లాడంచూసే కౌముదికి భయం వేసింది. సుకుమార్‌తో పెళ్లి ఇష్టంలేదని చెప్పడానికి కౌముదికి సజావయిన కారణం దొరలేదు. తండ్రి శుభలేఖల నమూనాలూ, ఆహ్వానించ వల్సిన బంధువుల గురించీ, పెళ్లి ఏర్పాట్ల గురించీ మాట్లాడ్డం, తల్లి పెళ్లి పనుల గురించి ఏకరువు పెట్టడంతో కౌముదికి తలదిమ్మెత్తిపోయింది.

"ఒక్కత్తినీ ఇంటిపనులు చూసుకో లేను. ఆ ఆఫీసుకు శెలవు పెట్టు తల్లీ" అంది శాంతమ్మ కౌముదికి నచ్చజెప్తూ.

"రామానుజంగారు మూడువేలిచ్చారు. ఆఫీసులో నీకేమైనా లోన్లులాంటివి వస్తే అప్లయిచెయ్యి...నీఖర్చుకి వుంటుంది" అన్నాడు బలరామ్మూర్తి.

"మీరలా అన్నారంటే ఆ మొత్తం డబ్బెట్టి అది చీరలు కొనేసుకుంటుంది. ఏఖర్చు వస్తుందో చెప్పలేం. చేతిలోవుంచు కోండి"

కౌముది నెమ్మదిగా అంది-"రిఫండ బుల్ లోను నాకు కొద్దిగా రావొచ్చు. సశినికూ్కడా రాస్తాను. మళ్ళీ రామానుజం గారి డబ్బెందుకు నాన్నా. ఆయన డబ్బు వాపసు చేసేస్తే పోలా"

"అదేవిటే..." అంది శాంతమ్మ ఆశ్చర్యంగా.

"ఆయనతోనే చెప్పాను. అప్పుగా అయితేనే తీసుకుంటానని" బలరా మ్మూర్తి నచ్చచెబుతూ అన్నాడు.

"మన బరువు ఆయన మోయడం ఎందుకో నాకిష్టంలేదు"

"జనార్దనానికి ఉత్తరం రాశాను. కనీసం వాడొచ్చేనాటికి ఏదైనా డబ్బు పట్టుకు వస్తాడేమో చూద్దాం. అదే నిజ మైతే రామానుజం డబ్బు వాపసు చేసేద్దాం"

"కోడల్ని తీసుకుని కొంచెం త్వరగా రమ్మని రాయండి."

"ఆ—నిన్ననే రాశాను"

కౌముది ఆఫీసుకు బయలుదేరుతూంటే శాంతమ్మగారు తిరిగి ఓ పొలికేక పెట్టింది "సోమవారం నుంచి శెలవు పెట్టు. ఆరోజు మంచిరోజు. పెళ్లికూతుర్ని చేయాలి నిన్ను"

* * *

కౌముదిని ఆ రోజు పెళ్లికూతుర్ని చేశారు. చుట్టుపక్కల ఆడవాళ్లు వచ్చారు. కౌముది తలంటి పోసుకుని కొత్త చీర కట్టుకుంది. పేరంటం చేసింది తల్లి. ముత్తయిదువలు అక్షతలు చల్లి హారతులిచ్చారు. కౌముది పిలిచిన ఆఫీసు కొలిగ్స్ వచ్చారు.

ఫంక్షన్ అయ్యేసరికి సాయంత్రం ఐదున్నర అయ్యింది. అప్పటికే బలరామ్మూర్తి బయటకు వెళ్ళాడు. శాంతమ్మ వంట పనిలో మునిగింది.

కౌముది వాకిట్లో బరకాలు తీసి హాలంతా వూడ్చి శుభ్రం చేస్తోంది. ఇంతలో బయటి నుంచి పక్కింటివారి చిన్నబ్బాయి వచ్చి "అక్కా.. రోడ్డు మీద ఓ అంకుల్ కనబడి ఈ చీటి నీకిమ్మన్నాడు" అని కాగితం చేతిలో పెట్టి బయటకు తుర్రుమన్నాడు.

కౌముది ఆశ్చర్యంగా చీటీ విప్పింది.

"మీతో అర్జంటుగా మాట్లాడాలి. నేను మీ లైనులో వున్న హోటల్ వసంత్ విహార్‌లో కూర్చున్నాను. తప్పకుండా వెంటనే బయలుదేరి రండి.

సుకుమార్"

కౌముదికి గుండె దడదడలాడింది. ఎందుకో చేతులు వణికాయి.

"అమ్మా.. కొంచెం బయటకు వెళ్లి వస్తాను. తలుపేసుకో" అని వంటింట్లోకి కేకేసి అద్దం ముందు నిలబడి పాపిడిలో తలలో చిక్కుకున్న అక్షతలు దులుపుకుని, తల సరిజేసుకుని, కట్టుకున్న కొత్త చీర విప్పేసి వాయిల్ చీర కట్టుకుని,నుదుటిమీద పొడుగాటి కుంకుమ నామం బదులుగా తిలకం దిద్దుకుని బయలుదేరింది.

"చీకటిపడుతూంటే ఎక్కడికే?"

"అరగంటలో వచ్చేస్తాను"

కౌముదికి వసంత్ విహార్ కౌంటర్ దగ్గరే నుంచున్న సుకుమార్ కన్పించాడు. సుకుమార్ కూడా కౌముదిని చూసి హోటల్ గుమ్మాలు దిగి –

"ఇక్కడ దగ్గర్లో పార్కు వుందికదా! అక్కడికి వెళ్లి కూర్చుందాం" అన్నాడు కంగారుగా.

కౌముది తల ఊపింది.ఆమె మెదడులో ఆలోచనలు ఆగిపోయాయి.

ఇద్దరూ మౌనంగా నడిచారు. అప్పటికే ఆరు దాటింది. పార్కులో దట్టంగా వున్న చెట్ల మూలంగా బయట మించిన చీకటిగా వుంది.

"ఇక్కడ కూర్చుందాం"

ఇద్దరూ దూర దూరంగా కూర్చున్నారు.

"ఇలా జరిగిందేమిటి" అన్నాడు ఆదోలా.

'ఎలా?' అనాలనుకుంది కౌముది. కానీ ఆమెని ఆ ప్రశ్న వేయనీయకుండానే సుకుమార్ తిరిగి అన్నాడు–

"రామానుజంగారి ఉత్తరం అందేసరికి నేను బెంగుళూరునుంచి మైసూరు వెళ్లాను. వచ్చేసరికి ఉత్తరం ఉంది రూములో"

కౌముదికి ఏమనాలో తెలియలేదు.

"ఈ పెళ్ళి మీ నాన్నగారు కుదిర్చారా లేక రామానుజంగారా?"

"అంతే" అని, కౌముది తిరిగి




"ఆయనా, నాన్నగారూ స్నేహితులు. వాళ్లిద్దరూ కలిసే చేసుంటారు" అంది.

"ఆయన నన్ను మాటమాత్రం అడగలేదు. పెళ్లిచూపులకి రమ్మన్నారు. ఆయన మాట కాదనలేక వచ్చాను" కాసేపు ఆగి సుకుమార్ గొణుక్కుంటున్నట్టు అన్నాడు -

"నామీద ఆయన అధికారం ఏమిటో నాకర్థం కాదు. చిన్నప్పటినుంచీ చదివించాడు. ఉద్యోగం ఇచ్చాడు. నిజమే... అయితేమాత్రం. ఇంత చనువా"

కౌముదికి సుకుమార్ చీకట్లో నీడలా కన్పిస్తున్నాడు.

"జీతం పెంచుతాట్ట. హోదా పెరుగుతుందిట. ఎందుకు? ఎవరికోసం? ఇవన్నీ ఆయన ఎందుకు చేస్తున్నాడో నాకర్థం కాదు" కసిగా తిరిగి అన్నాడు.

"మీరేం అంటున్నారో నాకర్థం కావడం లేదు" కౌముది అయోమయంగా అంది.

"ఒకమాట చెప్పండి. నేనెవరో, నా కుటుంబం ఎటువంటిదో, నేనెటువంటివాణ్ణో మీకు గానీ,మీ నాన్నగారికి గానీ తెలుసా? సంబంధం చూసుకునేటప్పుడు ముఖాముఖీ పెళ్లికొడుకువాళ్ళతో సంప్రదించడం మామూలుగా జరిగే పని. మీ పెళ్లికోసం మీ నాన్నగారెందుకు ఇంతగా కంగారుపడ్డారో నాకర్థం కావడం లేదు"

కౌముదికి సుకుమార్ మాటల్లో ఏదో ఎత్తిపొడుపు, మరేదో అనుమానం ఉన్నట్టు అర్థమయ్యింది.

"మీరన్నది నిజమే. కానీ తొందరపాటు వెనక దురుద్దేశం ఉంటుందని ఎందుకనుకుంటున్నారు"

"మిమ్మల్ని అవమానించడం నా ఉద్దేశం కాదు. ఈ రామానుజం అంటే నాకు వళ్లు మంట. ఆయన సంగతి మీకు తెలియదు... మనుషుల బలహీనతలతో ఆడుకునే మనిషాయన. నా జీవితంలో ఆయన ప్రమేయాన్ని తగ్గించుకోవాలని చూస్తూంటే ఆయన నా జీవితాన్నే ఆక్రమించుకోవాలని చూస్తున్నాడు. ఇది నేను సహించను"

"అయితే..."

"కనీసం ముందుగా మీరుగానీ, మీ నాన్నగారు గానీ నాకో ఉత్తరం రాసుంటే బావుండేది" అని కౌముది వైపు చూసి– "ఈ పెళ్ళి ఆపలేరా మీరు. ప్లీజ్...ఎలాగయినా సరే మన పెళ్లి జరక్కూడదు. అలా జరిగితే నా జీవితం ఒక్కటే కాదు – మీదీ, ఆతర్వాత..ఆ తర్వాత..."

కౌముదికి తలలో అణుబాంబులు పేలినట్టుగా అన్పించింది. వెన్నులో మంటలు రేగాయి. ఆమెకి సుకుమార్‌కి ఏం జవాబు చెప్పాలో అర్థం కాలేదు. ఒకవిధమైన బాధ, అంతకుమించి అవమానం శరీరం అంతా ఆక్రమించాయి.

"అసలీ తతంగం పెళ్లి వరకూ వస్తుందనుకోలేదు. ముసిలాడు ప్రాణం తోడితే మీ ఇంటికి వచ్చాను. ఈవేళే, అదీ ఆ హోటల్‌లోంచే మిమ్మల్ని చూశాను. నాకు పెళ్లి చేసుకునే అమ్మాయిమీదా, కాబోయే భార్యమీదా చాలాచాలా ఊహలున్నాయి. ఇలా అవుతుందనీ, ముక్కూ మొహం తెలియని మిమ్మల్ని బాధపెట్టాల్సి వస్తుందనీ, ప్రాధేయపడాల్సి వస్తుందనీ నేనెప్పుడూ అనుకోలేదు. చెప్పండి"

కౌముది నేలవైపు చూస్తూ ఉండిపోయింది.

"మీరు బాధపడుతున్నారా?"

కౌముదికి ఏడుపు వచ్చినంతపనైంది. బాధపడుతోందా తను? అసలు బాధపడే, ఆ బాధని తలదాల్చి మోసే అర్హత ఉందా తనకి? తెలివితక్కువతనంతో చేసే పనికి శిక్ష అంటూ ఉంటుంది గానీ వెక్కి వెక్కి ఏడ్చే అధికారం, హక్కు కూడా వుండవు.

"మాట్లాడకండి. నేను మీ ఇంటికిగానీ వచ్చానని అనుమానం వేసిందా ఆ రామానుజం ఊరంతా నా కోసం గాలిస్తాడు. నేను ఈ రాత్రి ట్రయిన్‌కే బెంగుళూరు వెళ్ళిపోతాను"

"ఆయనకి ఏ సమాధానం చెబుతారు మీరు? రేపైనా నాన్న ద్వారా ఈ విషయం ఆయనకు తెలియాలిగా...."

"అక్కడకు వెళ్ళి ఉత్తరం రాసి పడేస్తాను. అంతగా అయితే రెండు మూడు ట్రంక్‌కాల్స్ చేస్తాడు. దొరకను. మరీ కోపం వస్తే ఉద్యోగం తీసేస్తాడు. దానికీ సిద్ధమే"

కౌముదికి సుకుమార్ ఉద్దేశం అర్థమయింది. అతని బలమైన నిర్ణయం కూడా తెలుస్తూనే వుంది.

"మీ ఇష్టం" అంది.

సుకుమార్ క్షణం ఆగాడు. ఆ చీకట్లోనే కౌముది మొహం వైపు చూశాడు. ఏదో ఆలోచించుకున్నట్టు—

"నేను ఆలోచించనే లేదు. మరి మీరు..."

"నేను..."

"అదే... ఇలా జరిగితే...."

"ఏమవుతుంది?"

"ఛీ ఛీ... ముక్కూ మొహం తెలియని మీకు నా ద్వారా ఇంత భంగపాటా! ఇంతకీ ఒక విషయం—ఈ పెళ్ళివార్త మీ వాళ్ళందరికీ తెలిసిందా?"

కౌముది మాట్లాడలేదు.

"నలుగురికీ ఎలా చెప్తారు—మీరు గానీ, మీవాళ్ళుగానీ? ఓసారి పెళ్ళి కుదిరి ఆగిపోయిందని తెలిస్తే మీకు రేపు పెళ్ళి అవుతుందా?"

సుకుమార్ వేసే ప్రశ్నలకు కౌముది దగ్గర జవాబులేదు. అటువంటి ప్రశ్నలకు జవాబు వుండదని సుకుమార్‌కీ తెలుసు. తిరిగి అన్నాడు—

"రేపు నాకేం కాదు. మరి మీకు..."

"మీ జీవితం మీది, నా జీవితం నాది. ఈ ప్రపంచంలో ఎవటివాళ్ళ గురించి బాధపడ్డానికీ, క్షోభపడ్డానికీ అవకాశం తక్కువ. ఎవటివాళ్ళ కన్నీళ్ళు తుడిచే ప్రయత్నం చేస్తే మన కన్నీళ్ళు చూస్తూండగానే సముద్రాలుగా మారి మనల్ని ముంచేస్తాయి. త్యాగం చేయడానికీ, అది అందుకుందుకూ కూడా ఎంతో కొంత ఆత్మీయత మనుషుల మధ్య వుండాలేమో. మీరన్నట్టు ముక్కూ మొహం తెలియని మీకు నా గురించి ఏదో చేసినా అది అతుకులాంటిదే అవుతుంది. మనిద్దరం పెళ్ళి చేసుకుని ఆ తర్వాత ఇద్దరం ఒకళ్ళ కన్నీళ్ళు మరొకరు తుడిచే శక్తి లేక, ఒకళ్ళకొకళ్ళం ఓదార్పు అందించుకోలేక బతకడంకంటే వేరే నరకం వుండదు. ఇదే మంచి మార్గం. పదండి వెళదాం"

ఇద్దరూ నిశ్శబ్దంగా పార్కు బయటకు వచ్చారు.

"నను క్షమించండి. ఇది నా ఆఖరి విన్నపం"

కౌముదికి కళ్ళల్లో కన్నీరు వుబికింది "లేదు... అదేం లేదు..." అనేసింది.

కౌముదికి వాకిట్లో కూర్చున్న తండ్రి





మొహం ఎలా చూడాలో తెలియలేదు.

* * *

రసపట్టులో సినిమా నడుస్తూంటే కరెంటు పోతే ఓ వర్గం జనానికి మనస్సుచివుక్కుమంటుంది. మరోవర్గం జనం కారణం తెలుసుకొని సరిపెట్టుకుంటారు. కానీ చాలా మంది మాత్రం ఏం జరిగిందో పట్టించుకోకుండా అల్లరిచేస్తారు. కేకలు పెట్టి ఈలలు వేస్తారు. మన సమాజంలో ఆడపిల్ల బతుకుకూడా అడుగడుగునా ఆగిపోయే సినిమాలాంటిదే!

కౌముది సెలవు కేన్సిల్ చేసుకుని డ్యూటీలో జాయిన్ అయినరోజు అదే జరిగింది ఆఫీసులో. తెలుసున్న అభిమానులు కౌముదివేపు జాలిగాచూస్తే కౌముది అంటే కిట్టనివాళ్లు ఏదో జరిగి వుంటుందని చాలాదూరంవెళ్లి మాట్లాడుకున్నారు. నాలుగయిదురోజులు సెక్షన్లో అందరికీ కౌముది పెళ్లిగొడవే కాలక్షేపం అయింది. కౌముది గుండెల్లో పుట్టేమంటని చల్లార్చుకోవడంతో, వుబికివచ్చే కన్నీటిని ఆపుకోవడంతో సతమతమయ్యింది.

సెక్షన్లో ముఖ్యంగా గురుమూర్తి కౌముది వెనక ఎన్నో కథలల్లి తీరిక సమయాన్ని వెచ్చించేవాడు.

"ఈ రోజు తలవంచుకుపోయే అమ్మాయిలకే పెళ్లిళ్లు కావడంలేదు''

గురుమూర్తి కంఠశోష విని విని విసిగిపోయిన యు.డి.సి. రాధాకృష్ణ అన్నాడు, ''ఎవరెట్లాపోతే మనకెందుకండీ'' అని.

''జరుగుతున్న విషయం చెబుతున్నాను. ఇందులో ఒకళ్ళని ఎద్దేవా చేసేదేం లేదు''

''మనం ఎంతకాదన్నా ఈ ఉవాచలూ, దృష్టాంతాలు అన్నీ ఆవిడకే తగులుతాయి. బహుశా ఆ అమ్మాయికి తన పెళ్లి ఆగిపోయినందుకు బాధవుండక పోవచ్చు. చుట్టూ జనఘోషే ఆమెను ఎక్కువ బాధ పెట్టివుండాలి''

''నీకెందుకంతపాటి జాలి'' కోపంగా అన్నాడు గురుమూర్తి.

కౌముది మాత్రం ఎవరేమన్నా పట్టించుకోలేదు. తననికానట్టే వూరుకుంది. పైగా తల్లి అస్వస్థతతో హాస్పిటల్లో ఉంది. దాంతో కౌముదికి తీరికలేకుండాపోయింది. తిరిగి ఆఫీసుకు సెలవుపెట్టింది. ఆస్పిటల్‌నుంచే నళినికి జరిగిందంతా ఉత్తరంగా రాసింది. ఉత్తరం పూర్తిచేసిన తర్వాత కౌముదికి గుండెబరువు తీరినట్టు అయ్యింది.

ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. కౌముది లేచి వంటచేసి కేరియర్ సర్దింది. తండ్రి పనిచేసే కంపెనీనుంచి తిరిగివచ్చి కేరియర్ తీసుకుని రాత్రుళ్ళు హాస్పిటల్లో పడుకుంటాడు.

కౌముది వాలుకుర్చీలో కూర్చుంది. ఏ పనీ చేయబుద్ధి కాలేదు. తీరికతో దిగులు రెట్టింపు అవుతోంది. ఆ దిగులుకు కారణాలు ప్రత్యేకంగా ఒకరకమయినవి కావు.

ఆఫీసులో వేళాకోళంచేసే కొలీగ్స్, గాయంచేసి పారిపోయిన విశాల్, దూరంగా వెళ్ళిపోయిన స్నేహితురాలు నళిని, తల్లి అనారోగ్యం, తండ్రి నిస్సహాయత, అన్నగారికి కుటుంబంపట్ల వున్న విముఖత, లేనిచొరవ తీసుకున్న రామానుజం—వీళ్ళందరూ ఆలోచనా కేంద్రంలో బిందువులే.

కౌముదిని ఆలోచనలనుంచి తేరుకునేటట్టు చేసింది. వీధిగుమ్మంముందు ఆగిన రామానుజంగారి నల్ల అంబాసిడర్ కారు.

కౌముది తేరిపార చూ సేసరికి కారులోంచి రామానుజంగారు దిగారు. చేతిలో సంచీ వుంది. అది పళ్ళతో నిండివుంది. రామానుజం కౌముదినిచూసి నవ్వుతూ-

"బావున్నావా?" అన్నాడు.

కౌముదికి ఏం చెప్పాలో తెలియలేదు. రామానుజం వాకిట్లోకివచ్చి - "ఈ పళ్ళు తీసుకో. మీ నాన్నకి ఫోన్‌చేస్తే విషయం



తెలిసింది. అతగాడు హాస్పిటల్‌కు వెడతాడు కదా...కూడా తీసుకుపోదామని వచ్చాను"

"కూర్చోండి"

"నాన్న ఇంకా రాలేదూ"

"లేదు" కౌముది లోపలికి వెళ్ళబోయింది.

"కాఫీగట్రా ఏం వద్దు"

"ఫరవాలేదులెండి" కౌముది లోపలికి వెళ్ళి ఫ్లాస్క్‌లో కాఫీ తీసుకువచ్చింది.

రామానుజం అక్కడేవున్న కుర్చీలో కూర్చుని కాఫీ తాగాడు. తాగుతూనే కౌముదివేపు తిరిగి "నువ్వు చాలా పొరబాటు పని చేశావు బేబీ... నాకు చాలా కోపం వచ్చింద. నువ్వే కాదు మీ నాన్నా తప్పు చేశాడు"

"ఏమిటండీ అది"

"అదే..ఆ గాడిద వచ్చి ఏవేవో వాగితే కిమని వూరుకోవడమా" అన్నాడు ఒక్కసారి.

"ఆయన తప్పేముంది. వుంటే ఆ తప్పంతా నాదీ, మా నాన్నదీనూ"





"అదేమిటి... మీ తప్పెలా అవుతుంది?"

"అవును. ఈ ఘోరానికి కారణం మీరు. మీరెందుకిలా చేశారో నాకర్థం కాదు. ఏం ఆశించి చేశారో కూడా..." ఆగి పోయింది.

"నువ్వు చాలా పదునుగా మాట్లాడ గలవు. వాడు చేసిందానికి నన్నేమయినా అనదల్చుకుంటే అను. తల వగ్గుతాను"

"మిమ్మల్నా....అని ఏం లాభం రామానుజంగారూ! మీకు మాటలు పడ్డం ఇష్టం అయితే చెప్పండి. అంటాను"

"నేనేం చేశాను చెప్పు. పెళ్ళికొడుకుని తెచ్చాను. డబ్బు సహాయం చేశాను. అదీ తప్పేనంటావా?"

"పెళ్ళి కొడుకుని తెచ్చారు. కానీ నేను నచ్చానో లేదో, అసలు అతనికి ఈ పెళ్ళి ఇష్టమో కాదో అడిగారా? మీరడగలేదు. అడిగితే కాదంటాడని మీ అనుమానం. మీరెందుకు అతని పెళ్ళి బాధ్యత తీసుకున్నారు? అతగాణ్ణి మీరు పెంచి వుండొచ్చు ఉద్యోగం వేయించి వుండొచ్చు ... కానీ మీకు నచ్చిన అమ్మాయిని అతగాడెందుకు పెళ్ళి చేసుకోవాలిట?"

"వాడు ఈడియట్ అని తెలియక చేశాను. లెంపలు వేసుకోమంటే వేసుకుంటాను. వాడు నా కొడుకులాంటి వాడనుకున్నాను. ఇలా ఆఖరి నిమిషంలో వెన్నుపోటు పొడుస్తాడనుకోలేదు"

"అతను చాలా ఉత్తముడు కాబట్టే వచ్చి నిజం చెప్పాడు. మోసగాడయితే నా బతుకేమయ్యేది. మూడు ముళ్ళూ వేయించుకుని ఏడ్వడం ఒకటే మిగిలేది"

"బావుంది బేబీ చాలా బావుంది. ధోకా ఇచ్చినవాడు ఉత్తముడా?సహాయం చేయ బోయిన నేను..."

"మీరు పెద్దవారు. మీరు చేసిన తొందరపాటు పని వల్ల చూడండి ఏం జరిగిందో....అమ్మ హాస్పిటల్ పాల య్యింది. నాన్న కృంగిపోయాడు. నేను..."

"బాధపడకు బేబీ! జరిగిందేదో జరి గింది"

కౌముది మనసులో తుమ్మ ముళ్ళు గుచ్చుకున్నట్టయ్యింది. నిరాశతో కూడిన నవ్వు వచ్చింది. "బాధపడొద్దూ.. ఎంత మంచి సలహా యిచ్చారు. వెన్ను మీదపొడిచి వీపు నిమిరినట్టుంది మీ మాట. ఇలా మీ కన్నకూతురికి జరిగితే మీరు బాధపడకుండా ఏం జరగనట్టు ఊరుకునే వారా? 'కన్నీళ్ళు పెట్టుకోవద్దు. హాయిగా నవ్వుకో' అని హితవు చెప్పేవారా? మీ అమ్మాయి పెళ్ళి పీటల మీద ఆగి పోయిందంటే ఏమీ పట్టించుకునేవారు కాదా?"

రామానుజం కౌముది మాటలతో కృంగిపోలేదు. మోహం మీద చిన్న నవ్వు మిగుల్చుకుంటూనే – "నాదే పొర పాటు. మళ్ళీ ఒప్పుకుంటున్నాను. నా పొరపాటు నేను సరిజేసుకుంటాను. దీని తాతలాంటి సంబంధం నీకు చూస్తాను. నీకు కావల్సింది పెళ్ళేకదా. నీకో ఇల్లూ, నీకో భర్తా, సంతోషం – ఇవికదా కావ ల్సింది. రెండు నెలల టైం యివ్వు. నిన్ను పువ్వుల్లో పెట్టి పూజించే మొగుణ్ణి తెస్తాను. అప్పుడయినా నన్ను క్షమిస్తావా"

కౌముది తెల్లబోయింది. గుండెల్లో గూడుకట్టుకున్న కోపం ఒక్క వుదుటున లేచింది.

"చాలండీ. ఆపండి. నేనిప్పుడు పెళ్ళి కోసం మొహం వాచిలేను. భర్త లేకపోతే, భర్త అందించేసుఖం దొరక్కపోతే నాకేం ప్రాణం పోదు. నాకో మొగుణ్ని చూసి పెట్టమని నా ప్రాణం పోయినా నేనెవర్నీ అడగను. అవివాహితగా చచ్చిపోయినా నాకేబాధా కలగదు. పైగా మీరు తెచ్చే సంబంధం నాకు అసలే అవసరంలేదు"

"అంటే నీ పెళ్ళి నువ్వే చేసు కుంటావా?"

"అవసరం అయితే తప్పకుండా"

"అంటే నీకు పెళ్లిమీద ఆశ వుందన్నమాట"

"అది మీకు అనవసరం"

రామానుజం కౌముది దగ్గరగా వచ్చి "బేబీ.. నువ్వొట్టి అమాయకురాలివి. జీవి తంలో ఓడిపోయినదానివి. నా సలహా ఒకటే. పెళ్ళి వద్దనుకుంటే ఫరవాలేదు. కావాలనుకున్నరోజు..ఆ కోరిక తీరకపోతే నన్ను మర్చిపోకు" అంటూ కౌముది బుగ్గమీద చిన్న ముద్దుపెట్టుకుని వీధిలోకి వెళ్ళిపోయాడు.

కౌముది కుర్చీలో కూలబడింది. ఆమెకి జరిగిందంతా కలగా వుంది. రామానుజం ముందు తనెందుకు అంత ఉద్రేకంగా మాట్లాడానా అని ఆలోచించు కుంటోంది. వ్యక్తిగతంగా మనిషికి మంచి చెడులు తెలియాలి... హద్దులు తెలి యాలి. రామానుజం తన డబ్బుతో మంచి చెడుల్ని మర్చిపోయాడు. వయసు బురఖా వేసుకుని లోపలి క్రూరత్వాన్ని కాపాడుకుంటున్నాడు. తలుపు చప్పు




కయింది.

"ఎవరూ..."

"నేనండీ రాధాకృష్ణని. హాస్పిటల్ నుంచి వస్తున్నాను"

కౌముది ఒక్క ఉదుటున కుర్చీలోంచి లేచి తలుపు తెరిచింది.

"ఏమయిందండీ?"

"మా నాన్నగారికి లైట్ గా హార్ట్ ఎటాక్ వస్తే ఆయన్ని హాస్పటల్లో జేర్పించాం. వారంనుంచీ ఆయన అక్కడే వుంటున్నారు. మీ అమ్మగారికి ఏవో కాంప్లికేషన్స్ వచ్చినట్టున్నాయి. డాక్టర్లు కంగారు పడుతున్నారు. తీరా ఆవిడ గురించి ఎంక్వయిరీచేస్తే మీ అమ్మగారని తెలిసింది. సమయానికి ఆవిడ దగ్గర ఎవరూలేరు. అందుకే ఈ కబురు చెబుదామని వచ్చాను"

''అలానా'' అంది పేలవంగా.

"హాస్పిటల్ కి వెడతారా?"

"నాన్న ఇప్పుడే ఆస్పిటల్ కి వెళ్లారు. అమ్మకి ఎలా వుంటుందో ఏమో. ఆయన ఒక్కరూ మరీ కంగారుపడతారు. నే వెడతానులెండి"

''ఒక్కరూ వెళ్ళగలరా... బాగా చీకటి పడింది కూడా''

''ఫరవాలేదండీ''

''మరి నే వెడతాను''

''మీరు చాలా శ్రమతీసుకున్నారు. థాంక్స్ అండీ"

''నో మెన్షన్"

రాధాకృష్ణ బయటకు వెళ్ళాడు. కౌముది ఇంటికి తాళంవేసి హాస్పిటల్ కి బయలుదేరింది.

* * *

శాంతమ్మగారు చనిపోవడంతో తల్లిలేని లోటు ఎటువంటిదో తెలిసింది కౌముదికి. ఇంట్లోవాళ్ళకోసం నవ్వి, పోట్లాడి, ఏడ్చి చాలా కొద్దిగా సాధించి చాలా ఎక్కువగా ఓటమిని అంగీకరించేది సాధారణంగా ఏ ఇంట్లో అయినా తల్లే అవుతుంది. బలరామ్మూర్తిగారు కూడా భార్యావియోగంతో డీలాపడిపోయాడు. అరవైఏళ్లు దగ్గర పడుతోన్నప్పుడు భార్య అనే వ్యక్తి చేసే సహాయాలూ, స్నేహం మరెవరిదగ్గరా దొరకవు. శరీరంలో సగం ఆవిటిదయినట్టుగా ఆయనకు అన్పించసాగింది. తల్లి చనిపోయిన నాలుగు రోజులకు జనార్దనం భార్యాసమేతంగా ఢిల్లీ నుంచి వచ్చాడు. వేలమైళ్ళనుంచి దుఃఖం దాచుకుని వచ్చినవాడిలా గుమ్మాలదగ్గరే ఆ దుఃఖాన్ని వెలిగక్కడం మొదలుపెట్టాడు. భార్యాభర్తలిద్దరూ ఆవిడ గుణగణాల్ని వేనోళ్ళ పొగిడారు. కౌముదికి ఎందుకో అన్నా వదినలు మరీ మితిమీరి నటిస్తున్నారనిపించింది. తల్లి పెద్దకర్మ అవగానే జనార్దనం "మరి మేం వెడతాం నాన్నా" అన్నాడు. బలరామ్మూర్తి ఏమనలేదు.

జనార్దనం భార్య మాత్రం "మీరు మాతో వస్తే బావుంటుంది మామగారూ" అంది.

కౌముదికి ఆ ఆహ్వానంలో వదినగారి చాకచక్యంచూసి "అవును నాన్నా, నువ్వు అన్నయ్యతోవెళ్ళి ఒకటి రెండు నెలలు వుండిరా" అంది.

జనార్దనం వెంటనే "అక్కడ శీతాకాలంలో విపరీతమయినచలే. టెంపరేచర్ బాగా పడిపోతుంది. నాన్న తట్టుకోలే దేమో"

"ఈ ఊళ్ళలో పెద్ద ఇళ్లల్లో మసిలినవాళ్లకి ఆటూ రూమ్ కంపార్ట్

మెంట్స్‌లో యిమడడం కష్టంగానే వుంటుంది" అంది వదినగారు.

"అది సరేనే...సువ్వొక్క_త్తివి ఈ ఊళ్లో ఎలా వుంటావ్. పైగా నీ పెళ్ళి ఒకటి వుందిగా"

"ఇదేం అడివికాదు. నేను ఉమెన్స్ హాస్టల్లో వుంటాను. పెళ్ళి అంటావా.. దాని మాట వదిలేయ్"

"అదేమిటి" అంది వదినగారు కళ్లు ఎగరవేసి.

బలరామ్మూర్తి ఆ వాదనని ఆపుజేసే ఉద్దేశంతో "నేను ఎక్కడికీ రానురా" అనేశాడు.

జనార్దనం మారు మాట్లాడలేదు. తను అనుకున్న రోజుకు భార్యా పిల్లలతో పిల్లిలా చల్లగా ప్రయాణమై వెళ్ళి పోయాడు.

కౌముదీ, బలరామ్మూర్తీ మిగిలారు ఇంట్లో.

కౌముది మనసులో దుఃఖాన్ని అదిమి పట్టుకోలేక నళినికి ఆగిపోయిన తన పెళ్ళి కథా, తల్లి చనిపోవడం రాసింది.

ఓ సాయంకాలం రామానుజం వచ్చి బలరామ్మూర్తిని, కౌముదిని ఓదార్చాడు.

"ఎంత దారుణం జరిగింది. ఆ రాత్రి ఫ్లయిట్‌లో నేను బెంగుళూరు వెళ్ళాల్సి వచ్చింది. ఊళ్ళో వుండి వుంటే.."

"ఎవరుండీ ఏం చేయగలరు"

రామానుజం తనుంటే శాంతమ్మకు వైద్యసహాయం ఎలా జరిపించేదీ గొప్పగా వర్ణించి చెప్పసాగాడు.

* * *

కౌముది కష్టంలో వుందని తెలిసినా ఆఫీసులో తోడేళ్లు తమ నైజాన్ని వదులుకోలేదు. కౌముది తల్లిని పోగొట్టుకుని మరింతస్వతంత్రురాలైనట్టు వ్యాఖ్యానాలూ చేశారు. కౌముది ఆఫీసుకి రాగానే అందరూ ఓదార్చు వెళ్ళబోశారు. కౌముదికి ఏ ఒక్కరి మొహంలోనూ జాలి కన్పించ లేదు. కావాలని పలకరించినట్టుగా తోచింది. అంత మందిలో ఆమెని రాధాకృష్ణ, యాదగిరి పలకరింపే ఎక్కువగా ఓదార్చింది.

"మీతో నాకున్న పరిచయం తక్కువ. అందుకే మీ ఇంటికి రాలేదు. ఏమీ అనుకోకండేం. మీ నాన్నగారికి మాత్రం ఆవిడ లేని లోటు కన్పించకుండా చూసుకోండి. ఏం జీవితాలో..." అన్నాడు.

యాదగిరి ఏదో ఫైల్ తీసుకు వెళ్ళడానికి టేబిల్ దగ్గరకు వచ్చి—

"పెద్దమ్మ చనిపోయిందని విన్నా. మా నాయనా, అమ్మా బాధపడ్డారు-ఆ కబురు విని"

"ఆరోజు మీ నాయన వచ్చాడు యాదగిరీ... పాపం చాలా సహాయం చేశాడు" అంది కౌముది.

"నాయనకు పెద్దయ్యంటే ప్రాణం"

ఆ తర్వాత గురుమూర్తి కౌముదిని తన సీటు దగ్గరకు పిల్చి ఏవేవో అడిగాడు.

"ఆ రోజు నేను వూళ్ళోలేను. లేకపోతే వచ్చేవాణ్ని" అన్నాడు.

"ఫర్వాలేదండీ."

"ఆ...చూడు కౌముదీ! రేపు ఆదివారం మా అమ్మాయి మెట్రిక్ పాసయిన సందర్భంలో మనవాళ్ళంతా పార్టీ ఇవ్వమని గొడవ చేస్తున్నారు. నువ్వు కూడా తప్పకుండా రావాలి సుమా"

"వీలయితే తప్పకుండా వస్తానండీ"

"నువ్వు రాకపోతే ఫంక్షన్ కేన్సిల్ అయిపోతుంది. రావాలి సుమా" అన్నాడు.




కౌముది మౌనంగా తల ఊపింది.

రెండు రోజుల తర్వాత గురుమూర్తి చిన్న సైజు ఇన్విటేషన్ కార్డులు అందరికీ ఇచ్చాడు.

"ఇదేమిటీ! పార్టీ ఇంటి దగ్గరకాదా?"

"మన జనం అంతా కిద్వాయ్ గార్డెన్స్ బుక్ చేయమన్నారు. పోనీలే అక్కడయితే హాయిగా వుంటుంది"

"అంత దూరమా"

"ఎంత దూరం. పైగా మీ లేడీ ఫ్రెండ్స్ అందరూ వస్తున్నారుగా"

కౌముది మరేం అనకుండా తన సీటు వైపు వెళ్ళిపోయింది.

ఆదివారం రానేవచ్చింది. కౌముది అందరితోపాటూ కిద్వాయ్ గార్డెన్స్‌కి వెళ్ళింది. మొత్తం ఇరవై-ముప్పై మంది వరకూ జనం వచ్చారు. అక్కడ వున్న కాటేజ్ బుక్ చేసిన మూలంగా ఆడ వాళ్ళందరూ ఒకరూమ్‌లో కూర్చున్నారు. మగవాళ్లు పక్క గదుల్లోజేరి కేరింతలూ పేకాటా మొదలుపెట్టారు. కౌముది ఎవ్వరితోనూ కలవలేకపోయింది.

కానీ గురుమూర్తి మాత్రం ప్రతీ పనికి వచ్చి కౌముదీ సలహా అడగడం, కౌముదిని పలకరించడం మొదలుపెట్టాడు.

"ఇప్పుడేం చేద్దాం...నెక్స్ట్ అయిటమ్ ఏం తీసుకుందాం?"

"మనవాళ్ళందర్నీ కొంచెం కంట్రోల్ చెయ్యి కౌముదీ.. మనకేం మాటరాకూడదు సుమా"

కౌముదికి గురుమూర్తిగారు తనని హోస్ట్‌గా మార్చి మాట్లాడ్డం చిరాకు కల్గించింది.

"ఏవిటమ్మా.... సెక్షన్ ఆఫీసర్‌ని అంతలా పట్టేశావ్! నీ గీటు దాటకుండా కట్టిపారేశావ్" అన్నారు ఒకళ్ళిద్దరు.

"నాదేం లేదే. ఆయన మాటమాటకీ నన్ను కన్‌సల్ట్ చేయడం నాకే ఆశ్చర్యంగా ఉంది"

"ఉట్టినే ఎందుకు చేస్తాడు. పెద్దరికం నీకు ఇస్తున్నాడుగా... తీసుకో"

"వెరీ సారీ" అంది.

ఫంక్షన్‌కి వచ్చిన ఇద్దరు ముగ్గురు యువకులు పదే పదే వచ్చి తనని పలకరించడం, రూడ్‌గా విట్స్ వేయడం కౌముదికి అసహ్యం అన్పించింది. వాళ్ళంతా సెక్షన్లో పని చేసేవాళ్ళే. ఆఫీసులోకంటే బయట వాళ్ళెంత మూర్ఖత్వంతో బతుకుతారో కౌముది కళ్లారా చూసింది.

కౌముది ఓ టేబిల్ దగ్గర మూలగా కూర్చుని అన్ని రకాల మనుషులచేష్టల్నీ, వికారాల్నీ భరించింది. ఫంక్షన్ పూర్తయింది. అంతా బయటకు వచ్చారు. ఆ ప్రాంతాలకి గండిపేట నుంచి బస్‌లు వస్తాయి. వచ్చేవి కూడా రష్‌గానే ఉంటాయి శెలవు రోజైతే. గురుమూర్తి ఎవరిదో చిన్నకారు అడిగి తెచ్చాడు. దాంట్లో వంటసామాన్లు వచ్చాయి.

కొందరు జంటలుగా, మరికొందరు ఒంటరిగా స్కూటర్స్ మీదా...ఎవరిదారి వాళ్లు చూసుకున్నారు.

"నా కార్లో ఎక్కు కౌముదీ! మీ ఇంటి దగ్గర డ్రాప్ చేస్తాను" అన్నాడు గురుమూర్తి.

"వద్దులెండి. సిటీబస్‌లో పోతాను"

"నువ్వెక్కితే నా కారేం మైల పడదులే"

"వద్దు... ప్లీజ్"

"ఏం... నిన్ను నేనేం కొరుక్కు తినను సరేనా" అన్నాడు నవ్వుతూ.

'అంతకంటే కూడా దారుణంగా

ప్రవర్తించారు' అనాలనుకుంది.

"ఈ ఏడాదిలో నీకు ప్రమోషన్ వస్తుంది. సెక్షన్ హెడ్ అవుతావు. ఇంకా ఇలా ఉండడం కల్చర్ అనిపించుకోదు. తెలుసా?"

కౌముది మాట్లాడలేదు.

"సరే ఓ అరగంట చూద్దాం. బస్సు వచ్చిందా సరేసరి. అంతవరకు నేను ఆగుతాను. లేకపోతే నా కారులో పోదాం. ఇక్కడ నిన్నొక్కత్తినీ వదిలి వెళ్ళడం సభ్యతా చెప్పు" అన్నాడు.

అరగంట గడిచినా బస్ రాలేదు.

"పద వెడదాం"

కౌముది ఫ్రంట్ సీటులో కూర్చుంది. గురుమూర్తి కారు డ్రయివింగ్ మొదలు పెట్టాడు.

కారు కొంచెం దూరం వెళ్ళిన తర్వాత అన్నాడు-

"మా ఆవిడకి నేనిలా పార్టీలు అవీ ఇవ్వడం ఇష్టం ఉండదు. దానికెప్పుడూ డబ్బు దృష్టే"

"ఆడవాళ్ళు పొదుపు చేయాలని అనుకుంటారు. తప్పేముంది"

"అదొక్కటే కాదు. పొద్దున్న ఆఫీసుకు బయలుదేరుతూంటే జేబులు చూస్తుంది. సాయంత్రం తిరిగి చూస్తుంది. అంతే! రాత్రిమొదలుపెడుతుందిపురాణం. ఈవేళ ఇంతఎందుకుఖర్చుపెట్టారంటుంది. నాకు మండుకొస్తుంది"

కౌముది చిన్నగా నవ్వింది.

"అదొకటే కాదు కౌముదీ! 'ఆఫీసుల్లో మీతో పనిచేసే ఆడపిల్లలతో చనువుగా ఉండకండి. మీ బుద్ధి అసలే మంచిది కాదు. వయసులో ఏదో చేస్తే చేశారు. ఏం..మాట్లాడరే' అంటూ వేపుకు తింటుంది"

"అది సరే. మీ అమ్మాయికి ర్యాంక్ వచ్చింది కదా! ఏ కోర్స్‌లో జాయిన్ చేస్తారు?"

"దానిష్టం" అనేసి - "ఇంకా విను కౌముదీ? ఆమధ్య ఇంటికి ఆలస్యంగా వెళ్ళాను. ఏవేవో తాగితే లాగి రెండు ఇచ్చుకున్నాను"

"ఇంటి విషయాలు నాతో ఎందుకు చెప్తున్నారు"

"కౌముదీ! మన బాధలు ఒకళ్ళతో పంచుకుంటే కొంత చల్లారతాయి. నలభై ఏళ్ళు నాకు, అంతే! మా నాయనమ్మ పట్టుపట్టి ఇరవై ఏళ్ళు రాకుండానే పెళ్లి చేయించింది"

కౌముది మాట్లాడలేదు. గురుమూర్తి ఎదురుగా రోడ్డుకి అడ్డంపడి వస్తూన్న గేదెల్ని చూసి "అరే" అని సడెన్ బ్రేక్ వేశాడు.ఆ కారు ఊపుకు కౌముది సడెన్‌గా గురుమూర్తి వైపు ఒరిగిపోయింది. గురుమూర్తి కౌముదిని గట్టిగా తనవైపు అదుముకున్నాడు.

"యూ ఆరేనైస్ గర్ల్. ఐ లైక్ యూ వెరిమచ్. నో... లైక్ యూ టూమచ్"

"వదలండి" అంది.

"కౌముదీ! నీసంగతి నాకంతా తెలుసు. నీకు డబ్బు, ఉద్యోగంలో హోదా పెరిగేటట్టు చూస్తాను. నాకు హైలెవెల్లో చాలా మంది తెలుసు. ఏడాదిగా నన్ను నీ అందంతో తిప్పలు పెడుతున్నావ్. కాదనకు... కాదనకు"

"ఇందుగురించా మీ కారులో రమ్మన్నది" అంది కౌముది డోర్‌వైపు తప్పుకుంటూ.

"మనసు విప్పి మాట్లాడుకుంటే మంచిదికదా!"

"నేను మనసువిప్పి చెబుతున్నాను.




విశాల్ని ప్రేమించాను. పెళ్లి చేసుకోవాలనుకున్నాను. అతగాడు దగాచేశాడు. అలాగే మరో పెళ్లి విషయంలో కూడా నాకు ఎదురుదెబ్బ తగిలింది. అంత మాత్రంచేత నేను శరీర వాంఛకోసం అల్లాడిపోవడంలేదు. పెద్దగావున్న ఇంట్లో పుట్టలేదు. అయినా డబ్బు మీద, నగల మీద, చీరలమీదా, అంతస్తు బతుకుమీదా నాకేం ఆశలులేవు. నావైపు ఆకలిగా చూసేవాళ్ళందరి దగ్గరకి నేను పరిగెత్తను. నాకలాంటి ఆవేశంలేదు. చపలత్వం లేదు"

గురుమూర్తి నవ్వాడు. "నీమనస్తత్వం గురించి నేను అడగలేదు. శరీరవాంఛ వేరు. జీవితపర్యావలోకనం వేరు. ఆశలు వేరు. ఆకలి వేరు. ఆకలివేస్తే అన్నం తింటాంగానీ చాన్స్ చెయ్యం. ఆఫీసులో బుద్ధిచలించినా తమాయించుకుంటాంగానీ ఏకాంతంలో మాత్రం..."

"కారు ఆపండి. నేను దిగుతాను"

"చూడు-బెట్టు చేయడం ముద్దుగానే వుంటుంది. కానీ మరీ పతివ్రతలా నటిస్తే నీకేనష్టం. నాలో ఆవేశం రెట్టింపు అవుతుంది"

"నోర్ముయ్" మీదకి లాక్కుంటూన్న గురుమూర్తిని ఒక్కతోపు తోసింది కౌముది. గురుమూర్తి ఎడమచేత్తో కౌముదిని మీదికి లాక్కుంటూ ఒంటి చేత్తో కారు నడుపుతున్నాడు. ఆ కొట్లాటలో చిన్నకారు నాలుగైదుసార్లు అటూ ఇటూ తిరిగి షడెన్గా ఓ పెద్దరాయికి ఢీకొట్టింది. గురుమూర్తి కంగారుపడుతూ, నుదిటి మీద చెమట ఒత్తుకున్నాడు. కౌముది ఆ సమయంలో డోర్ తెరిచి రోడ్డుమీదకి ఒక్క గెంతు గెంతి పది అడుగుల దూరం పరుగున వెళ్ళింది. ఆతర్వాత మరో వందగజాలు పడివడిగా నడిచిం

అప్పటికే చీకటి పడింది. దూరం నుంచి వచ్చే చిన్నకార్లుతప్ప ఆ రోడ్డుమీద అలికిడిలేదు.

కౌముదికి ఆయాసం వచ్చింది. బస్ స్టాప్ వెతుక్కుంటూ నడక మొదలు పెట్టింది.

పదిఅడుగుల దూరం వెళ్ళేసరికి రోడ్డు పక్కన రెండుస్కూటర్లు ఆగివున్నాయి: రెండు స్కూటర్లని ఇద్దరు వ్యక్తులు రిపేరు చేస్తున్నారు. మిగిలిన ఇద్దరూ సిగరెట్లు కాల్చుకుంటున్నారు.

"ఒరేయ్! చిలక నడిచి వస్తోందిరా"

"అరే... ఆశ్చర్యం!"

కౌముది దగ్గర అవగానే - "హలో" అన్నాడు ఒకడు.

"నాది ప్రియ. కొత్త స్కూటర్. ఒక సారి ఎక్కావంటే...."

ఇద్దరు కౌముది చెయ్యి పుచ్చుకున్నారు. కౌముది చేయివదిలించుకుంది.

"పిట్ట బెదురుతోందిరా"

"అది బెదురుకాదురా.... బెట్టు"

"చూడు-నీలాంటి వయసులోవున్న పిల్ల ఒంటరిగా కన్పిస్తే మాలాంటి వయసుకారువాళ్ళు ఎదురొచ్చి ఆహ్వానం పలకాలి. అంతేగానీ నిన్ను ఒంటరిగా ఈ చీకటికి బలిపెట్టకూడదు" అంటూ కౌముదిని ఆ ఆరుబయట...రోడ్డుమీద... నిర్మానుష్యమైన ప్రదేశంలో ముద్దుపెట్టుకున్నాడు. మరొకడు సినిమా స్టయిల్లో కౌగలించుకున్నాడు. మరొకడు ఇంగ్లీషు పిక్చర్లోలా ఆమెని పైకెత్తాడు.

కౌముది అప్పుడు అరిచింది. కేకలు పెట్టింది. వాళ్ళతో పోరాడింది. పోట్లాడింది. కానీ ఆమె ఒకత్తి .... వాళ్ళు నలుగురు. అప్పుడు అర్ధరాత్రి...

కటికచీకటి నింగీ నేలా కలుపుతోంది! ఓ అరగంట పెనుగులాట తర్వాత కౌముదికి నీరసం వచ్చింది. కుప్పలా వాళ్ళ చేతుల్లో కూలిపోయింది. వాళ్ళలో ఇద్దరు అటుగా పోయే టాక్సీ ఆపి వాడితో పదినిమిషాలు మంతనాలుఆడి కౌముదిని వెనకసీట్లో పడేసి "కూకట్‌పల్లి పోనీ" అంటూ డ్రయివర్‌ని హెచ్చరించారు.

* * *

సరిగ్గా అక్కడ కౌముది పెనుగులాడి టాక్సీ ఎక్కించబడ్డ సమయానికి యాదగిరి కూకట్‌పల్లిలో తన ఇంటి అరుగుమీద కూర్చుని వున్నాడు. అతనికేం తోచడం లేదు. భార్యకి వంట్లో బాగుండనిమూలంగా అతనాపూట వంటచేశాడు. మంచంమీద పడుకునే భార్య నాగమ్మ యాదగిరికి వంట ఎలా చెయ్యాలో చెప్పింది. యాదగిరి విసుగ్గానేవంటచేశాడు. నిజానికి యాదగిరికి ఆరునెలలుగా చాలా చికాకుగా వుంది. ఆ చికాకు ఒకరకమయ్యింది కాదు. డబ్బు లేని మూలంగా కల్గిన చిరాకది. భార్య జబ్బుకీ, ఆ తర్వాత ఆపరేషన్‌కీ అయిన అప్పుమూలంగా మెదడంతా గూడుకట్టుకున్న ఆలోచనలు తెగక కలిగిన బాధ అది. ఇవి భౌతికమయినవి. వీటిని మర్చిపోవచ్చు తాత్కాలికంగా. కానీ వీటిని మర్చిపోయేటట్టు చేయగల్గేవాటిలో మొదటిది శరీరం లోపల జరిగే ఆకలి.

యాదగిరి దురదృష్టంకొద్దీ అతని ఆర్థికబాధలతోపాటు శరీరవాంఛకి కూడా




ఆనకట్టపడింది.

ఆపరేషన్ జరిగిన వారం తరువాత నాగమ్మని డిస్చార్జిచేస్తూ డాక్టరు యాదగిరిని పిల్చి - "రెండేళ్ళపాటు నువ్వు నీ భార్యని కలవకూడదు. ప్రమాదం" అని చెప్పాడు.

యాదగిరి అవాక్కై అయిపోయాడు. అతనికి తనమీద కనపడని శక్తులేవో దాడి చేస్తోన్నట్టనిపించింది. యాదగిరి అప్పుడయితే 'గట్టనే' అన్నాడుగానీ ఆ మాట నిలబెట్టుకోడానికి ఎంత నిగ్రహశక్తి అవసరమో అతనికి అప్పుడు అర్థం కాలేదు. భార్య జబ్బుపడ్డప్పుడు, ఆమెకు ఆపరేషన్ జరిగినరోజుకూడా యాదగిరి అంతచేటు నరకం అనుభవించలేదు. 'రెండేళ్ళపాటు భార్యకి దూరంగా ఉండడం తనవల్ల సాధ్యపడదని' వారంరోజులలోనే యాదగిరికి నిశ్చయంగా తెలిసిపోయింది. నిజం అయితే తెలిసిందిగానీ శరీర సత్యాగ్రహం మాత్రం అలానే ఉంది. మొదట్లో సిగ్గుపడ్డా ఒకళ్ళిద్దరు స్నేహితుల్నడిగితే - "మరేం చేస్తావు. మరోదారి చూసుకో" అని అతిసామాన్యంగా సలహా చెప్పారు. యాదగిరికి భయం వేసింది. వాళ్ళు నవ్వేసి - "ఓరి పిరికినాయాలా ! పోనీ రెండు గ్లాసులు దుబారా వేసుకో... మత్తుగా పడుంటావ్" అన్నారు రెండో మార్గంగా.

యాదగిరికి ఈ రెండోమార్గం కొంచెం నిరపాయకరమయిందిగా కనిపించింది

పైగా ఇంట్లో ఏ పండగవచ్చినా తాతా, తండ్రీ, మామలూ తాగడం...ఆ తర్వాత వాళ్లుచేసే విన్యాసాలూ అతను చిన్నప్పటి నుంచీ చూశాడు. ఎందుకో ఆ తాగుడు వాతావరణాన్ని అతను సహించలేకపోయే వాడు. పండక్కీ పబ్బాలకూ చుట్టాలతో కలిసి తాగడం తప్పనిసరి అయ్యేది. అంతవరకే! పెరిగిన బస్తీ వాతా వరణం, ఒకళ్ళిద్దరి పెద్దింటి పిల్లల ప్రవర్తన, స్కూలు చదువూ, అందులో పాఠాలూ, తాగుడు గురించి పంతుళ్లు చెప్పే కథలూ అతన్ని తాగుబోతుతనం నుంచి చాలావరకు రక్షించాయి. కానీ ఇప్పటి పరిస్థితులు వేరు. యాదగిరి ఎవరూ చూడకుండా రాత్రివేళ అదీ కల్లు కాంపౌండ్‌లో జనం పల్చబడ్డ తర్వాత ఒక గ్లాసు తాగేవాడు. తల దిమ్మెత్తి పోయేది. ఇంటికి పరుగునవచ్చి మంచం ఎక్కేవాడు.

''బువ్వ తినవా... ఆ పడకేంటి" అనేది నాగమ్మ.

''ఏంలేదు. నువ్వు పడుకో" అనే వాడు.

నాగమ్మ యాదగిరి పరిస్థితి అర్థం చేసుకుని "తాగినావ్" అనేది బాధ దాచు కుంటూ.

"అవ్"

నాగమ్మకి ఏమనాలో తెలిసేది కాదు! నోటితో 'వద్దు. తప్పపని' అందామను కునేదిగానీ ఆమె మనసు గేలిచేస్తోన్నట్టని పించేది. బాధని అదుముకుని ఆ రోజుకు పూరుకునేది. యాదగిరి అలా వారానికో సారిగా మొదలుపెట్టి తర్వాత ఆ అల వాటు రెండుసార్లుగా మార్చి ఏదో ఉప శమనాన్ని వూహించుకోసాగాడు.

నాగమ్మ భర్తలో మార్పు గమనించి "అద్దు.. కొత్తగ నేర్చావ్. అంత ఎక్కు వగా తాగొద్దు. పెయ్యి చెడిపోతది'' అంది ఓ రోజు.

''ఏం కాదులే"

''మందిని చూడ్డంలే ... తాగి బాగు పడ్డోళ్లు కనబడరు" అంది.

భార్య హెచ్చరించినప్పుడల్లా ఏదో సాకుచెప్పి తప్పించుకున్న యాదగిరికి ఆ రోజు జరిగిన సంఘటన చాలా రోజులు గుర్తుండేదిగా నిలిచిపోయింది. ఇది జరిగి ఏడాదయింది. ఆ రోజు దసరా పండగ. స్నేహితులు బలవంతంగా తాగించారు వద్దంటున్నా వినకుండా. బాగా తాగి పది గంటల వేళ వస్తుంటే ఎదురుగా ఓ పదహారేళ్ళ అమ్మాయి వస్తోంది. యాద గిరి ఆమెని పరకాయించి చూశాడు. ఆమె ఎవరో తెలుసు. వాడలోనే వుంటుంది. రహస్యంగా వ్యభిచారం చేస్తుంది.

"మంచిగ వున్నవా'' అన్నాడు దగ్గరకు వెళ్ళి.

ఆ అమ్మాయి యాదగిరిని చూసి భయపడింది. ఆ భయాన్ని అతను సిగ్గుగా, బెట్టుగా తీసుకున్నాడు. చేయి పట్టుకోబోయాడు. అరిచింది. ఇంతలో వెనక నుంచి వచ్చి ఎవరో తనని లాగి పక్కకి నెట్టడం యాదగిరి చూసాడు. తాగుడు మైకం ఆవేశం తెప్పించింది గానీ బలాన్ని దూరం చేసింది. దాంతో ఆ కొత్తమనిషి యాదగిరి మొహం మీద కొట్టాడు. యాదగిరి అప్పుడు చూశాడు ఆ వ్యక్తిని. ఆయన పెద్దవాడేంకాదు. తనకన్నా ఏడెనిమిదేళ్ళు పెద్దవాడు. ఊళ్ళో యువజన సంఘం పెట్టాడని జనం చెప్తూండేవారు. అప్పుడప్పుడు ఆరు బయట మీటింగులు నిర్వహించేవాడు.





యాదగిరి అప్పటికి తల పంచుకు వెళ్ళి పోయాడు. కానీ ఆ రాత్రి అతనికి నిద్ర పట్టలేదు. ఏదో నేరం చేసినవాడిలా బాధ పడ్డాడు. అందుకే మర్నాడు ఆయన ఆన మాళ్ళు చెప్పి ఇల్లు వాకబు చేసాడు.

యాదగిరి వెళ్ళి తలుపుతట్టి 'సారూ' అంటూ పిల్చాడు.

పిల్చే ముందు గోడకున్న ప్లేటు చూశాడు. కాంతారావని వుంది–దాని మీద.

కాంతారావు లోపలినుంచి వచ్చి తలుపు తెరిచి ''ఏనరు కావాలి'' అన్నాడు యాదగిరిని కొత్తగా చూసి.

యాగగిరి– ఆయన తనని గుర్తు పడ తాడనీ, అందుకే వాకిలి ముందే గబగబా తప్పొప్పుకుని బయట పడదాం అను కున్నాడు.

''లోపలికి రండి. నాతో పనివుందా?'' అన్నాడు.

యాదగిరి మొహమాటంగా లోపలికి వెళ్ళాడు.

''అలా కూర్చోండి''

''నన్ను మర్యాద చేయకు సారూ. నువ్వను చాలు"

కాంతారావు చిన్నగా నవ్వి ''సరే. ఏమిటి విశేషం. నాతో పనేమన్నా వుందా?'' అన్నాడు.

యాదగిరి ''నువ్వు నన్ను మన్నిం చాల. తప్పయి పోయింది రాత్రి'' అన్నాడు పొడిగా.

''రాత్రి నువ్వేం చేశావ్? నాకేం అర్థం కావడం లేదు''

''రాతిరి తాగి ఆ పిల్లదాన్ని అడ్డు కున్నది నేనే సారూ. కావాలని చేయలా· పొరబాటయింది...సత్యం''

కాంతారావు యాదగిరి మొహంలోకి చూశాడు. యాదగిరి కళ్ళల్లో నిజాయితి కన్పించింది. ''సరే. ఆ విషయం మర్చి పోదాంగానీ ఇలా నా దగ్గరకు రావాలని నీకే తోచిందా? ఎవరైనా స్నేహితులు చెప్పారా?'' అన్నాడు.

''గల్తీ నేను చేసినా. అందుకే చెప్పా లని వచ్చిన'' అన్నాడు.

కాంతారావు ఆశ్చర్యపోయి – "నువ్వు చదువుకున్నావా? ఏం చదివావు?" అంటూ ఆరాలు తీశాడు. ఆ తర్వాత ఉద్యోగం గురించి అడిగాడు. కుటుంబం గురించి వాకబు చేశాడు. కాంతారావు ఆఖర్ని "నువ్వు పుస్తకాలు చదువుతావా'' అని ప్రశ్నించి ''ఇదిగో మా ఇంటికి వచ్చిన వాళ్ళకి ముందుగా మంచినీళ్ళిచ్చి, ఆ తర్వాతో మంచి పుస్తకం చేతికిచ్చి చదివిం చడం నా అలవాటు. ఇది పూర్తిగా చదువు. ఆ పుస్తకం చదివి నీకు తోచిన అభిప్రాయాలు ఓ కాగితం మీద రాసిపెట్టు. ఆ తర్వాత మళ్లీ నన్ను కలు'' అన్నాడు.

యాదగిరికి, కాంతారావుతో అలా స్నేహం అయ్యింది. 'మాలపల్లి' అతను మొదట చదివిన పుస్తకం. అతని హృదయద్వారాలు తెరిచింది కాంతారావు. అందులోకి గాలీ, వెలుతురూ నింపింది 'మాలపల్లి'. ఆ తర్వాత యాదగిరి కాంతారావుని వదల్లేదు. కాంతారావూ యాదగిరిని వదిలిపెట్టలేదు. తనకి తెలిసిన సంగతులు ఓ గంట చెప్పి లోకం తీరు విపులీకరించి దానికి సాక్ష్యాధారంగా నిలిచే పుస్తకంఒకటి చేతికిచ్చేవాడు.యాదగిరిలో గూడు కట్టుకోబోయిన చీకటిని, మనిషి మీదకి దుమికి చిత్తుచేసే దురభ్యాసాల్ని కాంతారావు పురుగును విదిల్చినట్టు విదిల్చి పారేశాడు.

యాదగిరి భార్య అస్వస్థతని – తన తపననీ, బాధల్నీ అన్నిటినీ కాంతారావుకు చెప్పేవాడు. కాంతారావు ఎప్పటికప్పుడు చిట్కా వైద్యం చేసి యాదగిరిని గట్టున పడేసేవాడు.

యాదగిరి తాగుడు అలవాటు బాగా తగ్గించాలి. నెలకి రెండు సార్లే తాగాలి. అదీ విడతకి ఒకగ్లాసు. తాగినప్పుడల్లా ఆ గ్లాసు ఖరీదు భార్యకి సుంకం కట్టాలి. చేసిన తప్పుపని మళ్ళీ జీ వి తం లో చేయకుండా గుండె బలం సంపాదించాలి. యాదగిరి ఏనాడు తన మనసుని మోసం చేసుకున్న మనిషి కాదు. కాని తన మూలంగా ఏ పొరపాటు చేయాలన్నా ముందు కాంతారావు నీడకీ, ఆ తర్వాత స్వీయ శిక్షకీ భయపడి దానికి దూరంగా జరిగేవాడు.

ఇప్పుడు యాదగిరి తన సంపాదనలో కొంత పొదుపు చేయడం నేర్చుకున్నాడు. పుస్తకాలు చదవడం అలవాటయ్యింది. అయినా ఆ పొదుపుకు అందని ఖర్చు అతని మీదకి వురికింది. నాగమ్మ ఆపరేషన్‌తో అతను కుదేలయ్యాడు. తనేం చెయ్యాలి... ఏం చేసి తను అప్పుల నుంచి తేరుకోగల్డు?

యాదగిరి ఆలోచనల నుంచి తేరుకుని రోడ్డు ఎక్కాడు. తాగి చాలా రోజు లయ్యింది. మరీ నిద్ర పట్టనప్పుడు ఒక్క సీసా తాగాలనిపిస్తుంది. తప్పదు.. సుంకం కట్టయినా తాగాలి. యాదగిరి జేబులు చూసుకున్నాడు. రెండు మూడు నోట్లు తగిలాయి. కాంపౌండుకి వెళ్ళి లెఖ్ఖ ప్రకారం తాగి ఓ బీడీకట్ట కొనుక్కుని ఇంటి మొహం పట్టాడు. అలవాటుగా అరుగు మీద కూర్చున్నాడు.

సడెన్‌గా పక్క వాటా మడిగలోంచి ఆడపిల్ల ఏడుపు వినబడింది.

యాదగిరి కళ్ళు నలుపుకుని చూశాడు. ఆ కొట్టులాంటి ఇల్లు తనింటికి పదడుగుల దూరంలో వుంది. ఆ ఇంట్లో ఎవరూ వుండరు. ఎప్పుడూ తాళం వేసే వుంటుంది. అప్పుడప్పుడు అర్ధరాత్రి వేళ మాత్రం కొంత అల్లరి రేగుతుంది. ఎవ రెవరో వచ్చి రెండు మూడు గంటలు వుండి వెళ్ళిపోతారు.

ఒకటి రెండు మగకంఠాల కేకలు. మరెవరివో గుసగుసలు. యాదగిరికి కుతూహలం ఆగింది కాదు. ఏదో జరుగు తోంది ఆ ఇంట్లో. చదువుకున్నవాళ్ళ పట్నం నుంచి పిల్లల్ని తెచ్చుకుని వాళ్ళ సంతోషం తీర్చుకుంటారని అతనికి తెలుసు.

కానీ ఇంతలో లోపలి నుంచి బిగ్గరగా ఏడుపు వినబడింది.

యాదగిరికి చప్పున ఆవేశం వచ్చింది. త్వరత్వరగా లోపలికివెళ్ళి పెట్టె అడుగున వున్న చాకు తీసి జేబులో పెట్టుకుని బయటకు వచ్చాడు.

యాదగిరి తలుపు దగ్గరకు వెళ్ళే సరికి–

"కాదు కాదు. నువ్వు కాదు...నేను" అంటోన్న వాదాలు విన్పిస్తున్నాయి.

"లోపలున్నాళ్ళు ఎవరు ? దర్వాజా తీయండి. నేకపోతే తలుపు ఇరగగొడ్తా" అంటూ కటువుగా ఒక్క కేక పెట్టాడు.

లోపల నిశ్శబ్దం.

యాదగిరి తలుపులు తట్టడం మానలా. తిరిగి తిరిగి తన్నాడు. దాంతో చుట్టు పక్కల ఇళ్ళవాళ్ళు లేచారు.

"ఏం జరిగినాది?"

"లోన ఏదో బద్మాష్‌పని జరుగుతోంది. ఆడపిల్ల ఏడుపు వినొచ్చింది. తలుపులు




తీయడం లేదు" అన్నాడు యాదగిరి.

నలుగురూ కలిసి తలుపులు తన్నారు. రోడ్డు పక్కన వున్న బండరాళ్లు పెట్టి మోదారు. పావుగంట తర్వాత తలుపులు బద్దలయ్యాయి.

యాదగిరి ముందుగా లోపలికి వెళ్లాడు. జనం ఎవరూ కనబడలేదుగానీ- పట్టె మంచం మీద అపస్మారక స్థితిలో ఆడపిల్ల కనబడింది. యాదగిరి దగ్గరగా వెళ్ళి చూశాడు. కౌముది! అతనికి వంట్లో చిన్న వణుకులాంటిది ప్రారంభమైంది. నోట మాట రాలేదు. భయంతో వెలవెల బోయాడు.

"ఏంది భాయ్! అలా నిలబడిపోయా వేంది" అన్నారు.

"ఈమె మా ఆఫీసులో పని చేస్తదన్నా"

"ఎవరంట. ఊరూ పేరూ తెల్సా?"

యాదగిరి గబగబా తనకు తెలుసున్న విషయాలు చెప్పాడు.

"ఇప్పుడేం జేయాల?"

యాదగిరికి కొత్తగా వెలిసిన కాలనీలో వుంటూన్న రాధాకృష్ణ గుర్తొచ్చాడు. "కొత్తగా కట్టిన కాలనీలో సారున్నాడు. ఆయన్తో చెప్పాల"

"నువ్వురికిరా జల్ది"

యాదగిరి ఒక్క వుదుటున బయట పడ్డాడు. పావుగంటలో యాదగిరితోపాటు రాధాకృష్ణ వచ్చాడు. రాధాకృష్ణ కంగారుగా "ఈవిణ్ని ఆస్పిటల్లో చేర్పించాల్సి వుంటుంది. యాదగిరీ...రోడ్డుమీదకి వెళ్ళి టాక్సీ పిల్చుకురా" అన్నాడు.

నిశ్శబ్దం మధ్య నుంచి నిశీధిలోకి పరిగెత్తాడు యాదగిరి.

* * *

కౌముది వారం రోజులు హాస్పిటల్లో వుంది. మొదటి రాత్రి ఆమెకి స్పృహ లేదు. మర్నాడు కళ్లు తెరిచేటప్పటికి ఆమె కళ్ళకి ముందు తండ్రి కన్పించాడు. తండ్రిని చూడగానే ఆమెకు ఏడుపు పెల్లుబికి రాసాగింది. తలగడ చాటు చేసుకుంది. తండ్రి కళ్ళల్లో బెంగా, దిగులూ చేత ఆయన మరో పది సంవత్సరాలు పెద్దవాడిగా కన్పిస్తున్నాడు. తండ్రి పక్కన నుంచున్న రాముల్ని కూడా చూసింది.

బలరామ్మూర్తి దుఃఖాన్ని ఆపుకుంటూన్న కూతుర్ని చూసి-

"ఛాఛా! ఆ కన్నీళ్ళేమిటి? వద్దు వద్దు" అన్నాడు. ఆయన గొంతు తడారి పోయింది.

కౌముది పక్కకి తిరిగి పడుకుంది. మర్నాడు కౌముది ఆఫీసులో స్నేహితులు వచ్చి కౌముదిని పలకరించారు. కౌముది ఒక్కరితోనూ మాట్లాడలేకపోయింది. ఆ సాయంకాలం రామానుజం వచ్చి పక్క స్టూల్ మీద కూర్చుని "బేబీ-భయపడకు. మేం అందరం వున్నాం నీకు" అన్నాడు.

కౌముది వూరుకుంది.

"చూడు... మామూలుగా నీ గురించి ఆఫీసుకు ఫోన్ చేశాను. ఎవరూ చెప్పలేక పోయారు. ఈవేళ వుదయం గురుమూర్తి గాడు చెబితే షాక్ అయ్యాను. పాపం ఆ యాదగిరిగాడు సమయానికి రాకపోతే మరింత అపాయం జరిగేది. వాడి రుణం మనం తీర్చుకోలేం"

రామానుజం అలా వాగి వాగి నర్స్ వచ్చి హెచ్చరించడంతో వెళ్ళిపోయాడు.

కౌముదికి ఆ సమయంలో ఆప్తుల ఓదార్పులు, పరాయివాళ్ళ పెదవి చివర నుంచి వచ్చే ఒట్టొట్టి మాటలకూ తేడా తెలియడం లేదు. ఆమెని దుఃఖం వివశ

రాల్ని చేసింది.




మరో నాలుగురోజులతర్వాత కౌముది ఇంటికి వచ్చింది. ఇల్లంతా కొత్తగా కన్పించింది. ఉదయం తండ్రి బయటకు వెడతాడు. అప్పటినుంచీ కౌముదికి ఇల్లు జైలులా మారుతుంది. ఏకాకిగా వంటింట్లోనూ, అక్కడ తోచకపోతే పడగ్గదిలోకి, తిరిగి డ్రాయింగ్‌రూమ్‌లోకి తిరగడం. పుస్తకం తెరిస్తే పది నిమిషాలు కూడా పట్టుగా చదవాలనిపించదు.

అందుకే మర్నాడు తండ్రితో అంది–

"నేను రేపటినుంచి ఆఫీసుకు పోతాను నాన్నా"

"అప్పుడే"

"ఇప్పుడు నాకేంఅయింది. శుభ్రంగా తింటున్నాను. ఒంటరిగా ఇంట్లో కూర్చోవాలంటే విసుగనిపిస్తోంది"

"అదికాదు..."

తండ్రి ఏం చెప్పబోతున్నాడో, ఏ అనుమానాల్ని విడమర్చి నచ్చజెప్పాలనుకుంటున్నాడో కౌముదికి అర్థమవుతూనే వుంది.

"ఏం ఫర్వాలేదు. రెండు రోజులు నన్ను చూసి నవ్వుకుంటారు. నవ్వుకోనీ! ఒకళ్లగురించి నన్ను నేనెందుకు బాధ పెట్టుకోవాలి"

బలరామ్మూర్తి మరేమనలేక "సరే. నీ ఇష్టం" అన్నాడు.

కౌముదికి అప్పుడే ఆఫీసులోవాళ్లు ఒక్కొక్కళ్ళే గుర్తుకు రావడం మొదలు పెట్టారు. ఒక్కొక్కళ్ళని బేరీజువేసి అంచనా కట్టుకోవడం మొదలు పెట్టింది. తెలుసున్న అంతమంది జనంలో ఆమెకి మనుషుల్లా తోచింది ఇద్దరే ఇద్దరు.

అందులో మొదటివాడు రాధాకృష్ణ. రెండవవాడు యాదగిరి. కౌముది మర్నాడు ఆఫీసుకు వెళ్ళింది. గేటుదగ్గరే కౌముదిని చూసి కొందరు ఆశ్చర్యపోతే మరికొందరు జాలిగా చూశారు. ఇంకొందరు కలివిడిగా ఏవేవో మాట్లాడుకున్నారు. కౌముది ఏం జరగనట్టు తన సెక్షన్లోకి వెళ్ళి అటెండెన్స్ రిజిస్టర్‌లో సంతకంచేసి ఓ జాయినింగ్ రిపోర్ట్ రాసి గురుమూర్తి టేబిల్ మీద పెట్టి – "నమస్కారం సార్" అంది. గురుమూర్తి తలెత్తి కౌముదినిచూసి బిత్తరపోయాడు. అతనికి చటుక్కున తన కారు, ఆ కారులో తన ప్రవర్తనా, కౌముది తన నుంచి తప్పించుకుపోవడం–అన్నీ సినిమా రీళ్ళలా తిరిగాయి.

"ఇవాళే జాయిన్ అవుతున్నావా?" అన్నాడు ఫార్మల్‌గా.

"అవును"

"అలా కూర్చో"

కౌముది కూర్చుంది.

"ఎంత ఘోరం... మరీ జనం బరితెగించిపోయారు. అవునుగానీ నాలుగు రోజులు రెస్ట్ తీసుకోలేకపోయావా"

"మన ఆఫీసులో కూడా రెస్ట్ తీసుకోవచ్చుకదండీ"

గురుమూర్తి కౌముది జవాబుకు ఆశ్చర్యపోయాడు.

"ఆరోజు నేను తొందరపడ్డాను.

నువ్వు నా కారు దిగి పారిపోయి బ్లండర్ చేశావ్. లేకపోతే ఇలా జరిగేదికాదు. అవునా?''

కౌముది మాట్లాడలేదు. ఆ తర్వాత సెక్షన్లోవాళ్లంతా పరోక్షంగా కౌముది గురించి మాట్లాడుకుని కౌముదినిమాత్రం జాలిగా పలకరించారు. కౌముది అందరి జాలి మాటలు అందిపుచ్చుకుంది. అంతే! కానీ కౌముదిని ఆ సాయంత్రం ఇంటికి వస్తూంటేబాగా ఆలోచింపజేసినవి రెండు విషయాలు. ఒకటి-అందరిలా రాధాకృష్ణ తనని పలకరించడానికి ప్రయత్నించక పోవడం. రెండవది - యాదగిరినిచూసి కూడా తను ఏవిధమైన కృతజ్ఞతా చెప్ప లేక తికమకపడ్డం.

రాధాకృష్ణ ప్రవర్తన తనకి కొత్తగా అన్పిస్తే, యాదగిరిపట్ల తను ద్రోహం చేసినట్టు అన్పించింది. అదే అర్థం కాలేదు కౌముదికి దారిపొడుగునా.

అయితే వందగజాలు వెళ్ళేసరికి పక్క సందులోంచి యాదగిరి సైకిలు నడిపించు కుంటూ రావడం కన్పించింది. యాదగిరి దగ్గరగా వచ్చిన తర్వాత తన వైపు చూసి కళ్లు దించుకోవడం కౌముది గమనించింది.

"ఎక్కడ నుంచి వస్తున్నావ్ యాదగిరీ?" అంది కౌముది.

"ఈడనించే ... మందులషాపుకాడ కెళ్లిన" అన్నాడు.

"మందులు ఎవరికి?"

"మా భార్యకి"

"ఆమెకేమయింది?"

యాదగిరి వెంటనే జవాబు చెప్పలేదు.

కౌముది "మందులు కొన్నావా?" అంది.

"లే...పైసలు తక్కువ పడినయ్"

"అరే. ఎంత తక్కువపడ్డాయి?"

యాదగిరి ఓసారి కళ్ళెత్తి కౌముది వైపు చూసి-

"ఇంటి దగ్గర నాయన దగ్గర వున్నయ్"

"రేపు ఆఫీసులో ఇద్దువుగాని. ఎంత కావాలేమిటి?"

"దస్ రూపాయి"

కౌముది పది రూపాయల నోటు తీసి యాదగిరి చేతికిచ్చి - "మందులు కొను క్కురా" అంది.

యాదగిరి సైకిలుస్టాండ్ వేసి మందుల షాపులోకి వెళ్లి అయిదు నిమిషాల్లో తిరిగివచ్చి తిరిగి అక్కడే నుంచున్న కౌముదిని చూసి ఆశ్చర్యపోయాడు.

"పద. నన్ను ఇంటిదాకా దింపివద్దువు గాని"

యాదగిరి మాట్లాడలేదు. కౌముది వెనకే సైకిలు నడిపించుకుంటూ వెళ్ల సాగాడు. కౌముది ఒకటి రెండు సార్లు వెనక్కి తిరిగి - "అదేమిటి...వెనకగా నడుస్తున్నావ్?" అంటూ యాదగిరికోసం ఆగింది.

"యాదగిరీ" అంది కౌముది నెమ్మదిగా.

"నువ్వు చేసిన సహాయానికి నా కృతజ్ఞతలు ఇప్పుడు చెబుతున్నాను. నన్ను చచ్చిపోకుండా బతికించింది నువ్వు. నేను ఆ వేళ చచ్చిపోతే నా కథ వేరుగా ఉండేది. కానీ నీమూలంగా బతికాను"

యాదగిరి మాటల కోసం వెదుక్కుం టున్నాడు. కౌముదితో అతను ఆఫీసులో ఎన్నోసార్లు మాట్లాడాడు. ఎన్నోసార్లు పలకరించాడు. కౌముది విసుక్కున్నా, కసురుకున్నా - ఇష్టంగానూ, అయిష్టం గానూ కూడా జవాబు చెప్పిన రోజులు వున్నాయి. కానీ ఇది ఆఫీసు కాదు...

బజారు. కౌముది అనే స్త్రీ అతనికి కొత్తగా కన్పిస్తోంది. ఆమెకు తను చేసిన సహాయానికి ఓరోజు తిరిగి ఇలా ఆమె నుంచి ఇలాంటి మాటను వినవల్సి వస్తుందని అతను ఊహించను కూడా ఊహించలేదు. ఆరోజు సంఘటన అతనికి ఒకటి రెండు రోజులు గుర్తుంది. ఆ తర్వాత అడుగున పడిపోయింది.

ఇంతలో కౌముది అంది–

"నువ్వీమధ్య శెలవు పెట్టావన్నారు. ఎందుకూ? నీ భార్యకి వంట్లో బాగాలేదా?"

"అవ్..ఆపరేషన్ జరిగింది.''

"మీ అమ్మా, నాన్నా..."

"ఆఫీసుకు రావడం పోవడం కష్టమవుతోందని నేనూ, నా భార్యా వేరే ఉంటున్నాం"

"నీ భార్య జబ్బుకి బాగా ఖర్చయిందా?"

"రెండు వేలు అయినాది"

"అబ్బా'' అంది. ఇంతలో ఇల్లు దగ్గరవడంతో–

''మంచిది యాదగిరీ.నువ్వెళ్లి రా"అని ఏదో జ్ఞాపకం వచ్చి "వుండు" అని చెప్పి పక్కనే వున్న పళ్ల దుకాణం దగ్గరకు వెళ్లి రెండు యాపిల్ పళ్లుకొని యాదగిరికి ఇస్తూ – "మీ ఆవిడకి ఇవ్వు" అంది.

యాదగిరి తీసుకోలేదు.

"ఫర్వాలేదు...తీసుకో"

యాదగిరి మనసులో కృతజ్ఞతని





మాటల్లో విడమర్చి చెప్పలేకా, ఆ కృతజ్ఞతని కళ్లల్లో దాచుకోలేకా తికమక పడ్డాడు.

కౌముది ఇంటికి వచ్చేసరికి వీధి తలుపులు బార్లా తీసివున్నాయి. హాల్లో చుట్టుపక్కల ఇళ్లవాళ్లు పోగయి ఉన్నారు. కౌముది కంగారుగా "ఏమయింది?" అంటూ వాళ్లని తప్పించు

లోపలికి వచ్చాడు. పది నిమిషాలు పరీక్ష చేసి – "ఎవరి తాలూకు?" అని సమాధానం వినకుండా "వెంటనే ఆస్పిటల్లో చేర్పించండి. ఈయనకు హార్ట్ ఎటాక్ వచ్చింది. తిరిగి స్ట్రోక్ రాకుండా వైద్యం జరగాలి" అన్నాడు.

కౌముది నిస్పృహాయంగా తండ్రి వైపు, ఇంటిలో జనం వైపు చూసింది



కుని చూసింది. మంచంమీద తండ్రి పడున్నాడు. పక్కింటాయన గబగబా చెప్పాడు. బలరామ్మూర్తిగారు బయటకు వెళ్ళబోతూ వీధి గుమ్మంలో చతికిలబడి పోయాడని, ఆయన గుండెలు రాసుకుంటూ కిందామీదా అయితే తామందరం వచ్చామని. ఇంతలో ఎవరో తోడుండి తీసుకురాగా వీధి చివరఉండే డాక్టర్

ఓ క్షణం.

* * *

బలరామ్మూర్తిగారు హాస్పిటల్లో చేరిన నాలుగోరోజున తిరిగి గుండెపోటు రావడంతో చనిపోయాడు. తండ్రి పోయేముందు పక్కన కౌముది ఒకత్తే వుంది.

అన్న జనార్దనానికి తండ్రి హాస్పిటల్లో చేరినరోజే టెలిగ్రాం ఇచ్చింది. కానీ జనార్దనం తండ్రి పోయిన నాలుగో రోజుకు వచ్చాడు ఒక్కడూ. కౌముదిని స్నేహితులపాటి కూడా ఓదార్చలేక పోయాడు.

"బాధపడకే.... నాన్న పెద్దవాడయ్యాడు. ఆయనకేం అదృష్టవంతుడు. ఒక్క నీ పెళ్లి చూడలేకపోయాడుగానీ" అన్నాడు.

కౌముది మాట్లాడలేదు.

"నీకు ప్రమోషన్‌లాంటిదేంరాలేదా?"

"వచ్చింది. సెక్షన్ ఆఫీసర్నయ్యాను"

"ఇప్పుడు జీతం ఎంత వస్తోంది?"

కౌముది చెప్పింది. జనార్దనం చెల్లెలు చెప్పిన జవాబు విని – "ఫరవాలేదు. హాయిగా బతకొచ్చు" అన్నాడు.

కౌముదికి ఏడుపు వచ్చినంత పనయింది. డబ్బుతో హాయిగా బతకొచ్చనీ, అది లేకపోతే కుళ్లి చచ్చిపోతారనే ఆదర్శాన్ని అన్నగారు నమ్ముకుని బతుకుతోన్నట్టు అర్థమయి అన్నగారి మొహం చూడ్డానికే అసహ్యం వేసింది.

"డబ్బుతోనే జీవితాలు వెళ్ళమారతాయంటే ఆశ్చర్యపడాలి" అంది వెగటుగా.

"ఈరోజుల్లో అన్నిటికీ డబ్బేకదా ముఖ్యం"

"అందరికీ అని అనలేదు... ఇంకా నయం"

"అంటే నీ వుద్దేశం?"

"నా వుద్దేశంతో నీకు పనేమిటిలే! నీకు తెలిసిందంతా చెప్పేశావుగా.. చాల్లే"

"ఇంకా వుందే నీ బతుకు గురించి"

"నా బతుకు డబ్బుతో వెళ్ళదనా నీ అనుమానం"

"అదికాదే... నీ పెళ్లి..."

"నా పెళ్ళి...?"

"అయిపోతే బావుణ్ను"

"ఎవరికి...నీకా, నాకా?" అంది ఏమీ అర్థంకానట్టు.

"బావుంది నీ ప్రశ్నలు. ఢిల్లీలో నేనెరుగున్న స్నేహితులొకాయనవున్నారు. భార్య పోయింది. ఇద్దరే పిల్లలు. ఆయన..."

కౌముదికి చిరాకువేసింది. "అలాంటి వాళ్ళు ఢిల్లీదాకా ఎందుకు, ఈ ఊళ్ళోనే దొరుకుతారు. నువ్వేం శ్రమపడకు నా పెళ్ళి గురించి"

"వదిన చెప్పమంది"

"అంటే వదిన చూసిన సంబంధం అన్నమాట" కౌముది ఎత్తిపొడుపు అతనికి అర్థం అయిందో లేదోగానీ అవాక్కు అయిపోయాడు.

"నేను రేపు ఢిల్లీ వెళ్ళిపోతాను. ఓ వారం పదిరోజులు సెలవుపడేసి నాకూడా రాకూడదూ?"

"వద్దులే"

జనార్దనం మరేం అనలేదు. మర్నాడు జనార్దనం వెళ్ళిపోయాడు.

కౌముది ఇంటిలో ఒంటరిగా మిగిలిపోయింది.

ఆ తరువాత రామానుజం వచ్చి కౌముదిని పలకరించాడు.

"ఒంటరిదానివయిపోయావు" అన్నాడు.

"ఏం చేస్తాం తప్పదుగా"

"నీకు నేను చెప్పఖ్ఖరలేదనుకో. బెంగపెట్టుకోకు. ఎవరు పోయినా, పోకపోయినా మిగిలినవాళ్ళ బతుకులు ఆగవు. అవి సాగవల్సిందే. అవి ఎలా




పోవాలన్నది మనం తీసుకునే నిర్ణయాల మీద ఆధారపడి వుంటుంది"

"మీ సలహాకి థాంక్స్" అంది.

"నీకు తోచకపోతే మా ఇంటికిరా. ఈ నెలలో సుజాత ఓనెల శెలవు పెట్టి వస్తోంది. మీ ఇద్దరికి కాలక్షేపం అవుతుంది"

''అలాగే''

రామానుజం కాసేపు ఆగి – ''నాన్న పోయాడు. వాడేం దాచిపెట్టలేదని నాకు తెలుసుగానీ అప్పులులాంటివి చేసుంటాడని నా అనుమానం. ఏమన్నా డబ్బు కావాలా?'' అంటూ పర్స్ తీసాడు.

"అక్కరలేదు. నా ఉద్యోగంలో అవన్నీ తేర్చేశాను లెండి" అంది.

''అది సరే. మరి...''

"మరి?"

"అదికాదు కౌముదీ! ఎన్ని రోజులిలా వుంటావు. మంచి సంబంధం చూడమంటావా? పెళ్ళి చేసుకుందువుగాని"

కౌముది రామానుజం కళ్ళల్లోకి చూసింది. చిన్నగా నవ్వి అంది–

"ఈ సంబంధాలు చూడ్డం, అవి నాకు నచ్చకపోవడం – ఈ గొడవంతా దేనికి. మీరు చేసుకోకూడదా?"

రామానుజంగారికి దిమ్మ తిరిగి పోయింది.

"నేనా..." అన్నాడు ఆశ్చర్యంగా.

"అవును"

"ఆలోచించాల్సిందే"

"అదేమిటి. మీకు నేనంటే ఇష్టమని నాకు తెలుసు. ఇందులో ఆలోచించాల్సిందేం వుంది?''

"పెళ్ళి ఒక్కటే మార్గమంటావా? ఆలోచించు" అనేశాడు ఎంతో ఆతృతగా.

"అంటే...."

"పెళ్ళి అంటే చాలా గొడవలు వున్నాయి కౌముదీ! ఈ వయసుకూ, పెళ్ళికి సరిపడదు. ఊరంతా తెలుస్తుంది. ఇక సుజాతకి తెలిసిందంటే నా నెత్తి మీద వెంట్రుకలు వుండనివ్వదు. అయినా మనం సుఖపడ్డానికి, పెళ్ళికి లంకెం దుకు పెడతావు? నేను నిన్ను ఏ పరిస్థితుల్లోనూ దగా చేయను. నా మీదా, నా డబ్బు మీదా అజమాయిషీ చెయ్యి. ఒప్పుకుంటాను. నువ్వంటే నాకు ఆపేక్షవుందని కనిపెట్టినదానివి–నీకు నా మీద అనుమానాలు కూడా వుండకూడదుకదా?''

కౌముదికి రామానుజం మాట్లాడే భాష, భావం అర్థమవుతూనేవున్నాయి. "అంటే నేను భార్యగా మీకు తగననీ, కానీ మీ అవసరానికి వుపయోగపడతాననీ మాత్రం తెలుసుకోమంటారు. అంతేనా?"

రామానుజం పెద్దగా నవ్వేశాడు. "ప్రతి మనిషికీ కొన్ని అర్హతలు వుంటాయి. ఆ అర్హతల బట్టే జీవితం రకరకాల దారుల్లో పడి నడుస్తుంది. ఇదోసత్యం. చూశావోలేదో ఎవడి చదువును బట్టీ, ఎవడి అదృష్టాన్ని బట్టీ వాడికి వుద్యోగం దొరుకుతుంది. నన్ను ఎల్.డి.సి.గానూ, నిన్ను మరీ చిన్న వుద్యోగంలోనూ ఎవరూ ఊహించరు. ఎందుకంటే మన మొహాల మీదే తెలుస్తుంది మన రాత! అలాగే అన్నీనూ. పదహారేళ్ళ అమ్మాయికి వుండే నాజూకుతనం ముప్పై ఏళ్ళ అమ్మాయిలోకి రమ్మంటే వస్తుందా? కానీ సుఖపడ్డం విషయంలో ఇద్దరికీ తేడా వుండదు. నువ్వీ వయసులో మెచ్యూర్డ్ వుమన్‌గా ఆలోచించాలి గానీ టీనేజ్ గరల్‌గా ఊహించకూడదు"

కౌముదికి ఒక్క వుదుటన కోపం

వచ్చింది.

"మీరు ముప్పై ఏళ్ళ కుర్రాడిలా ఆడదాని కోసం వేషాలు వేయడానికి మీకున్న అర్హతలేమిటండీ?" అంది.

"అలా అడుగుతావు బేబీ...నాకు తెలుసు. నాకు డబ్బుంది. నేను మొగ వాణ్ణి. ఈ రెండూ చాలు. నేనేమయినా చేయగలను. నీకు డబ్బులేదు. ఏకాకివి. అందులోనూ పెళ్ళికాని ఆడపిల్లవి. పైగా నీ మీద బోల్టు స్కేండల్స్ వున్నాయి. ఇవన్నీ మర్చిపోయి నువ్వు ఆకాశ హర్మ్యాలు నిర్మించుకుంటే నీకే నష్టం"

"ప్లీజ్...షటప్"

రామానుజం కౌముది దగ్గరగా వచ్చి కౌముదిని రెండు చేతుల్లోకి తీసుకుని-"నా మాట విను. నీ మీద ప్రేమ అయిదేళ్ళ నుంచి పెంచుకున్నాను.కాదనకు.నీగురించి ఎన్నో చేసి చూపిస్తాను. పెళ్ళిమాట మాత్రం ఎత్తకు"

కౌముది రామానుజాన్ని గెంటేసింది. రామానుజం కౌముది ముందు మరీ చిత్తుగా ఓడిపోవడం ఇష్టంలేక వెనక్కి తగ్గాడు. కౌముది కళ్ళలో రామానుజానికి ఆడపులి కన్పించింది.

* * *

కౌముది రోజూలా ఆఫీసు నుంచి తిరిగి వచ్చి పడక కుర్చీలో వాలింది. తల మీద ఎడం చెయ్యి పెట్టుకుంది. సాయంకాలం అవుతోందంటే-చీకటి పడి అది రాత్రిగా మారుతోదంటే ఆమెకి భయంగా వుంటోందీ మధ్య. నిద్రవచ్చేటంత వరకూ పుస్తకం పట్టుకుని కూర్చుంటే గడియారం కాలం మీద దాడి చేయడం తప్ప నిద్ర కళ్ళ మీదకి రాదు.

వీధి తలుపు చప్పుడయితే లేచి - "ఎవరూ" అంటూ తలుపు తెరిచి గుమ్మం బయట నుంచున్న నళిని భర్త మోహనరావుని చూసి ఆశ్చర్యంతో "మీరా" అనేసి "లోపలికి రండి" అంటూ ఆహ్వానించింది.

మోహనరావు లోపలికి వస్తూ "ఒక్కరూ వున్నారేమిటి. మీ నాన్నగారు ఇంకా ఇంటికి రాలేదా?" అన్నాడు.

కౌముదికి ఏం జవాబు చెప్పాలో తెలియలేదు. తల వంచుకుని - "నాన్న పోయి నెలయ్యింది" అంది.

మోహనరావు నివ్వెరపోయాడు. కొంచెం తేరుకుని-"ఎలా జరిగింది? మాకు తెలియలేదే. మీరు ఉత్తరం రాశారా నళినికి?" అన్నాడు.

"రాయలేదు. అది నా పొరబాటే. క్షమించండి" చిన్న అబద్ధం ఆడింది కౌముది.

"అంటే మమ్మల్ని పూర్తిగా మర్చిపోయారన్న మాట"

"నా ఉద్దేశం అదికాదు. మిమ్మల్ని బాధపెడతానని..."

"మీకో అన్నయ్య వుండాలి. ఆయనైనా వచ్చారా?"

కౌముదికి దుఃఖం ఆగింది కాదు.

"బాధపడకండి. ఈ విషయం మాకు తెలిసేనేనైనా వచ్చేవాణ్ని. నళినినయినా పంపేవాణ్ని..."

"దానికి ఒంట్లో బాగోలేదని రాసింది"

"ఆ...దాని తలకాయ.చిన్న రోగాన్ని పెద్దగా ఊహించుకుని బాధపడ్డం అలవాటు చేసుకుందీ మధ్య"

"కాఫీ తీసుకు వస్తాను" అంటూ కౌముది లోపలికి వెళ్లి రెండు కప్పుల్లో కాఫీ తెచ్చి మోహనరావుకి ఇచ్చి, తనొకటి తీసుకుంది.

"మరి మీరు ఒక్కరే వచ్చారుగా.




దాన్ని తీసుకురాలేదంటే దాని ఆరోగ్యం బాగోలేదనేకదా" అంది నవ్వుతూ.

మోహనరావు నవ్వేశాడు. "నేను ఆఫీసు పని మీద మద్రాసు వెళ్లాను. ఆ పని కాలేదు. హైదరాబాద్ పోమ్మంటే ఇటు వచ్చాను. రెండు మూడు రోజు లిక్కడే వుండాల్సి వచ్చేటట్టు వుంది"

కౌముది వంటింట్లోకి వెళ్లి స్టవ్ మీద అన్నం పడేసి వచ్చింది. అన్నం వుడికి అది తయారయేలోపున మోహనరావు కౌముదిని ఏవేవో ప్రశ్నిస్తూనే వున్నాడు.

భోజనం అయిన తర్వాత మోహన రావు అన్నాడు—

"నేనయితే ఆఫీసు నుంచి ఇటే వచ్చాను. నే వెళ్లి ఏ లాడ్జిలోనో రూమ్ చూసుకుంటాను. మళ్ళీ మిమ్మల్ని రేపు ఆఫీసులో కలుస్తాను"

కౌముది నెమ్మదిగా అంది "మా ఇంట్లో వుండండి. వేరే లాడ్జి ఎందుకు"

కౌముదికి మోహన రావులో తనెంతకాలంగానో ఎదురు చూసిన మంచి స్నేహితుడు కన్పించాడు. ఏ అరమరికలూ లేకుండా రామానుజం గురించీ, రాధాకృష్ణ గురించీ చెప్పింది. ఆఖరిగా తనుపడ్డ భంగపాటూ, రామానుజం పెట్టిన కండీషనూ అన్నీ చెప్పింది.

మోహనరావు చాలా సేపు ఆలోచించు కుని—

"నాకో అయిడియా వచ్చింది.చెప్పనా" అన్నాడు." ఈ పరిస్థితిలో మీరు ఇక్కడ వుండడం — అదీ ఒంటరిగా ఏం బాగుండ లేదు. అలాగని మిమ్మల్ని భయపెట్టడం నా ఉద్దేశంకాదు. మీరు రేపే ఉద్యో గానికి రాజీనామా చేసేసి నాతో బెంగు ళూరు బయలుదేరండి. ఆ ఊరూ, ఆ వాతావరణంతో కొంత మార్పు వస్తుంది. ఏమంటారు?"

"నన్ను కొంచెం ఆలోచించుకో నివ్వండి"

"ఏమిటి ఆలోచిస్తారు? ఎంత ఆలో చించినా ఒకటే! ఈ ఆలోచించే నైజం వల్లే మనిషికిన్ని ఇబ్బందులు"

"నేను అక్కడికి వచ్చినా నా రొటీన్‌లో మార్పు వుండదనిపిస్తుంది. ఇక్కడయితే నా బాధలేవో నేను పడు తున్నాను. నా మూలంగా మీ అందరికీ శ్రమే తప్ప మరేం లాభం?"

"అదేంకాదు. హాయిగా వుంటుం దక్కడ. పైగా మా కుర్రాళ్లతో కాల క్షేపం అవుతుంది. సరేనంటారా... మీకు తెలియని మనిషికాదు"

అలా మోహనరావు కౌముది పెర్స నల్ విషయాలు దాటి ఆఫీసు విశేషాలూ, బెంగుళూరుకబుర్లూ,రాజకీయాలూమాట్లాడి నిద్రపోయాడు. కౌముది కూడా తన గదిలోకి వెళ్ళి పడుకుంది. మోహనరావు చెప్పిన హితవు,సలహా ఆమెహృదయానికి కొంత వూరట కల్గించాయి. తనింత కాలంగా ఇలాంటి మనుషులకు దూరంగా, వాళ్ళని మర్చిపోయి ఎలా వుండగల్గానా అని ఆలోచిస్తే ఆమెకే సజావయిన కారణం దొరకలేదు.

తెల్లవారి లేచి మోహనరావు బయటకు వెడుతూ—

"ఈవేళ ఆఫీసుకు వెళ్ళి రిజైన్‌చేసి వచ్చెయ్యండి. మళ్ళీ మర్చిపోయేరు" అంటూ గుర్తుచేశాడు.

"రిజైన్ చేయడం ఎందుకు. లీవు అప్లయిచేస్తాను. నెమ్మదిగా రిజైన్‌చేసినా నష్టం వుండదులెండి"

"మీ ఇష్టం" అన్నాడు మోహన

రావు వెడుతూ.

కౌముది ఆఫీసుకు వెళ్ళింది. తన కేబిన్ లోకి వెళ్ళేసరికి కేబిన్ముందు ఎవరితోనో మాట్లాడుతూ యాదగిరి కన్పించాడు. యాదగిరిని చూడగానే కౌముది వెంటనే-

"యాదగిరీ! ఓసారి లోపలికిరా. నీతో మాట్లాడాలి" అంది.

యాదగిరి కేబిన్లోకి వచ్చాడు.

"మీ నాన్న వూళ్ళో వున్నాడా?"

"ఉండాడు"

"నేను అర్జంటు పనిమీద బెంగుళూరు వెడుతున్నాను. వారం, పదిహేనురోజుల వరకూ రాకపోవచ్చు. మీ నాయన్నిగానీ, తమ్ముణ్ని గానీ రాత్రుళ్లు మా ఇంట్లో పడుకోమని చెబుతావా?'' అంది.

"గట్టనే" అన్నాడు యాదగిరి.

''నీ భార్యకి ఎలా ఉంది..?''

"అలానే వుంది..''

''అరే... డబ్బు అదీ చూసుకున్నావా?"

''ఆ....''

''పోనీ ఏమన్నా యివ్వమంటావా నన్ను?''

"లోను ఎట్టిన.. అద్దు..'' అన్నాడు యాదగిరి తల వంచుకుని.

''మంచిది'' అంది.

యాదగిరి బయటకు వెళ్లిపోయాడు.

కౌముది లీవు రాసి సెక్రటరీ దగ్గరకు వెళ్ళి ఇచ్చింది.

* * *

నళిని వాకిట్లో ఎదురయిన భర్తనీ, కౌముదినీ చూసి ఆశ్చర్యపోయింది.. మొదట ఆమె తను చూస్తూన్నది కల అనుకుంది. కౌముది ఆ కలను భగ్నంచేస్తూ ''నళినీ" అంటూ భుజం మీద చెయ్యి వేసింది.

''నువ్వు'' అంది నళిని తెరుకోలేక.

''నేనేనే! నువ్వేమిటి ఇలా చిక్కిపోయావు" అంది కౌముది ఆప్యాయంగా.

అప్పుడు నళినికి వాస్తవం అర్థమైంది- కౌముది తల్లి, ఆ తర్వాత తండ్రి పోయిన మనిషనీ, తను పరామర్శ చేయాలనీనూ.

''మీ అమ్మగారు పోయారని రాశావు. తర్వాత.." అంది భర్తను చూసి ఆగిపోయి,"మీరు కౌముది ఎక్కడ కలిశారు? ఎలా వచ్చారు? మీరు, హైదరాబాద్..'' ఆగిపోయింది నళిని.

''నళిని మీ స్నేహితురాలని గొప్పగా చెబుతావు. చూడు.. ఎంత పని చేసిందో? నెల అయినా వాళ్ల నాన్నగారు పోతే మనకి ఉత్తరం రాయలేదు''

''మీ నాన్నగారు పోవడం ఏమిటే" అంది అదోలా నళిని.

''అవునే సడెన్‌గా హార్ట్ ఎటాక్ వచ్చింది''

"ఆ ఇంట్లో ఒక్కదాన్ని చూసేసరికి నాకు మతిపోయింది. నళినీ''

''మీరు మద్రాసని బయలుదేరారు.."

నళిని ఆగిపోయింది.

"అదంతా పెద్ద గొడవలే... ముందు మాకు కాఫీ గట్రా ఏమన్నా ఇవ్వు. తర్వాత అన్ని విషయాలు మాట్లాడుకోవచ్చు"

నళిని వంటింటివైపు బయలుదేరింది. కౌముది వెనకే వెళ్ళి - "నువ్వేమిటే ఇలా వున్నావ్? మందులూ అవీ తీసుకోవడం లేదా?"

"తీసుకుంటున్నానే"

"నువ్వుండు. కాఫీ నేను కలుపుతానులే" అంది కౌముది.





"ఫర్వాలేదే... నీకెందుకు శ్రమ"

"బావుంది. ఇది శ్రమకాదే సహాయం" అంటూ కౌముది నళినిని వాకిటివైపు తోసింది.

నళిని వెనకే కౌముది ట్రేలో కాఫీలు పెట్టి—"బావగారేరీ?" అంది.

మోహనరావు బెడ్ రూమ్ లోంచే "వస్తున్నాను" అంటూ లుంగీ కట్టుకుని వచ్చాడు.

ముగ్గురూ కాఫీ తాగారు. నళిని కాసేపు ఆగి "కౌముదీ! నువ్వెళ్లి స్నానం చేసిరా" అంది సలహాగా.

కౌముది చీరా, జాకెట్ తీసుకుని బాత్ రూమ్ వైపు వెళ్లిన తర్వాత భర్తవైపో సారి చూసి—"ఏమిటి ఆలోచిస్తున్నారు?"

మోహనరావు నళినివైపు తేరిపార చూసి "నేను లేని రెండు రోజుల్లో నువ్వెంత చిక్కిపోయావో...! దానికి కారణం ఏమయివుంటుందోనని ఆలోచిస్తున్నాను"

"భర్త గుమ్మందాటి వెడితే భార్య పడే ఆవేదన మీకు అర్థంకాదు"

"ఆ...మళ్ళీ కౌముది రావచ్చు. చూడు నళినీ..." అంటూ తను మద్రాసు నుంచి హైదరాబాద్ ఎలా వెళ్ళిందీ, కౌముదిని కల్సుకున్న సంగతీ అన్నీ చెప్పి ఆఖరిగా అన్నాడు రక్తం పంచుకుని పుట్టిన అన్నగారు వుండీ లేని వాడయ్యాడు. కానీ తోడబుట్టినవాళ్లు లేనిలోటు మనంతీర్చాలి ఆ అమ్మాయికి. ఉద్యోగానికి రిజైన్ చేసేయమన్నాను. అసలు నా కూడా రానంది. బలవంతంగా లాక్కొచ్చాను" మోహనరావు మాటలు పూర్తికాకుండానే – "బాగానే వుంది" అంది నళిని.

"కౌముదికి కిందా మీదా పడి మన ఆఫీసులో ఉద్యోగం ఇప్పిస్తానన్నాను. అదొకటి చూడాలి"

నళిని ఏదో అనబోయి ఇంతలో కౌముది రావడంతో మాట్లాడ్డం ఆపింది.

"ఏమిటే నళినీ! బావగారూ, నువ్వూ మౌనవ్రతం పాటిస్తున్నారా?"

"తను మాట్లాడుతుందండీ. నాచేతే ఆ వ్రతం పట్టించాలని మీ స్నేహితురాలి కోరిక"

"మా నళిని అలాంటిదేంకాదు" అంది. అని – "పిల్లలెప్పుడొస్తారే స్కూలునుంచి? నన్ను వాళ్లు గుర్తు పడతారంటావా? వాళ్ళని చూసి ఐదేళ్ళు పైన అయ్యింది" కౌముది జ్ఞాపకం చేసుకుంటోంది.

"అది సరే! మీరు స్నానం అదీ చెయ్యండి. ఆఫీసుకు పోనక్కరలేదా ఏమిటి?" అంది చిరుకోపంతో నళిని.

"ఇక ఆఫీసుకుపోయేది రేపే. పిల్లలు వచ్చిన తర్వాత అందరం కబ్బన్ పార్క్ కి పోదాం. సరేనా?"

"కబ్బన్ పార్క్ కా... ఎందుకూ"

"పనిలేక" నవ్వేశాడు మోహనరావు.

"తోచక అంటారనుకున్నాను" నళిని అంది.

"కాదు. నేను వచ్చిన సందర్భంలో వెడుతున్నాం. కదండీ బావగారూ" అంది కౌముది మాట కలుపుతూ.

"నాకు తలనొప్పిగా వుందే"

"చల్లగాలికీ, తలనొప్పికీ విరోధం రెండూ ఒకచోట కలవ్వు"

"చాలులెండి వేళాకోళం. పైగా వంట ఒకటి వుంది"

"నేను వండుతానే నళినీ... నువ్వేం భయపడకు"

నళిని మరేం మాట్లాడలేదు. అప్పటికే

టవల్ భుజంమీద వేసుకుని మోహనరావు వెళ్లాడు.

కౌముది మోహనరావుని వెళ్ళనిచ్చి "నళినీ" అంది నెమ్మదిగా.

"ఏం" అన్నట్టు చూసింది.

"నేనిలా నీదగ్గరకు వస్తానని అనుకోలేదే! బాధలు! మూటగట్టుకుని కన్నీరు కడవలకొద్దీ ఎత్తుకుంటూ ఏదో గురించిపడ్డ ఆవేదనచూస్తే నాకు కన్నీరు ఆగిందికాదే. ఆయన వాత్సల్యం చూస్తే దానికోసమే నేను కాచుకున్నట్టు మనసు ఉక్కిరిబిక్కిరయిందే! వచ్చేశాను" అంటూ కౌముది తన్మయత్వంతో చెప్పకుపోసాగింది.

నళినికి కౌముదిలో తన్మయత్వం కొత్తగా కన్పించింది. తనెరుగున్న



ఒకరోజు చచ్చిపోతాననుకునేదాన్ని. ఇదంతా ఇలా జరుగుతుందని నేను అనుకోలేదే! ఇప్పటికీ నాకు అంతా కలగానే వుంది. నళినీ... నాకు నువ్వు స్నేహితురాలివి. నేనంటే నువ్వు ప్రాణం పెట్టచ్చు. కానీ బావగారు. ఆయన నా

కౌముదిని తను చూస్తోన్నట్టు ఆమె మనసు అంగీకరించడంలేదు. ఆమె మనసులో తన అనారోగ్యం, తరిగిన తన అందం కదులాడుతున్నాయి. ఎదురుగా సోఫాలో కూర్చున్న అవివాహిత, ప్రేమించిన వాడిచేత మోసగింపబడ్డ ఆడదీ, పెళ్లి కాకుండా నలుగురిచేత అవమానింపబడ్డ స్త్రీ, ముప్ఫైఏళ్లుదాటిపెళ్లి మొహం ఎరగని

చిన్నది.... ఆమెకళ్ళకి కన్పిస్తోంది.

"ఏమిటోనే నాకు తల తిరుగుతోంది. కాసేపు పడుకుంటాను" అంది బెడ్‌రూమ్ లోకి వెడుతూ నళిని.

"నే తీసుకువెడతాను" అని కౌముది నళిని భుజం పట్టుకుని బెడ్‌రూమ్‌వరకూ నడిపించుకుని అటుగావస్తూన్న మోహన రావుని చూసి ఆగిపోయి—

"నళినికి తల తిరుగుతోందిట. డాక్టర్ని తీసుకువస్తారా" అంది.

"మీ అక్కకి జబ్బు మొదలయినప్పటి నుంచీ నేనే ఫస్టెయిడ్ చేస్తున్నాను. భయపడకండి" అని నళినిని బెడ్‌రూమ్ లోకి తీసుకువెళ్ళి—

"మంచం ఎక్కండి దొరసానిగారూ" అన్నాడు.

"అంతజబ్బేం లేదు. మీరు వెళ్ళండి" అంది విసుగ్గా.

"అరగంటలో తయారయి మాతో కబ్బన్‌పార్క్‌కి రావాలి నువ్వు. లేకపోతే పిల్లల్నీ, మీ కౌముదినీ తీసుకుని నేను వెడతాను. ఆపైన నీ ఇష్టం" అనేసి బట్టలేసుకోవడం మొదలుపెట్టాడు మోహన రావు.

"ఈవేళ వెళ్ళకపోతేనేం?"

"వెడితేనేం?"

నళిని అప్పటికేం మాట్లాడలేదు. కానీ అరగంటలోపే లేచి తల దువ్వుకుని కొత్త చీర కట్టుకుని వాకిట్లోకి వచ్చింది.

నళినినిచూసి కౌముది ఆశ్చర్యపోయి

"అమ్మ దొంగా! ఇంకా కాలేజీరోజుల్లో బుద్ధులు పోనిచ్చుకున్నావ్‌కాదే" అంది, నళిని భుజంమీద ఒకచేసి. నళిని చిన్నగా నవ్వింది. ఇంతలో బయటనుంచి పిల్లలు వచ్చి మొదట కౌముదినిచూసి విస్తుపోయారు. ఆ తర్వాత మోహనరావు కౌముదిని చూపించి "హైదరాబాద్ ఆంటీగా" పరిచయం చేశాడు. దాంతో పిల్లలు కౌముది దగ్గరకు వెళ్లారు చనువుగా.

* * *

కబ్బన్ పార్కునుంచి వచ్చేటప్పటికి రాత్రి ఎనిమిదయింది. నళిని వద్దంటున్నా వంటచేసి అందరికీ వడ్డించింది కౌముది. ఆమె చేతివంటని మోహనరావూ, పిల్లలూ తెగమెచ్చుకున్నారు. కౌముది పిల్లలతో బాటు డ్రాయింగ్‌రూమ్‌లో పడుకుంది.

కౌముది పదిగంటలయ్యేవరకూ ఏవేవో కబుర్లు చెబుతూనే వుంది నళినితో.

నళిని "నిద్రవస్తోందే" అంటూ ఆపించి పడగ్గదిలోకి వెళ్ళి మోహనరావు పక్కన పడుకుంది.

"అయ్యాయా మీ కబుర్లు"

"అదే తెగవాగింది. నాకయితే తల నొప్పి వచ్చింది" అంది నళిని చిన్నగా.

"ఇంత సందడిచూసి ఎంతకాలం అయ్యిందో ఆ అమ్మాయి"

"సరే..నిద్రపొండి"

"నాకు నిద్రరావడంలేదు" అన్నాడు.

నళిని ఆ మాటకేం జవాబుచెప్పలేదు. కాసేపు ఆగి—

"మీరు తొందరపడ్డారు" అంది.

మోహనరావు నళినివైపు తిరిగి నవ్వుతూ — "ఏం తొందరపడ్డాను. నిన్నసలు తాకనైనాలేదుకదా! బాగానే వుంది" అన్నాడు వేళాకోళంగా.

"చాల్లెండి తెలివితేటలా అని..." భుజంమీద గిల్లింది భర్తని.

"ఇంతకీ నా పొరబాటేమిటట?"

"కౌముదిని కూడా తీసుకురావడం. కొంచెమైనా ఆలోచించారు కాదు" అనేసింది.

"అదేమిటి" అనగల్గాడు ఆశ్చర్యంతో మోహనరావు.

"ఏవిటేమిటి? అది నా స్నేహితురాలే. కానీ మేం విడిపోయి అయిదేళ్లు అయ్యింది. కష్టాలూ, ఇబ్బందులూ పడలేదనికాదు. అయితే మాత్రం దాన్ని మనింట్లో పెట్టుకుంటే చుట్టుపక్కల వాళ్ళు ఏమనుకుంటారు? పైగా మీరు ప్రయత్నించి ఉద్యోగం వేయించగలరా దానికి? అది ఎక్కడ వుంటుంది? దాని బాధ్యత మనం ఎంతవరకూ తీసుకోగలం?" అంటూ సణగడం మొదలు పెట్టింది.

మోహనరావు నిర్వీణుడై భార్య మొహంలోకి చూస్తూ వుండిపోయాడు. కొన్ని క్షణాలు అతని నోటి వెంట మాటరాలేదు. ఆపదలో చిక్కుకునే వాళ్ళని ఆదుకోవడం స్నేహితుల కనీస ధర్మం అని అతని నమ్మకం. దానికోసం వెనక జరిగే చప్పట్లు, గుసగుసలు పట్టించుకోకూడదంటాడతను. మనం చేసే పన్లని ఎప్పుడూ నూటికి నూరుమంది జనం ఆమోదించక పోవచ్చు. అలా ఆమోదిస్తారని అనుకోవటం కూడా అమాయకత్వమే అవుతుంది. ఒకళ్ళని దృష్టిలో పెట్టుకుని వాళ్ళ అభిప్రాయాల్ని మన్నిస్తూ లేక విమర్శపరంగా బేరీజు వేసుకుంటూ నడవడం అంత వెర్రితనం మరొకటి వుండదు. మనసుకు నచ్చిన పనిచేసే




ధైర్యం ఒక్కటే ప్రధానంగా మనిషికి ముఖ్యం. ఆ ధైర్యమే ఎవరినైనా ముందుకు నడిపిస్తుంది. అది లేనివాళ్లు ఈ లోకంలో ఏ త్యాగం చేయడానికైనా అనర్హులే! ఆ సమయంలో భార్యని తన ఆలోచనలనుంచి చూడగానే అతనికి నళిని మీద పుట్టెడు జాలివేసింది.

"నువ్వు ఒంట్లో బాగోలేకవున్నావ్! కానీ ఆలోచనలకేం వచ్చింది? వాటిని ఆరోగ్యవంతంగా కాపాడుకోవడం మన చేతుల్లోపని...మర్చిపోకు" అన్నాడు– చిన్నసైజు హెచ్చరికలాంటిది చేస్తూ.

"నా ఆలోచనలకేం? ఏ తిరకాసన్నా మీ బుర్రకే వచ్చింది. నాకు మీరుచేసిన పని సుతరామూ నచ్చలేదు. వున్నమాట అన్నానని మీకు కోపం వచ్చినాసరే"

మోహనరావుకి రివ్వున కోపం వచ్చింది. కానీ వివేకం ఓ మూల పని చేస్తూన్నట్టు మెదడులోంచి సంకేతాల లాంటివి విన్పించిన మూలంగానేమో కోపాన్ని ఆపుకొని–

"పిచ్చిమొహం...ఉన్నమాట అన్నాననీ, నువ్వేదో గొప్పదాన్నయిపోయాననీ ఆలోచించుకోకు. మనిషిలో ఒక్క ఫ్రాంక్‌నెస్ వుంటే సరిపోదు. ఎదటివాళ్ళని అర్థంచేసుకోగల నేర్పూ, మనం ఎదటివాళ్ళంగా మారి ఆలోచించగల వివేకం – యివి వున్నవాళ్ళకే ఫ్రాంక్‌నెస్ అందంగా వుంటుంది"

"అంటే నన్ను..."

"నీ మాట అనడంలేదు. జనం మాట చెబుతున్నాను. ఇంతకీ కౌముదికి నీ మనసులో చదువుకునే రోజుల్లో ఇచ్చిన చోటు ఏమయ్యింది? వెనకటి రోజుల్లో ఆ అమ్మాయి గురించి ఎంతగా ఆలోచించేదానివో ఒక్కసారి గుర్తుచేసుకో" నచ్చజెపుతోన్నట్టుగా అన్నాడు.

నళిని మాట్లాడలేదు.

"కానీ ఒక విషయం నువ్వు మర్చిపోకూడదు. కౌముది నీ స్నేహితురాలు. క్లాస్‌మేట్. ఆమెని నాకు నువ్వే పరిచయం చేశావ్. నేను హైదరాబాద్ వెళ్ళడానికి, అప్రయత్నంగా ఆమెని నాకూడా తీసుకురావడానికి కారణం మీ స్నేహమ్మే. దారి పొడుగునా నేను చేసిన పనిని నువ్వు తెగ మెచ్చుకుంటావనే ఊహిస్తూ వచ్చాను. పదిగంటల్లో నేనింత చిత్తుగా ఓడిపోతానని అనుకోలేదు సుమా" అన్నాడు మోహనరావు.




వారం గడిచింది. కౌముది ఆ వారం రోజులూ ఆరోగ్యంగా నవ్వుతూ, పిల్లలతో ఆడుతూ, నళినిని ఒకటికి పదిసార్లు పలకరిస్తూ, మోహనరావుని రకరకాలుగా మాట్లాడిస్తూ గడిపేసింది. ఒక విధంగా కౌముదికి ఆ కొత్త చోటులో పూనకం వచ్చినట్టుగా వుంది. ఎంతో కాలం జైల్లో గడిపి బయటకు వచ్చిన మనిషిలా ఆమె మనసు గంతులు వేస్తోంది. అందుకనే ఆమె నళినిలో కదులాడుతున్న చిన్నసైజు అయిష్టాన్నిగానీ, అసహనాన్నిగానీ గుర్తించలేకపోయింది.

మోహనరావు నళినిని అన్నమాటలు ఆ రాత్రే మర్చిపోయాడు. ఆమె ఆ

విషయాన్ని అంత తీవ్రంగా తీసుకుంటుం దనీ అతను అనుకోలేదు. పైగా భార్య తన వుద్దేశాన్ని అర్థం చేసుకోగల వివేక వంతురాలిగా అతను అంచనా వేశాడు. నిజానికి ఇలాంటి విషమ పరీక్ష అతనే నాడు ఎదుర్కోనూలేదు. ఆ అవకాశం రానూలేదు.

కానీ నళిని కౌముది తనింటికి రావడం, పైగా భర్తే ఆమెను తీసుకు రావ డంతో తన సంసార రథం అగాథంలో పడ్డట్టు ఊహించుకోసాగింది. ఆమెలోని చదువు, సంస్కారం, స్నేహం ఏవి కూడా ఆ ఆలోచనలు తప్పని నచ్చజెప్ప లేకపోయాయి. కౌముది పెళ్ళికాని ఆడదికాదు; చెడింది. ఆమెకి పెళ్ళికాదు. అంతటితో కూడా ఆమె తన ఆలోచనలకి ఫుల్‌స్టాప్ పెట్టుకోలేకపోయింది. ఇంకా దూరంగా వెళ్ళి ఊహించగానే ఆమె గుండెల్లో మంట ప్రారంభమైంది.

ఆ మంటకి ఆజ్యంపోసింది ఆ రోజు మోహనరావు చర్య...

మోహనరావు ఆఫీసునుంచి వస్తూ, "నళినీ...ఇటురా! మీ స్నేహితురాల్ని కూడా పిలు. మంచి కబురు చెబుతాను" అన్నాడు—ఫేంకుర్చీలో వాలి.

నళిని "ఏవిటా కబురు...చెప్పండి" అంటూ వచ్చి అతని పక్క కుర్చీలో చతి కిలబడింది.

"ఆమె ఏదీ?"

"బాబికీ, సునందకీ నీళ్ళు పోస్తోంది"

"ఓ కౌముదిగారూ! చాలా అర్జంటుగా రావాలి ఇటు" ఒక్క కేక పెట్టాడు మోహనరావు.

"ఏమిటా అరుపులు? అది వస్తుంది లెండి. మీరు మొదలుపెట్టండి ముందు" అంది మందలింపుగా. ఇంతలో "ఏమిటి బావగారూ విశేషం" అంటూ వచ్చి నళిని పక్కన కూర్చుంది కౌముది.

"మా కంపెనీలో ఓ ఎకౌంటెంట్ ఉద్యోగం ఖాళీ వచ్చింది. దానికి మీకున్న అర్హతలన్నీ ఖచ్చితంగా సరిపోతాయి. బ్రాంచ్ మేనేజర్ని నేను కన్విన్స్ చేసాను. రేపే మీరు డ్యూటీలో జాయిన్ కావచ్చు" అన్నాడు.

కౌముది సంతోషం పట్టలేకపోయింది ఆమెకి నోట మాటరాలేదు. క్షణం. ఆ తర్వాత తేరుకుని 'థేంక్స్' అనగల్గింది.

"నళినీ! మీ స్నేహితురాలు చాలా అదృష్టవంతురాలు. ఆమెకి కంగ్రాట్యులేషన్స్ చెప్పు. పార్టీ అడుగు. నీఇష్టం" అన్నాడు చిన్నపిల్లాడిలా తనూ ఒళ్ళు మర్చిపోతూ.

"నేనడిగేది ఏమిటిలెండి" అంది తేల్చేస్తూ.

"అవును నళినీ....నువ్వు నన్ను అడగడం ఏమిటి? మీ ఇద్దరికి ఏం చేసి నా రుణం తీర్చుకోగలను. నాన్న తర్వాత నాకు మంచి చేసిందీ, మంచి జరిగిందీ మీవల్లే"

ఆమె కళ్ళు చమర్చాయి.

"అదిగో...బాధపడకండి మళ్ళీ. మీ చరిత్రకి హైదరాబాద్‌లోనే తిలోదకాలు ఇచ్చేశారు. ఇదో కొత్త జీవితం"

"అలా అనకండి. ఇంకా ఆ ఊరితో సంబంధం పోలేదుగా" అంది కౌముది తేరుకుంటూ.

అంతటితో సంభాషణ ఆగిపోయింది.

అయితే ఆరాత్రి నళిని మోహనరావు మీద మండిపడింది.

"దానికి ఉద్యోగం మీరెందుకు చూడ్డం ఇక్కడ?"

"పోనీ నువ్వు చూస్తావా నీకు నచ్చింది"

 

"మొండి వాదనకి దిగకండి. హైదరాబాద్‌లో దానికి మంచి ఉద్యోగం ఉంది. దాని మాటప్రకారం అది ఆఫీసరు కూడా. అలాంటిది ఆ ఉద్యోగం వదిలి మీరిప్పించే సాదేతిన్ ఉద్యోగం అదెందుకు చేయాలి. దాని విషయంలో మీకెందుకింత ఇంట్రెస్ట్?"

మోహనరావు జవాబు చెప్పలేదు.

"ఏం మాట్లాడరేం"

"నువ్వు అర్థం లేకుండా మాట్లాడుతున్నావ్. అలా మాట్లాడ్డం నాకిష్టం ఉండదు. సరేనా"

"అంటే మీరు చేసేదేదో చేస్తారన్న మాట"

"నా సంగతి నాకన్నా నీకు బాగా తెలుసుండాలి"

"అలా అనే ఇంతకాలం అనుకునే దాన్ని. కానీ మీ గురించి ఈవేళ కొత్త నిజాలు తెలుస్తున్నాయి. మిమ్మల్ని నేనెందుకు పూర్తిగా అర్థంచేసుకోలేదా అని ఈవేళ బాధపడేట్టు చేస్తున్నారు"

"ఊ...."

"పదేళ్ళు కాపురం చేసికూడా నేను మీమీద ఇన్‌ఫ్లుయెన్స్ సంపాదించలేక పోయానంటే నాకు చాలా చిన్నతనంగా వుంది. మీ కంటికి నేను ఏమీ చేతకాని మనిషిలా, అన్నం పెడితే పడుండే భార్యగా కన్పించడం నా దురదృష్టం"

"ఇంకా?"

"నాకు జబ్బు చేసింది. మీలా నేను ఉషారుగా వుండలేకపోతున్నాను. ఇద్దరు పిల్లల తల్లిగా ప్రవర్తించడం నా కనీస ధర్మం అనుకున్నాను. కానీ ఇవే మీకు నామీద వ్యతిరేకభావాన్ని నాటుతాయంటే...మగవాళ్ళందరూ ఇంతేననుకునేట్టు చేశారు..." నళిని ఆగిపోయింది.

"ఆపైన...?"

"అందుకే నేను చెబుతున్నాను... కౌముదికి ఉద్యోగం వేయించారు. ఒక షరతు మీదయితే అది మీరిప్పించిన ఉద్యోగం చేసినా నాకభ్యంతరం లేదు... అది మనింట్లో వుండకూడదు. దానికి వేరే ఇల్లు చూడండి. అది దాని బతుకు ఎలా వెళ్ళదీసుకున్నా నేను అడగను. అంతే గానీ అది నా మీదా, నా ఇంటి మీదా, నా పిల్లల మీదా ప్రభావం చూపిస్తే నాకు బాధగా వుంటుంది నాకు ఇష్టంవుండదు.

"అంతేనా... ఇంకా వుందా చెప్పవల్సింది?"

"మీ గురించి. కౌముది అందం, దానిలో ఆకర్షణ మీకు మతి పోగొట్టి వుండచ్చు. కానీ ఇది నా అనుమానం అయితే ఫరవాలేదు. నిజం అయితే మటుకు నేను బతకను. నేనొక్కదాన్నే కాదు. పిల్లల్ని కూడా..."

మోహనరావుకి ఆవేశం ఆగిందికాదు. అంత ఆవేశంలోనూ అతను అన్నమాట ఒకటే-"నోరు మూస్తావా...ఇడియట్‌లా ఇంకా వాగుతావా?"

"అవును. నేను ఇడియట్‌లానే కన్పిస్తాను మరిఈవేళ"

"నువ్వన్నావు చూడు నా గురించి- ఆ మాట ఎలా వున్నా నువ్వు మాత్రం ఇడియట్‌వే. అందుకే నీకేం చెప్పదల్చుకోలేదు. చెప్పేదండగ. నోరు మూసుకుని పడుకో" అన్నాడు మరో వైపు తిరిగి.

నళిని భర్త తనతో బాగా వాదిస్తాడనీ, కౌముదిని వెనకేసుకొచ్చి మాట్లాడతాడనీ- దాంతో తను రెచ్చిపోయి భర్త నోటికి తాళం వేయచ్చుననీ ఊహించింది. తను వంద మాటలని భర్తని రెచ్చగొట్టింది కూడా అందుకే. కానీ తన వంద మాటల్నీ

పూచికపుల్లల మాదిరి వూదిపారేసి నిమ్మకు నీరెత్తినట్టు భర్త మౌనంగా వుండిపోవడంతో నళినికి దిక్కుతోచలేదు.

"పరిపక్వం చెందిన మనుషులకీ, ఉదాత్త హృదయం వున్నవాళ్ళకి ఈ రెండూలేని వాళ్ళకి తేడా ఒకటే. వాళ్లు ఘోరమైన పన్లు చేయరు. మరీ దిగజారి ప్రవర్తించరు. కానీ మామూలు మనుషులు మనసుని పంజరంలో పెట్టుకుని ఈర్ష్య ఇనుప చట్రలో పడి వువ్వెత్తుగా లేచే ఆలోచనలతో తొందరపాటు నిర్ణయాలు తీసుకుంటారు. తమ హృదయం గాయ పడగానే పదిమంది రక్తం కళ్ళజూస్తే గానీ వాళ్ళకి నిద్ర పట్టదు.

కౌముది ఉద్యోగంలో చేరడానికి నాలుగైదు రోజులు ఆలస్యం జరిగింది. సడెన్‌గా బ్రాంచి మేనేజర్ కేంప్‌కి వెళ్ళ డంతో మోహనరావు-

"మంచి రోజు చూసి ఉద్యోగంలో చేరుదువుగానిలెండి. ఈ లోపున ఎందు కయినా మంచిది హైదరాబాద్ ఉద్యో గానిక్కి రిజిగ్నేషన్ లెటర్ రాసెయ్యండి" అన్నాడు కౌముదితో.

కౌముది సరేనంది.

సరిగ్గా అదే రాత్రి మోహనరావుని రమ్మని ఢిల్లీ నుంచి బ్రాంచ్ మేనేజర్ ట్రంక్‌కాల్ చేస్తే మోహనరావు ఆదరా బాదరా ఢిల్లీ పరిగెత్తాల్సి వచ్చింది.

"నేను రెండు రోజుల్లో తిరిగి వచ్చే స్తాను నళినీ"

"ఢిల్లీ లో మీరెందుకు దిగబడతారు. కొత్తగా నాకు నచ్చజెబుతున్నారు దేనికి" అంది నళిని.

మోహనరావు ఎక్కువగా మాట్లాడ కుండా-

"కనీసం స్టేషన్‌కి వస్తావా... అదీ లేదా?''

"అవునే నళినీ! పిల్లల్ని తీసుకుని నువ్వెళ్ళు సరదాగా" అంది కౌముది ఉత్సాహంగా.

"నాకు ఓపికలేదే"

అంతే! పిల్లలిద్దరూ స్టేషన్‌కి వస్తాం అని మారాం మొదలుపెట్టారు. నళిని తనెందుకు రానన్నానా అని మనసులో గింజుకోవడం మొదలుపెట్టింది.

"ఆంటీ... మనం వెడదాం ఆంటీ" అంటూ గోల మొదలయ్యింది.

"త్వరగా తయారుకండి. మీరు...'' అంటూ మోహనరావు సూట్‌కేస్ సర్దడం మొదలుపెట్టాడు. మరో పది నిమిషాల్లో టాక్సీ పిల్చాడు. కౌముది పిల్లల్ని తయారుచేసి,

"వెళ్లొస్తాను నళినీ... పద బాబీ, పద సునందా'' అంటూ వెళ్లి టాక్సీలో కూర్చుంది.

కౌముదీ, పిల్లలూ స్టేషన్‌కి వెళ్ళ గానే నళిని ఒకత్తే ఇంట్లోవుండి ఇల్లంతా కాలుగాలిన పిల్లిలా తిరిగింది.

పిల్లల్ని ఒకటికి పదిసార్లు "నాన్నగారు ఏమన్నారు? రైలు త్వరగా బయలు దేరిందా? ఆంటీ దగ్గరే వున్నారా? దాన్ని వదిలేసి స్టాల్స్ దగ్గర బలాదూరు తిరి గారా?'' అంటూ ఆచూకీ తీసింది. పిల్లలు ఏం అర్థంకాక, తల్లికి ఏం చెప్పలేక తిక మక పడ్డారు.

"తెలివితేటలు లేవు పీనుగులకి'' అంటూ విసుక్కుంది. అయినా నళినికి మనసు తేలికపడలేదు. ఇల్లంతా తనే అయి సంతోషంగా తిరుగుతున్న కౌముది ఆమెకు మరీ దయ్యంలా కన్పించడం మొదలుపెట్టింది. ఆ రాత్రి నళిని ఒకత్తే పడుకుని కౌముదిని ఎలా వదిలించు




కోవాలా అని రకరకాలుగా ఆలోచించింది. కౌముది తనింట్లో వుండి ఉద్యోగం చేయడం-అదీ భర్తతో అదే ఆఫీసులో మసలడం ఆమెకు పక్కలో బల్లెంగా తోచింది. కౌముది వేరే కాపురం పెట్టినా పెద్దగా వచ్చే లాభం ఏమీవుండదు. అన్నిటికీ పరిష్కారం కౌముదిని శాశ్వతంగా దూరంగా నెట్టేయడమొక్కటే! అది ఎలా సాధ్యపడాలి?

కౌముదిని సూటిపోటి మాటలని బాధ పెట్టి కొంత సాధించచ్చు. కానీ దాని వల్ల తాత్కాలిక శాంతి మాత్రమే దొరుకుతుంది. అయితే ఈ చర్యవల్ల తను భర్తకీ, కౌముదికీ కూడా శత్రువవుతుంది.

నళినికి ఓ రాత్రివేళ తెగ ఆలోచించిన తర్వాత ఓ ఆలోచన వచ్చింది. అవును... కౌముదిని తను ప్రాధేయపడుతుంది. మంచిగానే నచ్చజెబుతుంది. నయాన విషం తాగించచ్చుగానీ భయాన పాలు తాగించలేం అనే సామెత వుండనే వుంది. అందుకే మర్నాడు పిల్లలు స్కూళ్ళకి వెళ్ళగా చూసి,

"కౌముదీ... ఎంతసేపు చదువుతావే ఆ పాడు నవల. ఇటురా" అంటూ కేక వేసింది.

"చాలా బావుందే నవల" అంటూ కౌముది పుస్తకంతోనే వచ్చింది.

"అలా కూర్చో"

కౌముది కూర్చుంది. "చెప్పు...ఏమిటి అలా వున్నావ్" అంది నళినినిచూసి తల మీదా, మెడమీదా చేయివేసి చూస్తూ.

"ఏంలేదే బాగానే వున్నాను" అనేసి "నీతో ఓ విషయం చెప్పాలనుకుంటున్నానే" అంది.

"చెప్పు"

"మావారి గురించి"

"ఏమిటి బావగారి గురించా"

"అవునే. నేను ఈ ఎనీమియాతో ఏడాదిబట్టి తీసుకుంటున్నాను. కొంత నాకు వంట్లో బాగోకా, ఆయన నామీద జాలిపడీ దూరంగానే వుంటూవచ్చారు. మొదట్లోనాకుఅర్థంకాలేదు.తర్వాత్తర్వాత అనుమానం వేసింది. ఆయన కొంచెం మారారే. ఆఫీసులో మరెవరో అమ్మాయి వుందిట..."

కౌముది నళినివైపు చూసి అమాయకంగా నవ్వేసి,

"చాల్లే. ఇదా నువ్వు చెప్పేది. నీకు వంట్లో బాగోక మనసుకు అలా అన్పించి వుంటుంది. అంతే"

"కాదే..నేను బాగా వాచ్ చేశాను. పరాకుగా వుంటారు. చిరాకుఎక్కువైంది"

"ఆ చిరాకు మరే కారణాన్నయినా కావచ్చు. ఆయనకు నీమీద ప్రాణం అని నువ్వే అనేదానివిగా"

"అనేదాన్ని. అయినా మగవాళ్ళని నమ్మకూడదే...ఇట్టే మారిపోతారు"

కౌముది నళినిని మరోసారి చూసింది. ఆమెకళ్ళలో కౌముదికి అమాయకత్వమే కనిపించింది.

"నళినీ! నువ్వు చదువుకున్నదానివి. అన్నీ తెలుసు. ఇది చాలా చిన్నవిషయం. దీన్ని గోరంతలు కొండంతలు చేసుకుంటే నష్టం ఎవరికో కూడా నీకు తెలుసు. ఇద్దరుపిల్లలు పుట్టి నలభయి ఏళ్ల దగ్గరకు వచ్చిన తర్వాత ఎంత తిరుగుబోతుకైనా ఇంటిధ్యాస పడుతుందంటారు"

"కాదే" నళిని గొణుక్కుంది.

"కాదూ..సరే! నువ్వేం చేస్తావు. బావగారిమీద సి. ఐ. డి. పనిచేస్తావా? అది

చెయ్యలేవు. మరయితే ఏం చెయ్యాలను కుంటున్నావు?"

నళినికి ఏం మాట్లాడాలో తోచలేదు. భర్త చెయ్యిజారి పోతూంటే నోరు మూసుకోమని సలహాఇచ్చే కౌముదిని చూస్తే ఆమెకి మరింత వెగటు కలిగింది.

"నీ మొగుడిలా చేస్తే తెలిసేది బాధ" అంది.

ప్రశ్నిస్తుందనుకోలేదు. ఏం జవాబు చెప్ప లేకపోయింది.

"జరిగిందేదో జరిగింది. పెళ్ళి మానేస్తే ఎలా?" అంది.

కౌముదికి గుండెల్లో ముంతపొగ రాజు కుంటోంది.

"మనసుని పగ్గాలేసి ఉంచలేం కదా?"

కౌముది తలవంచుకుని అలానేఅంది–

కౌముది ఓసారి నళినినిచూసి వెంటనే తేరుకుని – "లేని నా మొగుడిగురించి ఎందుకులే" అంది చిన్నగా.

"కౌముదీ! మరి పెళ్ళి మాటేమిటి" అంది కాసేపు ఆగి.

కౌముది నళిని సడెన్‌గా అలా

"నా గురించి నేనేం చెప్పనే? దురదృష్టం అంటారు చూడు–అది నన్ను వెంటాడు తూనే వస్తోంది"

"అలా అని..."

"నిజమే.కానీ ఆడదాని పెళ్ళికి ఎన్నో హంగులు కావాలి. అర్హతలు కావాలి! అవేవీ నాకులేవు.. అందుకని నన్ను నేను చవక చేసుకుని బతకలేనుగా..."





"అంటే...?"

కౌముది రామానుజంగురించి చెప్పింది; గురుమూర్తి గురించి చెప్పింది. "నన్నేం చేయమంటావ్ చెప్పు. నన్ను వాళ్ళు బతకనిచ్చేటట్టులేరు. నాకూ ఓపిక నశించి పోయింది. కోపంలో, ఆవేశంలో, ఆవేదనలో నేనేం చేస్తానో నాకే తెలియకుండా వుంది. ఎంత వివేకంవున్నా ఈ మెంటల్



టార్చర్‌ని నేను భరించలేకుండా వున్నాను. సమయానికి బావగారు రావడం, నేనిక్కడికి రావడంతో కొంత హాయిగా వుందనుకో! ఇక్కడికి వచ్చిన తర్వాత నా గురించి ఆలోచించింది ఈ వేళే! ఇంతగా నువ్వూ, మీ ఆయనా, పిల్లలూ నామీద ఇన్‌ఫ్లుయెన్స్ చేస్తారని నాకు తెలియనేలేదు నళినీ"

నళినికి మాటలు దొరకలేదు.

కౌముదిని తన ఇంటి నుంచి ఎలా తరిమెయ్యాలా అని - దానికి తగ్గ తెలివితేటల కోసం బుర్రంతా వుపయోగించి ఆలోచించింది నళిని. సరిగ్గా అదే సమయానికి నళిని దూరం చుట్టం ఒకావిడ వూడిపడింది. ఆవిడ నళినికి వరసకి పిన్ని అవుతుంది. ఆవిడ వస్తూనే నళిని ఆరోగ్యం గురించీ, మోహనరావు గురించీ వందలాది ప్రశ్నలు వేసింది. కౌముదిని కళ్ళ చివర్లనుంచి ఒకటికి పదిసార్లు చూసింది. ఆఖరిగా నోటితో అడగలేక కళ్ళతోనే "ఎవరన్నట్టు" సౌంజ్ఞ చేసింది.

"చిన్నప్పుడు కలిసి చదువుకున్నాం.

హైదరాబాద్‌లో వుంటోంది" అంది.

కౌముది తల్లిదండ్రుల గురించి, అన్నదమ్ముల గురించి, పెళ్ళి గురించి ప్రశ్నలేసి, అన్నీ విని—

"ఇంకా పెళ్ళికాలేదా ... చేసుకునే వుద్దేశం లేదా? అవలేదా?" అంది వేళా కోళంగా.

"పెళ్ళి అవలేదుగానీ చేసుకునే వుద్దేశం మాత్రం వుంది"

"ఇంకెప్పుడూ?"

"మీ చుట్టాల్లో ఎవరయినా చూడు పిన్నీ" అంది నళిని.

"మా ఇంట్లో కుర్రాళ్ళందరూ పాతిక లోపువాళ్ళేకదా" అని అంతటితో వూరుకోకుండా— "ఎన్నేళ్ళ పెళ్ళికొడుకు కావాలి ఈ మెకూ" అంది.

"మీ దగ్గర ఏ ఏళ్ళవాళ్ళు దొరుకు తారేమిటి" అంది కౌముది మామూలు గానే.

"బావుందమ్మా...వాకబు చేస్తాను" అంది నిష్టూరంగా ఆవిడ.

నళిని పిన్నిగారు ఆ మధ్యాహ్నం భోజనంచేసి తన కూడా నళినినీ, పిల్లల్నీ రమ్మనమని బలవంతం చేయసాగింది. కౌముది కూడా "వెళ్లిరావే. మళ్ళీ రేపు వచ్చేసేదేగా'' అంది.

నళినికి ఆ సమయంలో భర్త మోహన రావు గుర్తురాలేదు. పిన్నితో వెడుతూ కౌముదిని వదిలించుకుందుకు కౌముది మీద ప్రయోగించడానికి ఆమెకో చక్కటి అవకాశం దొరికింది.

వెంటనే తన గదిలోకివెళ్లి గబగబా కౌముదికి ఓ ఉత్తరం రాయడం మొదలు పెట్టింది. తను ఆ ఉత్తరం కౌముదికి గుమ్మందిగి వెళ్ళేముందు యిస్తుంది. ఆ ఉత్తరం చదువుకుని కౌముది వెంటనే...

అవును. మొహం మీద, ముఖాముఖీని చెప్పలేని మాటలు, ఎదటి మనిషిని గురించి అనగల్గిన నిష్టూరాలు, మనసులో కోపతాపాలు—అన్నీ ఉత్తరంలో చక్కగా వెళ్ళగక్కుకోవచ్చు.

సాయకాలం గుమ్మందిగి వెడుతూ నళిని కౌముది చేతిలో ఉత్తరం పెట్టి "రేపు నేను ఎప్పుడు వస్తానో...నువ్వె క్కడికయినా వెడితే ఇంటి తాళాలు మన పక్కింట్లో ఇవ్వు. వాళ్ళు మంచివాళ్ళే" అంది.

కౌముది ఉత్తరం ఆశ్చర్యంగా అందు కుని "ఈ ఉత్తరం ఎవరికి? బావగారికి పోస్ట్ చేయమంటావా?" అంది.

"ఇంకానయం. నీకే రాశాను. చదు వుకో. ఏమీ అనుకోకే. నా మనసులో మాట రాశాను. ఆపైన నీఇష్టం" అంటూ పిల్లలతో ఆటో ఎక్కి పిన్నిగారితో వెళ్ళి పోయింది.

నళిని తనకి ఎందుకు ఉత్తరం రాసిందో అర్థంకాలేదు—కౌముదికి.

వెళ్ళి వాకిట్లో సోఫాలో కూర్చుని అలాగే ఉత్తరం విప్పింది.

"కౌముదీ...

నా ఆరోగ్యం సరిగ్గా లేదనే సంగతి నీకు తెలుసు. అందుకే నీకు హైదరాబాద్ వుత్తరాలుకూడా రాసేదాన్ని కాదు. ఇక నువ్విక్కడికి సడెన్‌గా రావడం, కాదులే.. ఆయన నిన్ను ఇక్కడికి తీసుకురావడం, ఆయన నీ ఉద్యోగం గురించి ప్రయ త్నించి దాన్ని సాధించడం—యివన్నీ చాలా త్వరత్వరగా జరిగిపోయాయి. ఇవన్నీ ఎందుకు జరిగాయి, ఎలా జరిగాయని నేను ఎవర్నీ అడగదల్చుకోలేదు.

అయితే నువ్వు నా పరిస్థితిలోవుంటే నాలాగే ప్రవర్తిస్తావని ఖచ్చితంగా చెప్ప




గలను. ఇంతకన్నా తెలివిగానే అంటే నా కన్నా తెలివిగానే మాట్లాడతావేమో!

పెళ్ళి చేసుకుని పిల్లల్ని కన్నతర్వాత ఆడదాని మనసు ఇరుకవుతుంది. తనకే ఎంత చోటున్నా సరిపెట్టుకోలేదు. అలాంటిది త్యాగాలు చేయడానికి-కాదులే, తనే నష్టపోవడానికి ఎవరొప్పుకుంటారు?

నువ్వు నా చిన్నప్పటి స్నేహితురాలివి. నీగురించి నేనేమయినా చెయ్యాలి. కష్టాల్లోవున్న నిన్ను ఆదుకోవాలి. నీ కన్నీళ్ళుతుడువాలి. నీబాధని తీర్చగల్గాలి. ఇవి స్నేహితురాలిగా నా ధర్మం.

ఆలోచించు...నేను స్వతంత్రురాలిని కాను. ఇక నీ కష్టాల్లో ఆదుకుందుకు - నీవి ఆర్థికపరమైన ఇబ్బందులు కావు. సంఘపరమైనవి. ఎవరో సాంఘిక సేవకి నడుం కట్టినవాళ్ళు నీకు ఎదురయి నీ బాధలు పంచుకోవాలి. భర్త, పిల్లలు, సంసారంలో కూరుకుపోయిన నావల్ల నీకేలాభం వుండదు.

జీవితంతో రాజీపడ్డం మాత్రమే ఈ దేశంలో ఆడది చేయగలదు అనే సత్యం నాకు బాగా తెలిసొచ్చింది.

కానీ నువ్వు జీవితంతో రాజీపడివుంటే బావుండేదేమో! ఈ పోరాటంలో ఎంత నలిగిపోయావో నీకూ తెలిసేవుంటుంది. ఆ విసుగులోనే నువ్వు మావారు ఒక్క చల్లనిమాట అనేసరికి వివేకం మాట మర్చిపోయి మంచి ఉద్యోగాన్ని వదిలి వచ్చేశావ్...? ఆలోచించు. నువ్వు చేసిన పని మంచిదా? హైదరాబాద్‌లో నీ ఆఫీసులో వుండే మృగాలు హైదరాబాద్‌కే పరిమితంకాదు. వాళ్ళు ఈ బెంగుళూరు లోనూ, దేశం అంతటా వుంటారు. నీనీడకి భయపడి నువ్వు ఎంత పొరబాటు చేసిందీ అర్థమవుతోందా?...మళ్ళీ రాస్తున్నాను నా మనసులోమాట...నా భర్తని నాకు తెలియని ఆడపిల్ల వల్లో వేసుకుని నా సంసారంలో నిప్పులు పోస్తే అది వేరు విషయం. కానీ నిన్నలాంటి నిందవేసి మన స్నేహానికి మచ్చతేను. అయితే-వయసు అలాంటిది. కోరికలు సహస్రనాలుకలు వున్న ఆదిశేషువంటూరు. నా కౌముది నాకు ద్రోహంచేసిందన్న ఆలోచనే నేను భరించలేను.

ఇంతకన్నా ఏం రాయమంటావ్? ఎదురుగా నిలబడి నీతో చెప్పలేని విషయాలు కాబట్టి ఈ ఉత్తరం ద్వారా చెబుతున్నాను. నిన్ను మా ఇంట్లోనే వుంచుకుని నేను మనసులో మంటలు రేపుకుంటూ, వాటిని నీకు కన్పడనీయకుండా దాచుకుంటూ ప్రవర్తించడం నావల్లకాదే!

నీ

నళిని..."

కౌమిదికి కొన్నిక్షణాలు చుట్టూఅంతా చీకటే కన్పించింది. కళ్ళవెంట నీరుగిర్రున తిరిగింది. గుండె బరువెక్కిపోయింది.

కౌముది అంతకన్నా భయంకరమైన సంఘటనలు చూసింది. కానీ ఆమెకి ఆ బాధకీ, తనీరోజు అనుభవిస్తోన్న బాధకీ తేడా కొట్టొచ్చినట్టు కన్పడింది. లోకంలో జనాభాని మనం ఎప్పుడూ మంచివాళ్లుగా, చెడ్డవాళ్లుగా, దుర్మార్గులుగా విభజించి చూసుకుంటాం.ఎవరికివ్వవల్సిన స్థానాన్ని వాళ్ళకిస్తాం. వాళ్ళతో మన ప్రవర్తనకీ, స్నేహానికీ హద్దులుంటాయి. చెడ్డవాడు ఒకటికొట్టినా, దుర్మార్గుడు మోసంచేసినా ఆ విషయం ముందే మనకు తెలుసునన్పిస్తుంది. మనల్ని మనమే నిందించుకుని ఆటువంటివాళ్ళకి దూరంగా జరుగుతాం కానీ మంచివాళ్ళు అనుకున్నవాళ్ళు ఏమాత్రం మనకి కీడుచేసినా, స్నేహితు

లన్నవాళ్ళు వెన్నుపోటు పొడిచినా గిల గిలల్లాడిపోతాం.

కౌముదికి ఇక ఆ ఇంట్లో వుండడం ఎంత తెలివితక్కువతనమో అర్థమయింది. గబగబా పెట్టె సర్దుకుని ఇంటికి తాళం వేసి వాటిని పక్కింట్లో ఇచ్చింది.

* * *

కౌముది బెంగుళూరు నుంచి వచ్చి రెండు రోజులయ్యింది. ఆఫీసుకు మామూలుగా వెళ్ళివస్తోంది. వండుకు తింటోంది. నిద్ర పోతోంది. కానీ ఆమె ఆలోచనల్లో మార్పు వచ్చింది హైదరాబాద్ విడిచి స్నేహితురాలి దగ్గర వారం వుండిరావడంతో కౌముదికి అంతవరకూ తెలియనివి మరి కొన్ని జీవిత సత్యాలు తెలిసినట్టయ్యింది. పదేళ్ళ సర్వీసు పూర్తయ్యింది. ఆహ్వానించినవీ, ఆహ్వానించనివీ కష్టాలు, దారుణాలు జీవితంలోకి ప్రవేశించి మనిషిని ఓ వూపు వూపి వెళ్ళాయి. ఇంతకుమించి మరేదో జరుగుతుందన్న భయంకూడా లేదు. అయితే ఈ మొండిధైర్యం వరంగా పొంది తను 'కిమన్నాస్తి'గా వుండి పోవాలా? ఎందుకు?

తన భావి జీవితం ఎలా వెళ్ళాలి? వండుకుంటూ, తింటూ, జీవితాన్ని చిరాకు వేసినప్పుడు తిట్టుకుంటూ, ఉద్యోగం అనే గొడుగుకింద నిలబడి జీవితాన్ని మౌన వ్రతంగా సాగిపోనివ్వాలా? ముప్ఫయి రెండేళ్ళ జీవితాన్ని, అందులో చేదుని నెమరువేసుకుంటూ తపస్వినిలా మిగిలిన జీవితాన్ని శాపగ్రస్తురాలిగా ఈడ్చుకు రావాలా?

తల్లీ తండ్రీ ఎరుగున్న స్నేహితులు ఎవరూ కూడా ఇలాంటి అనుభవాల్ని ఎదుర్కొన్నవారు కాదు. అందుచేత ఈ పరిస్థితిలో 'ఇలాచెయ్యి' అని చెప్పగల అనుభవం ఎవరికీ లేదు. పైగా ఆత్మీయులు తప్ప మనసులోంచి చూసి మాటలాడ లేరు... మంచి సలహా ఇవ్వనూలేరు. తన కలాంటి స్నేహితులు లేరు. సరే...తను ఏకాకిగా బతకడానికి ఇష్టపడదు... అయితే ఏంచెయ్యాలి? జీవితాన్ని మరో వ్యక్తితో పంచుకోవాలి. ఆ వ్యక్తి ఎవరు? ఎలాంటివాడు అయ్యుండాలి...? అలాంటి వ్యక్తి తనకి తారసపడతాడా?

తను పెళ్ళి చేసుకోవాలి! తనూ పిల్లల్ని కని తల్లికావాలి! అందరిలాగే ఆ జీవితానుభవం తనకి ఎండమావి కాకూడదు.

అయితే రామానుజం వెక్కిరింతగా అన్నా నిజం లేకపోలేదు. తనకు పెళ్ళికూతురుగా నిలబడ్డానికి చాలా అర్హతలు లేవు— నిజమే! అందుకే ఆ అర్హతలు దృష్టిలో పెట్టుకోవడం జరగాలి. అలా అని నికృష్టమైన బానిసతనానికి తను ఒప్పుకోదు.

తనకి తెలుసు. తనని పెళ్ళి చేసుకోబోయే వ్యక్తి తననుంచి ఆశించేది ఏమిటి? అందం. కౌముదికి నవ్వొచ్చింది. వయసుకు లోబడి అందంకూడా మెరుగులు దిద్దని అలంకారంగా మాత్రం మిగిలివుంది. ఇక మిగిలింది ఉద్యోగం. ఆ ఉద్యోగం ద్వారా వస్తూన్న డబ్బు, హోదానూ...ఇది కొంత మంది దృష్టిలో ఆకర్షణకావచ్చు.

కానీ డబ్బుకి ఆశపడే వ్యక్తి డబ్బునే చూస్తాడు. డబ్బు మనిషిలో ప్రేమనే తోసిరాజనగల సత్తాకలిగి వుంటుంది. అందుకే డబ్బుకోసం ఆశపడేవాళ్ళని తను ఆశించకూడదు. తనని మనస్ఫూర్తిగా అర్థం చేసుకోవాలి.

తన బాధల్ని అర్థం చేసుకుని, తనతో జీవితం పంచుకునే నిష్కల్మష హృద





యులు దొరక్కపోతే...

కౌముది కళ్ళవెంట కన్నీరు కదిలింది.

తనదీ అనుకునే చిన్న ఇల్లు... తన రక్తం పంచుకుని పుట్టి తన జీవితంలో చూసి చూసి విసిగిపోయిన కష్టాల్ని మర్చిపోయేటట్టు చేయగల ఒక కొడుకు తనకి కావాలి. బంధువులు, స్నేహితులు, ఎవరూ చేయలేని సాహసం తన కడుపున పుట్టిన బిడ్డ పెరిగి పెద్దవాడయి తన కన్నీటిని అర్థం చేసుకుంటే అంత కంటే మరేం అవసరం వుండదు. తను ఏకాకిగా చావకూడదు.

కౌముది దీర్ఘంగా ఆలోచిస్తోంది... పిల్లలు కావాలి... చాలామంది కాదు ఒక్కరు చాలు!

పిల్లలు కలగడానికి పెళ్ళి అంత ముఖ్యమా?

పెళ్ళి కాకుండా ఆడది మాతృమూర్తి అయి— ఆ అనుభవాన్ని రుచి చూడవచ్చునే!!

కౌముది మరో రెండు రోజులు తీవ్రంగా ఆలోచించింది. ఆమెకి ఒకటే అర్థమయ్యింది. తను పెళ్ళి కావాలనుకుంటోంది. ఆ పెళ్ళిద్వారా సంతానం ఆశిస్తోంది.

తన ధ్యేయం వివాహిత కావడం. ఆ తర్వాత తల్లిగా మారడం... అంతే!

అంటే అర్థం...? కౌముదికి భయం వేసింది. నిరాశ కల్గింది. ఆపైన చిన్న నవ్వు వచ్చింది. కానీ నిజం అర్థమవుతూనేవుంది. తను సంసారం చేసేది, భార్యగా జీవించేది అతి తక్కువకాలం! ఏడాది-కాకపోతే మరో ఏడాది. అవును. ఆ తర్వాత తనదారి తనది-తనని ఆశించే వ్యక్తి దారి అతగాడిది! అంటే అర్థం కాంట్రాక్ట్ మేరేజ్. కౌముదికి ఆ మాటే మొదట భయంగా అన్పించింది. కానీ అందులో, ఆ నిర్ణయంలోవున్న వివేకం ఆమెకే ఆశ్చర్యం కల్గించాయి. అవును - తనని ఛాలామంది వెర్రిది అనొచ్చు. తెగించింది అనొచ్చు. అవకాశవాదిగా చిత్రించనూవచ్చు.

ఇదో నేకెడ్ ట్రూత్. ఇందులో తెగింపు, ఆశ్చర్యం, అసహనం వుండచ్చు. కానీ ఏవ్యక్తి అయినా తన పరిస్థితులను బట్టి నిర్ణయాలు తీసుకోవాలి గానీ ఎదుటి వాళ్ళ జీవితాన్ని అనుకరించకూడదు.

ఆమెకళ్లు గర్వంగా మెరిశాయి. ఆమె మెదడు పదునుగా, చురుకుగా ఆలోచిస్తోంది.

తనలాంటి ఆడవాళ్ళు చీకటిలోంచి కన్పించిన చిన్న వెలుగు రేఖని అందిపుచ్చుకుని జీవించగల నేర్పుని సాధిస్తారని చెప్పడమే ఈ లక్ష్యం వుద్దేశం.

కౌముదికి ఆ కొత్త ఆలోచనతో కాస్త వీరావేశం వచ్చింది. మనిషి ఆ వూపుతో కిందా మీదా కూడా అయింది. మరో రోజు అదే ఆలోచనలో ఉండిపోయింది. ఆ తర్వాత తిరిగి అనుమానాలు రాసాగాయి. తన ఈ ఆలోచన సఫలీకృతం అవుతుందా? తననీ, తన అభిప్రాయాలూ మన్నించే వ్యక్తి దొరుకుతాడా!?

పైతరగతివాళ్ళని గుర్తు చేసుకుంది. వాళ్ళకి అహంకారం వుంటుంది. దర్పం ఉంటుంది. ఇటువంటి షరతులకు ఒప్పుకోకపోవచ్చు. ఓ మెట్టు కిందకి దిగి తనకి తాళికట్టి తల్లిననే బిరుదునిచ్చి త్యాగం చేసే ఓర్పూ, తీరికా అతనికి వుండదు. అతనికి జీవితమే విలాసమయినపుడు ఆడద్మాలు గుడ్డిదీపాల్లా కన్పి

స్తాయి.

ఇక మధ్యతరగతివాడు... ఆదర్శాలు వల్లించడంలో నలిగిపోయి, మర్యాద పెనుభూతాల్ని పూజిస్తూ పైకి చూసే శక్తీ, కిందకు చూడగల యుక్తీ కూడా పోగొట్టుకుని జీవిత సమరంలో క్షత గాత్రుడయినవాడికి ఎదుటివాడి జీవితం లోకి కాలుమోపడానికి కూడా వెనకాడ తాడు. భయం వాడి బతుక్కి పర్యాయ పదం...

మరి కిందతరగతివాడు... వాడికి కట్టుబాట్లు, ఆదర్శాలు, ఆశయాలు వాటి సంగతే పట్టదు. వర్తమాన జీవి వాడు. జీవితాన్ని కిందతరగతి వాళ్ళే జీవిస్తారు.. అదే వాళ్ళలో సుగుణం. సుఖానికి పొంగిపోతారు.. దుఃఖానికి కృంగిపోతారు.. అంతేగానీ వాటి ఎనాలి సిస్‌తో విసిగిపోరు. ఎదుటి మనిషిని గుండెలోతుగా ద్వేషించడం, లేకపోతే మనస్ఫూర్తిగా ప్రేమించడమో ఏదో ఒకటే చేస్తారు. ఒక అరలో ద్వేషం, మరొక పొరలో ప్రేమ, ఒక అడుగు స్వార్థంలో, మరో అడుగు అవకాశం వైపూ వేసి తొట్రుపాటు పడరు.

కౌముది తన జీవిత భాగస్వామిని ఎన్నుకోవడంలో అలా రెండు రాత్రుళ్ళు కిందా మీదా పడుతూనే వుంది. ఆఖరికి తెల్లవారబోతూంటే ఆమె దృష్టిలోకి చటుక్కున ఓ మనిషి వచ్చాడు...!

ఆమెకి ఆకాశం అందినంత సంతోషం వేసింది.

* * *

చీకటిపడింది. పార్కులో జనం పల్చ బడ్డారు. ఒకళ్ళిద్దరు గున్నమామిడి చెట్ల కింద పడి నిద్రబోతున్నారు. పావుగంటకో బస్ వెడుతోంది. కౌముది మోకాళ్ళ మీద గెడ్డం పెట్టుకుని కూర్చుంది. లేత గులాబీరంగు ఆర్గండీ చీర కట్టుకుంది. ఆమె అప్పటికే ఎన్నో గడ్డిపరకలు తెంపి పారేసిన గుర్తుగా సగం సగం ముక్కలు గాలికి ఎగురుతున్నాయి. ఆమెకి ఎదు రుగా కొంచెం దూరంగా బాసింపీట వేసు కుని యాదగిరి కూర్చుని వున్నాడు. యాదగిరి కౌముదివైపు చూడ్డంలేదు. దూరానున్న లైట్లు, ఆకాశం మీద నక్ష త్రాలూ..వాటినే చూస్తున్నాడు.

కౌముది అంది-

"యాదగిరీ.... అంతా విన్నావుగా! చెప్పు...ఇందులో నేను అనుకునేదేం లేదు"

యాదగిరి మాట్లాడలేదు.

"నే చెప్పింది నీకు అర్థం అయిందో లేదో! నా బతుకు గురించి నీకంతా తెలుసు. నీ దగ్గర దాచేదేంలేదు. అంతా చెప్పాను. నువ్వడగొచ్చు-నన్నే ఎందుకు ఎన్నుకున్నావని. నేను నీకు చిన్నప్పటి నుంచీ తెలుసు. నువ్వూ నాకు తెలుసు. అందుకే నోరు విడిచి నిన్ను అడిగింది. ముక్కూ మొహం తెలియని మనిషికి జీవితం అర్పించడం జరగదేమో! పైగా మనిషి నైజంకూడా తెలియాలి, నెల రోజులు నాతో సంసారంచేసి పారిపోయా డనుకో. అప్పుడు నేనేమయిపోతాను? అతని గురించి వెదక లేనుగా"

"నా భార్య జబ్బుమనిషి. ఆమె ఈ మాట వింటే ఏమవుతుందో అని ఆలో చిస్తున్నా"

కౌముదే తిరిగి అంది- "యాదగిరీ! నీ ఇబ్బందులూ, కష్టాలూ ఏమిటో కొంత వరకే నేను ఊహించగలను. నీ దృష్టితో చూడ్డం నావల్లకాదుగా! కానీ అవన్నీ నువ్వు ఆలోచించు. నాల్గురోజులయినా




ఫరవాలేదు. అప్పుడే జవాబు చెప్పు"

యాదగిరి బుర్రవూపాడు.

"మరి నే వెడతాను"

"ఉండు. ఇంటిదాకా వచ్చి విడిచి వేస్తా" అన్నాడు.

"ఫరవాలేదు. ఆటోలో వెడతాను"

''వద్దు. ఒక్కత్తివీ పోవద్దు" యాదగిరి లేచాడు.

ఇద్దరూ లేచి కొంతదూరం నడిచిన తర్వాత ఆటో దొరికింది.

కౌముది ఆటో ఎక్కి "రా" అంది. యాదగిరి సంశయిస్తూ అటుపక్కగా ఆటో ఎక్కి కౌముదికి తగలకుండా కూర్చున్నాడు. ఆటోడ్రైవరు కౌముది వైపూ,యాదగిరివైపూ రెండుమూడుసార్లు చూశాడు.

"ఎక్కడికి పోవాలా?"

కౌముది చెప్పింది.

యాదగిరి రాడ్ పట్టుకుని వీధివైపు చూస్తూకూర్చున్నాడు.అతనికి కౌముదితో ఆటోలో వెళ్ళడం కొత్తగా వుంది. చెప్ప లేని అనుభవంతో ఒళ్ళు వూగిపోతోన్న ట్టయ్యింది. కుడి చెయ్యి సీటుమీద పెట్టు కుంటే కౌముది పమిట కొంగు తగిలి పాముమీద చెయ్యివేసినట్టు చేతిని తీసేసు కున్నాడు. అతనికి అది ఆనందమో, కొత్తో, భయమో అర్థం కావడంలేదు. అటు వంటి సమయాల్లో అతను మామూలుగా అయితే చప్పున జేబులో చెయ్యిపెట్టి బీడీకట్టతీసి ఓ బీడీ వెలిగించుకునేవాడే! పక్కన కౌముది వుండడంతో అతనికి బీడీ తాగడం నామర్దాగా అన్పించింది. వుగ్గబెట్టుకుని అలాగే వుండిపోయాడు.

జీరా వచ్చిన తర్వాత కౌముది ఆటో డ్రైవర్‌కి తన ఇంటి గుర్తులు చెప్పింది. ఆటో ఆగగానే కౌముది ముందు దిగి డబ్బులు ఇచ్చింది. ఆ తర్వాత యాదగిరి దిగాడు.

"నువ్వుపో...నేవెడతా" అన్నాడు.

"సరే" అని కౌముది ఇంటి గుమ్మం వైపు నడిచింది.

బస్‌స్టాప్‌లో నుంచున్న యాదగిరికిపదే పదే కౌముది గుర్తుకువస్తోంది. కౌముదిని ఈమధ్య రోజూ చూస్తున్నాడు. ఆమె అందం అతనికి తెలియందికాదు. ఆమెను చూసినప్పుడల్లా అతనికి స్కూల్‌రోజుల్లో కౌముది గుర్తుకు వచ్చేది. పదిహేనేళ్ళ వయసులో కౌముది అనే పెద్దింటి అమ్మా యిని భుజంమీద చెయ్యివేసి ఎడంచేతో దగ్గరకు తీసుకుని, ఆపుకోలేని ఆవేశంలో కౌగలించుకోవడం...యాదగిరికి ఆనాటి తన చేష్ట చాలా రోజులు గుర్తుకువస్తూనే వుండేది. కౌముదికీ-తనకీ మధ్య ఆర్థిక పరంగా, అంతస్తుపరంగా, కులంపరంగా ఏవిధంగా చూసినా దూరంవుంది.

కౌముదిని చూసినప్పుడు ఈ అమ్మాయి నాది అనే వింత అనుభవం లాంటిది కలగడం అతనికే కొత్తగా వుండేది. ఇంటికి వచ్చి తనని తనే ఎన్నో సార్లు మందలించుకున్న రోజులు కూడా వుండేవి. అతను స్కూల్‌నుంచి సర్టి ఫికెట్లు ఇచ్చి పంపేసిన రోజుకూడా తను చేసిన పనికి పశ్చాత్తాపపడలేదు. ఓ ఆడ పిల్లని అల్లరిచేసినందుకు స్నేహితులు వేళాకోళంచేసినా అతనికి తన మనసుకు నచ్చిన పనే చేసినట్టుగా అన్పించేది. తండ్రి మొహం వాచేటట్టు చీవాట్లు పెట్టి జుట్టుపట్టుకుని గుంజి రెండు లెంపకాయలు కొట్టినా బాధనిపించలేదు.

నాలుగయిదు ఏళ్ల-అదీ పెళ్ళయే వరకూ కౌముది అప్పుడప్పుడు గుర్తుకు వచ్చి తనలో తను నవ్వుకునేవాడు.



ఆకాశంవైపు చూసి ఏ నక్షత్రాన్ని అది తన స్వంతం అనుకున్నా నక్షత్రానికే నష్టం వుండదు. యాదగిరికి కౌముది ఆకాశంలో నక్షత్రంలానేతోచేది. ఆర్నెల్లకో, ఏడాదికో ఒకటి రెండుసార్లు యాదగిరికి కౌముది కన్పించేది ఏ బజారులోనో!

కానీ యాదగిరి అంతదూరంలోనే కౌముదిని చూసి తలపంచుకుని ఆలోచనల నారంభించాక యాదగిరికి లోకం కొత్తగా కన్పించేది.

జీవితం గురించిన కొన్ని చిక్కు ప్రశ్నలకు కాంతారావు విడమర్చి అర్థం చెప్పడం, వాఖ్యానం చేయడం యాదగిరికి నచ్చేది. ఇరవై ఏళ్లు వచ్చిన తర్వాత గానీ లోకంలో అందరూ అనుకునే కర్మలకు మనుష్యులే బాధ్యత పట్టాలనీ, అంతే



నుంచే చూసేవాడు. గుండె గొంతుకులోకి వచ్చినట్టు అయ్యేది. తరువాత పెళ్ళయింది. భార్య నాగమ్మతో జీవితం పంచుకోవడం సరిపోయింది. ఈలోపునే కాంతారావుగారి పరిచయంతో కొత్త అనుభవం..

కాంతారావుగారిచ్చిన పుస్తకాలు చదవ





గానీ ఏ దేవుడూ బాధ్యత వహించి ముందుకు రాడనీ అతనికి కొద్ది కొద్దిగా అర్థమవుతూ వచ్చింది.

బస్ రావడంతో యాదగిరి పరుగున వెళ్ళి బస్‌లో పడ్డాడు. కిటికీ పక్కన కూర్చున్నాడు. అటూ ఇటూ చూసి బీడీ వెలిగించుకున్నాడు.

కూకట్‌పల్లి వచ్చింది. బస్‌స్టేజ్‌లో దిగి

పంచాయితీ స్కూల్ పక్కనుంచి నడవడం మొదలు పెట్టాడు. దూరంగా పెంకుటిల్లు కన్పిస్తూనే వుంది. గుమ్మంలో చుక్కలా కూర్చున్న నాగమ్మ కన్పిస్తూనే వుంది...

ఆపరేషన్ అయి రెండు నెలలయ్యింది. మనిషి పాలిపోయి, రక్తం తగ్గి పింగాణీ బొమ్మలా తయారయ్యింది.

"నాకాకలిగాలే...నువ్వు తిను"

"నువ్వు తినకుండా నేతిన్న"

యాదగిరికి నాగమ్మని చూస్తే జాలి వేసింది.

"నీ పక్కనే కూర్చుంటాగా...నువ్వు తిను" అన్నాడు తల నిమిరి.

"సరేలే" అని నాగమ్మ భోజనం మొదలు పెట్టింది. యాదగిరి పట్టెమంచం

"ఇప్పుడు ఇల్లు కనిపించిందా? ఒక్క దాన్ని ఇంటిలో కూర్చోలేక నెత్తి నొస్తోంది''

"ఇంకా ఎనిమిది కాలే. ఎందుకు భయం" అన్నాడు యాదగిరి.

ఆ తర్వాత దొడ్లోకివెళ్ళి కాళ్లూ, మొహం కడుక్కొని లోపలికి వచ్చాడు.

"బువ్వ తిందామా?"

మీద పడుకున్నాడు. అరగంట గడిచింది.

"మందులు తెచ్చినావ్?" అడిగింది నాగమ్మ.

"పైసలు దొరకలా"

"మందులయిపోయి రెండు దినాలయింది"

"ఏం చేయమంటావ్?"

"ఏంచేయమంటాను. నన్ను చంపుకు తిను. గంతే"

"వెయ్యిరూపాయలు అప్పుచేసినా... చీటి పాడేసినా"

"గయితే ఏమంటవ్?"

"మీ నాయనకి ఉత్తరం రాయి"

"మా నాయనకా! ఇందాకా రెండువేలు ఖర్చుచేసిండు నాకు సిగ్గుపోతుంది"

"నీతో నాకు దమాక్ చెడిపోతుంది"

నాగమ్మ ఏడుపు మొదలుపెట్టింది. అది ఏడుపుకాదు...చిన్న సైజు మూలుగు.. దానితోపాటు వచ్చిన ఎక్కిళ్ళు.

"నోరు మూసుకో" అని యాదగిరి లేచి దణ్ణెంమీద లుంగీ విసుగ్గా లాగి కట్టుకుని వీధిలోపడి జేబులు చూసు కున్నాడు. ఐదురూపాయలనోటు చేతికి తగిలింది. పక్కనేవున్న సారాదుకాణం లోకి వెళ్ళి ఓ దుబారా, మరో కల్లుసీసా కొనుక్కొని అక్కడే తాగేసి పాయలు కొనుక్కొని తిన్నాడు.

యాదగిరి సారా రెండు మూడు గుక్కల్లో తాగేస్తాడు. అది అతని అల వాటు. తాగినప్పుడు జనంమధ్య కూర్చుని వాగడం అతనికి ఎందుకో నచ్చదు. తాగడమే తప్పయినప్పుడు రోడ్ల మీదపడి వాగడం అతగాడికి అసలే కిట్టదు. నిషా రాకముందే ఇంటికి చేరతాడు. నాగమ్మ తిట్టినా, విసుక్కున్నా అతనికి పరువు నష్టం అన్పించదు. త్వరత్వరగా ఇంటి వేపు నడక మొదలుపెట్టాడు.

యాదగిరికి అప్పుడు తను తాగు తాడనీ తనుకిందతరగతి వాడిననీ, తన ప్రవర్తనకీ – కౌముది జీవనవిధానానికీ మధ్య ఎంతోదూరం వుందనీ గుర్తురాలేదు.

బోగన్‌విల్లా గుబురు పక్కన కూర్చుని జాలిగా తనవేపుచూస్తూ, కన్నీరు పెట్టు కుంటూ, తనలో తనుగా మాట్లాడు కుంటున్నట్టుగా చెప్పినతీరు అతని మనసు మీద ముద్రలు వేస్తోంది.

ఒక్క ఏడాదిపాటు కౌముదితో క్రొత్త జీవితం!

భార్య అస్వస్థత, ఆర్థికపరిస్థితులు, తను పోషించవల్సిన చెల్లెళ్ళు, తమ్ముళ్ళు అందరూ గుర్తుకువచ్చారు.

అంతలో అటుగా వెడుతూ "యాద గిరీ" అంటూ పలకరించిన కాంతారావుని చూసి యాదగిరి అరుగుమీదనుంచి లేచి,

"నమస్తే సారూ" అన్నాడు.

"ఏంచేస్తున్నావు ఒక్కడివీ?"

"ఏం లేదు సారూ"

"రేపు కూకట్‌పల్లిలో మన మీటింగ్ జరుగుతుంది. తెలుసా?"

యాదగిరి క్షణం ఆగి–"మీతో మాట్లా డాలి సార్" అన్నాడు.

"నాతోనా...ఏమిటిట?"

"అస్తా వుండుసార్" అంటూ లోప లికి చూసి – "నే సెంటర్‌కి పోయివస్తా. తలుపేసుకో"

ఇద్దరూ నడక సాగించారు. కొంత దూరం వెళ్ళిన తర్వాత పక్కనేవున్న బండరాయి మీద కూర్చున్నారు.

"ఏమిటి ఏదో మాట్లాడాలన్నావ్?"

యాదగిరి ఓసారి కాంతారావు కళ్ళ లోకి చూసి తలదించుకుని–

"నేను మల్లా పెళ్ళిచేసుకుందామని అనుకుంటున్నా" అన్నాడు.

కాంతారావు పరకాయించి యాదగిరిని చూశాడు.

"ఏమయింది నీకు ? బుర్ర తిరుగు తోందా?"

"సత్యం సారూ"




"అంటే''

"చెబితే సిగ్గుపోతుంది'' అంటూ మొదలుపెట్టి కౌముదితో తన చిన్ననాటి పరిచయం, ఆ తర్వాత తను గవర్న్మెంటు ఉద్యోగంలో జేరటం, తిరిగి కౌముదిని చూడ్డం, కౌముదిని ఏ పరిస్థితిలో రక్షించిందీ, కౌముది తనని పార్కులో పెళ్లిచేసుకుందామని అడగడం—అన్నీ చెప్పాడు. ఆఖర్ని అన్నాడు -"ఆమెని చూసి నే కాదనలేకపోయినా''

"అరెరే''

"ఇప్పుడు చెప్పు సారూ! ఆమె కళ్ళనీళ్ళు తెచ్చుకుంది. బాధపడింది. సరేనన్నా''

"చాలా వింతగా వుందే ఇది''

"ఆమెతో నేను నీ సంగతి కూడా చెప్పినా"

"ఏమని?"

"మా సారు గురువుగారని..."

కాంతారావు నవ్వేసాడు. "ఇంతకీ నీ సంసారం మాటేమిటి? మీ నాయనకీ, అమ్మకీ తెలిసిందనుకో ఏమవుతుందీ? నీ భార్యకి అసలే వంట్లో బాగోలేదు. ఇలా చేస్తున్నావని తెలిస్తే.."

"అవ్‌సార్! ఆమె నాల్గయిదు దినాల్లో వాళ్ల అమ్మకాడకి పోతుంది. ఓ సంవత్సరం ఆ వూరినే వుంటుంది. ఆమెకి జబ్బు తగ్గి వచ్చేటప్పటికి..." యాదగిరి ఆగిపోయాడు.

కాంతారావు రకరకాలుగా ఆలోచిస్తున్నాడు. కౌముదినీ, యాదగిరినీ పక్కపక్కన నిలబెట్టి వూహిస్తున్నాడు.

యాదగిరి చెప్పిన కౌముది పరిస్థితులు అతనికి చాలా అలజడి కల్గించాయి. చాలాసేపు కౌముదినే వూహిస్తూ వుండిపోయాడు. ఆమె తీసుకున్న నిర్ణయంలో అతనికి ఆవేశంపాలు ఎక్కువ కన్పించకపోయినా వేదన శాతం ఎక్కువ వుందనిపించింది. అందుకు కారణం ఆమె కోరుకుంటోన్న కాంట్రాక్ట్ మేరేజ్ పద్ధతి! ఏడాది తనతో జీవించిన వ్యక్తిని భర్తగా ప్రేమించడం, కలిసి వుండడం చేసి ఆ మర్నాటి నుంచి ఆ బంధాలన్నీ తెంచుకుని ఏకాకిగా బతకాలని ఆమె తీసుకున్న నిర్ణయంలో ఔచిత్యం అతనికి కన్పించలేదు.

"యాదగిరి! ఆవిడగారికీ, నీకూ మధ్య వున్న దూరం సంగతి బాగా ఆలోచించావా?"

"అంటే నేను పేదోణ్ణని అంటున్నవ్.. అంతేగద?''

కాంతారావు నచ్చజెప్పే ధోరణిలో అన్నాడు—

"అదికాదు. నువ్వు ఇరవై ఏళ్ళ వయసులో వుండి పైతరగతి అమ్మాయిని ప్రేమించావనుకో, అలాగే ఆ అమ్మాయీ నిన్ను కోరుకుందనుకో- అప్పుడు మీరు పెళ్ళి చేసుకోవడానికి మీ మధ్య వున్న వర్గ విభేదం ఒకటే ఆటంకం అవుతుంది. కానీ మీరు ప్రేమికులు అయినమూలంగా, ఆ అనుభూతి మీ మనసునిండా ప్రకాశిస్తోన్న మూలంగా మీకు తెలియకుండానే మీరు ఈ వర్గ విభేదాన్ని తోసిరాజనే శక్తి మీకు వస్తుంది. ఆ శక్తే మిమ్మల్ని విడిపోకుండా కాపాడుతుంది. కానీ ఇక్కడ అట్లా కాదే! ఆవిడ మీద నీకు ఏనాటిదో చిన్న కాంక్ష మిగిలివుంది. అది కాంక్ష అవచ్చు, ఆవేశం అవచ్చు, తాత్కాలిక మోహం కావచ్చు. ఇక ఆవిడ నిన్ను ఆనాడూ ప్రేమించలేదు... ఈ వేళా ప్రేమించడం లేదు. కానీ నిన్ను భర్తగా కోరుకుంటోంది. ఆవిడ ఈపని



మనస్ఫూర్తిగా చేయగల్గాలి. అలా కాని రోజు ఏడాది కాదు, ఒక్కరోజు కూడా మీరు సంసారం చెయ్యలేరు''

''అంటే ఏమవుతుందంటావ్...?''

''అవన్నీ ఎందుకులే గానీ.. నువ్వు గవర్నమెంట్ ఉద్యోగం చేస్తున్నావ్ కదా? నీ ఉద్యోగానికి ప్రమాదమేమరి...''

''మేం అనుకున్నది గుళ్లో పెళ్ళి''

కాంతారావు నవ్వేశాడు. ''నిజమేలే... ఈ దేశంలో ఎవడి సాక్ష్యమయినా పని చేస్తుంది- ఒక్క దేవుడిది తప్ప. అయినా పాపం దేవుడి సాక్ష్యానికి వీసమెత్తువిలువ లేదు''

యాదగిరి అదోలా అన్నాడు- ''అయినా సారూ...ఎవరైనా సరే రెండో పెళ్లి ఎందుకు చేసుకోకూడదు? ఈ చట్టం ఎవరూ పట్టించుకుంటూలేరు. అలాంటప్పుడు కొంత మందిని శిక్షించడం ఎందుకు? నాకు బాగా ఎరుక-మావూళ్ళో, మా కులంలో ప్రతీ మనిషి ఇద్దరు ముగ్గుర్ని చేసుకున్నోళ్ళే''

కాంతారావు నచ్చజెబుతూ అన్నాడు- ''యాదగిరీ! ప్రభుత్వం మాట వదిలేయి. చట్టం సంగతి మర్చిపో. కానీ ఓ సంసారం సాఫీగా, ఏ కలతలూ లేకుండా వుండాలంటే, భార్యాభర్తల మధ్య అనురాగానికి తప్ప ఆవేదనకి చోటులేకుండా వుండాలంటే ఇద్దరి మధ్య సహకారం అవసరం. నలుగుర్ని పెళ్లి చేసుకున్న వ్యక్తి ఏ ఒక్కరికీ న్యాయం చేయలేడు.. అతనివల్ల నలుగురూ సుఖపడలేరు. పైగా వాళ్ళమధ్య విభేదాలు, పోట్లాటలు పెరుగుతాయి. ఆర్థికంగా వెనకబడ్డతనం ఈ విభేదాలమూలంగా మరింత స్ఫుటంగా తలెత్తుతుంది. కలతలూ, ఘర్షణలూ మొదలవుతాయి. ఒక విషయం మనం మర్చిపోకూడదు. వ్యక్తుల కలయిక సమాజాభివృద్ధికి దోహదం చేయాలిగానీ, సమాజాన్ని ముక్కలు చేయడానికి అవకాశం ఇవ్వకూడదు...''

''ఏమో సారూ... ఇదేం నాకు మంచిగలేదు''

కాంతారావు వాచీ చూసుకుని- ''పదయింది. లేద్దాం పద'' అన్నాడు.

యాదగిరి లేచాడు. ఇద్దరూ మౌనంగా వూరి వైపు నడక మొదలు పెట్టారు. యాదగిరి నాలుగడుగులు వేసి- ''మా పెళ్లి రేపు ఆదివారమే సారూ..''

''ఇంతత్వరలోనా? అరే... అయితే చాలా ఆలస్యంగా చెప్పావన్నమాట నాకు''

"అవ్... మీరు పెళ్లికి తప్పక రావాల సారూ"

"నువ్వొక్కడివే పిలుస్తున్నావ్...?" యాదగిరి నవ్వేసాడు.




యాదగిరి గుట్టమీద కౌముది,యాదగిరిల వివాహం జరిగింది.

సాయంకాలానికి హైదరాబాద్‌కి తిరిగి వచ్చారు. కోటి వచ్చిన తర్వాత కాంతారావు అన్నాడు-

"ఇక్కడో ఫొటో స్టూడియోవుంది. మీరు ఫొటోలు తీయించుకోండి" అని.

కౌముది సరేనంది. పావు గంటలో

ఫొటో తీయించుకోవడం పూర్తయ్యింది.

ముగ్గురూ టాక్సీలో జీరావెళ్ళారు.

కౌముది ఇంటితాళం తీసి కాంతారావుకీ, యాదగిరికీ కుర్చీలు చూపించి లోపలికి వెళ్ళింది.

"ఇప్పుడేం చేయద్దమ్మా"

"వట్టి కాఫీ మాత్రమేలెండి!"

పదినిముషాల్లో కౌముది మూడు కాఫీలు కలిపి తెచ్చింది. తను మరో కుర్చీలో కూర్చుంది.

కాంతారావు కాఫీ తాగేసి కౌముదిని చూసి అన్నాడు—

"చూడమ్మా! నాకు యాదగిరి నాలుగైదు సంవత్సరాలుగా తెలుసు. చాలా బుద్ధిమంతుడు. ఈ పెళ్ళి అతనికీ, నీకూ కూడా సమస్యలు సృష్టిస్తుంది. రేపు మీ ఆఫీసులో ఈ నిజం తెలుస్తుంది. చాలామంది ఆశ్చర్యపోతారు. నవ్వుతారు. కృంగిపోకూడదు తెలుసా?"

కౌముది తల వూపింది.

"యాదగిరీ!నువ్వీరోజుచాలాసాహసం చేసావ్. నీ కష్టాలూ ఇబ్బందుల మాట మర్చిపోయి కష్టాల్లోవున్న ఈమెని ఆదుకుందుకు ముందుకు దూకావ్. లోకంలో మనుషులు రకరకాల త్యాగాలు చేస్తారు. ఏ త్యాగమైనా ఎదురయ్యే పరిస్థితుల్ని బట్టివుంటుంది. కానీ నువ్వు చేసింది త్యాగంకాదు. ఓ మనిషిని బతికిస్తానని ముందుకు వచ్చావ్. ఇది చాలామంది చేయడానికి భయపడేది! కొద్ది రోజులు నీకు కత్తిమీద సాము తప్పదు. అధైర్య పడకు. వెనకంజవేయకు. తెలిసిందా?"

యాదగిరి ఆ పొగడ్తలతో సిగ్గుపడి "నా విషయం మీకు తెలుసుగా సారూ" అన్నాడు.

"మరి నేవెడతాను"

కౌముదీ, యాదగిరి గుమ్మంవరకూ వెళ్ళి కాంతారావుకు వీడ్కోలు చెప్పారు.

కౌముది అంతవరకూ యాదగిరితో ఎక్కువగా మాట్లాడలేదు. కళ్ళెత్తి ఓక్షణం యాదగిరిని చూసింది. మధుపర్కం కట్టుకుని పైన తెల్ల లాల్చీ వేసుకున్నాడు. నుదుట కనుబొమల మధ్య కుంకుమ బొట్టు. వ్యాయామం చేసిన మూలంగా కండలు తిరిగిన భుజాలు, బలమైనచేతులు.

యాదగిరి కూడా క్రీగంట కౌముదిని చూశాడు. ఎవరూలేరు. ఒక్కసారి కౌగలించుకుని...ఒక్క....అతని ఆవేశం అంతలోనే చల్లారింది. కౌముది ఏమన్నా అనుకుంటే?..భార్య అనే 'మొరటుతనం' అనే మాట అతనికి నవ్వు తెప్పిస్తుంది.

"స్టౌవ్ మీద అన్నం పడేసి వస్తాను. గదిలోకి వెళ్ళి బట్టలు మార్చుకో. ఈ ఇల్లు మనదే"

యాదగిరికి మాటలు చెవుల్ని తాకుతున్నాయి...నాగమ్మ అంటుంది, "నువ్వు స్నానంచేసిరా. నేను బువ్వ వండేస్తాను. అదిగో తువ్వాలు. కనబడ్డంలా...నీకళ్ళు నెత్తి మీదకి పోతున్నాయ్"

"నా భార్య నన్ను 'నువ్వు'అంటుంది. అది మా ఇళ్ళల్లో తప్పేంకాదు. నువ్వు కూడా అలానే పిలువు. ఏమనుకోను"

కౌముది నవ్వేసి లోపలికి వెళ్ళింది.

యాదగిరి ఫేం కుర్చీలో కూలబడి అచేతనంగా బీడీ అంటించుకుని కాళ్ళు రెండూ కుర్చీలో పెట్టుకుని కళ్ళు మూసుకున్నాడు. అతనికి తలదిమ్ముగా వుంది. జేబులు చూసుకున్నాడు. మర్నాడు భార్య ప్రయాణానికి ఖర్చు పెట్టాలి. ఆ తర్వాత ఏంచేయాలి? కొత్త పెళ్ళాన్ని సంతోష పెట్టడం. యాదగిరికి భయంవేసింది. వెంటనే భార్యతో బజారుకు వెళ్ళడం,



భార్యకి నచ్చిన వస్తువులు వెనకా ముందూ చూడకుండా కొనడం—యివన్నీ గుర్తుకొచ్చాయి. అలా తను చేయగలడా? చేయలేక పోతే... తనకొచ్చే ఐదొందలు జీతం ఆ లెఖ్ఖన ఎన్ని రోజులు వస్తుంది? కౌముది కట్టేచీరే రెండువందలు చేయచ్చు. ఆలెఖ్ఖన తన జీతం ఒకటి రెండు రోజులు సరి పోవచ్చు.

కౌముది లోపలినుంచి వచ్చి "స్నానానికి నీళ్లు తయారుగా వున్నాయి...." అంటూ పెట్టెతెరిచి తువ్వాలు చేతికిచ్చింది. యాదగిరి కౌముది వెనకే లేచాడు.

యాదగిరి స్నానం చేసి తను తెచ్చుకున్న హేండ్‌బేగ్ తెరిచి లుంగీ తీసుకున్నాడు.

కౌముది అన్నం దింపి వేపుడుచేసింది. ౹కితం రోజు పెరుగు.

యాదగిరికి తను తింటూ పెళ్ళానికి ముద్దచేసి తినిపించడం అలవాటు. భోజనం దగ్గర అతను ఏ చీదరనీ, బాధనీ గుర్తుచేసుకోడు. యాదగిరి లేచి రూమ్ లోకి వెళ్ళాడు. సిగరెట్ వెలిగించుకున్నాడు. పైన సీలింగ్ ఫాన్ తిరుగుతోంది.

వంటింట్లో గిన్నెలు సర్దుతున్న చప్పుడు. వంటిల్లు వూడుస్తున్న చీపురు ధ్వని....

పావు గంట తర్వాత కౌముది బెడ్ రూమ్‌లోకి వెళ్ళడం యాదగిరి చూశాడు. అతను నిమిషాలు లెఖ్ఖపెడుతూ కూర్చున్నాడు. ఓ నిమిషం తర్వాత గదిలోంచి అగరవత్తుల సువాసన డ్రాయింగ్ రూమ్ లోకి వచ్చి యాదగిరిని తాకింది.

కోరిక ఒక్కొక్క నాలికా జాచుకుంటోంది. ఆవేశం ఒక్కొక్కమెట్టూ ఎక్కి ఆలోచనల శిఖరాగ్రాన్ని చేరి ఆనందంతో కిందా మీదా అవుతోంది! ఏదో చెయ్యాలని, మరేదోకావాలని, ఇంకేదో జరగబోతోందన్న సంకేతాలతో శరీరం సంగీత సాగరం అవుతోంది.

యాదగిరికి పడగ్గదిలో లైటు ఆర్పిన చప్పుడు విన్పించింది. కౌముది నిద్రపోతోందా. గది బయటకువచ్చి తనని ఆహ్వానించడంలాంటిది చేయకపోయినా—యాదగిరికి అరక్షణం కర్తవ్యం బోధపడ లేదు. మరుక్షణంలో తన మొదటిరాత్రి గుర్తొచ్చింది. ఆరోజు తన ఆవేశం పెద్ద అలగా మారి అతన్నో వూపు వూపినట్టయ్యింది తిరిగి.

"లోపల పక్కవేశాను" అన్నచిన్న మాటలు మరింత చిన్నగా మారి యాదగిరిని తాకాయి.

యాదగిరి బనీను విప్పి సోఫాలో పడేసి ఓసారి తలకింద రెండు చేతులూ పెట్టుకుని, ఆ రెండు చేతులూ పైకెత్తి చిన్న తరహా విన్యాసం లాంటిది చేసి గదిలోకి వెళ్ళాడు. గదంతాచీకటి...లీలగా ఆ చీకట్లో మంచం, ఆ మంచంమీద తెల్లచీర తెరవెనక నిద్రపోతోన్నట్టుగా కౌముది!

యాదగిరి మంచం మీద కూర్చుని ఓ చేత్తో దిండు సరిజేసుకుని – "నిద్రపోతున్నావ్" అన్నాడు.

"కాదు..."

"మరి..."

కౌముది మాట్లాడలేదు.

యాదగిరి కౌముది వెపు తిరిగి చేయి కౌముది మీదవేసి ఆ చేత్తోనే కౌముదిని తనవైపు తిప్పుకున్నాడు. మరబొమ్మలా తిరిగిన కౌముదిని అతను గుండెల్లో అదుముకున్నాడు. ఆమె తలలో పెట్టి

కున్న మల్లెలూ, దవనం కలిపిన దండ సువాసనలు వెదజల్లింది. చేత్తో కౌముది తల నిమిరి, బుగ్గల మీద ముద్దు పెట్టుకుని అవలీలగా కౌముదిని తన గుండెల మీదకు చిన్నపిల్లలా చేర్చుకున్నాడు...!

కౌముదిలో అప్పుడు సంతోషం, దుఃఖం రెండూ కలిగాయి. సంవత్సరాల తరబడి కరుడు కట్టిన దుఃఖం ఆఖరిసారి పొంగి గట్లుతెంచుకుని బయటపడి అదృశ్యమయ్యే తరుణం అది! అలాగే దుఃఖం వడిలో నలిగి కృశించి, చివికి పోయిన సంతోషం స్వేచ్ఛని పొంది రెక్కలు విదుల్చుకుని విహగంమయి శరీరం లోపల అణువణువునీ సృజించి ఆనందం విత్తులు నాటే ప్రయత్నం అది!

యాదగిరి చేతికి కౌముది కన్నీరు తగిలింది. అతనికి అర్థంకాలేదు.

"ఏంది... ఎందుకేడుస్తున్నవ్?"

"లేదు...లేదు"

"ఇలా జరిగిందని బాధగవుందా నీకు...?"

"అదికాదు..."

"అవ్ మరి. ఎవడో మంచిగ చదువుకున్నాడు, పైసలున్నోడు భర్తగా రావల్సింది పోయి, చదువు రానాడు భర్తగా రావడం..."

"అదికాదు..."

"ఇంకేంటది?"

"నాకు చెప్పడం చేతకావడంలేదు... నీ ఋణం ఎలా తీర్చుకుంటానో అర్థం కావడంలేదు"

"ఋణమా...?" అన్నాడు నవ్వేసి. తిరిగి కాసేపు ఆగి—

"నువ్వంటే నాకు ఇష్టం. అందుకే ఈపని చేసినా. అంతే! అయినా ఇప్పుడు ఈ మాటలు మాట్లాడుకుంటావా ఎపరైనా"

కౌముది నవ్వేసింది.

యాదగిరి ఆ నవ్వుకి జతకలిపి కౌముదిని మరింత నవ్వేటట్టు కితకితలు పెట్టాడు.

అప్పుడు రాత్రి పన్నెండు గంటలయ్యింది. అది రాత్రి అని, అప్పుడు పన్నెండయ్యిందనేకాదు వాళ్ళకుతెలియంది అసలు తాము ఓ దేశంలో, ఓ ప్రదేశంలో, ఓ మహానగరంలో ఓచిన్న వీధిలో, ఓచిన్న ఇంటిలో వుంటున్న సంగతే వాళ్ళు మనుగడా... అన్నీ మర్చిపోయారు.

తెల్లవారగట్ల ఐదుగంటలకు కౌముదికి మెలుకువ వచ్చింది. ఆమెకి, తనకి తనే కొత్తగా అన్పించింది. ఇల్లంతా ఏదో మార్పులుసంతరించుకున్న మహాభవనంలా తోచింది. మూడంకె వేసుకుని పడుకున్న యాదగిరివైపు చూసింది. దుప్పటిసరిచేసి టెబిల్ దగ్గరకుకుర్చీలాక్కునికూర్చుంది. కొత్త జీవితానికి అంకురార్పణ జరిగిన రోజు—జీవితంలో ఓ మార్పు, అదెటువంటిదయినా ఆ అనుభవం చేసే అలజడిని తట్టుకోవడం కూడా కష్టమేనని ఆమెకి అప్పుడే తెలుసొచ్చింది...! బెంగుళూరు నుంచి వస్తూ మోహనరావుకి మాటిచ్చిన ప్రకారం అతనికి జరిగిందంతా ఉత్తరం రాయడం మొదలు పెట్టింది కౌముది.

నాలుగ్రోజుల తర్వాత కౌముది ఆఫీసుకు వెళ్ళింది. ఆ నాల్గు రోజులూ యాదిగిరి కూడా ఆఫీసుకు పోలేదు. కౌముది అప్పటికే ఓ నిశ్చయానికి వచ్చింది. తను పెళ్లి చేసుకున్న విషయం తనుగా స్నేహితులన్న వాళ్ళకి చెప్పాలని...వాళ్ళలో కిట్టనివాళ్ళు వుంటే వుండనీ—అదీ ఆమె నిశ్చయం.

"నాకేం భయంలేదు.నీకే సిగ్గనిపిస్తే.."



అన్నాడు.

"పెళ్ళి చేసుకోవడం సిగ్గుమాలిన పని అంటావా?"

"మామూలుగా అయితేకాదు. కానీ నాలాంటివాణ్ని..."

"నేను మనిషిని పెళ్ళి చేసుకున్నాను. దున్నపోతునికాదు"

అందుకే కౌముది ఇద్దరి ముగ్గురు స్నేహితులతో చెప్పింది. తోటి ఆఫీసర్లతో చెప్పింది. వాళ్ళల్లో గురుమూర్తి కూడా వున్నాడు. కౌముది తన కేబిన్ లోకి ఆహ్వానించి కాఫీ తెప్పించి మరీ చెప్పిందీ విషయం.

గురుమూర్తి నోరు తెరిచి వుండి పోయాడు.

"బాగానే వుంది"

"మీ ఆశీర్వాదం వుంటే చాలు"

"ఏం? యాదగిరి తప్ప మరెవరూ దొరకలేదా...అందులో ఆఫీసులో పని చేసే ప్యూన్. నీ కెరీర్ మాట మర్చిపోయావా? నీ హోదా మాటా మర్చిపోయావా?"

కౌముది నవ్వేసింది.

"వాడికి పెళ్ళయ్యింది పైగా తాగుతాడు"

"ఆ విషయాలు నాకూ తెలుసు"

"ఏమో కౌముదీ...నువ్వు పిచ్చిపని చేశావ్ ... పెళ్ళి కాకుండా కూడా బతకొచ్చు. కానీ ఇది ఘోరం"

కౌముది నవ్వేసి అంది – "నేను





ఎన్నో ఘోరాల్ని చూశాను. ఫరవాలేదు"

కౌముది అంతటితో వూరుకోలేదు. రామానుజానికి ఫోన్ చేసి చెప్పింది.

"వాట్ బేబీ" అన్నాడు.

కౌముది మళ్ళీ చెప్పింది.

"ఇంతకీ పెళ్ళికొడుకెవరు?"

"మా ఆఫీసులోనే పనిచేస్తాడు... యాదగిరి అని"

"నోనో. ఐ డోంట్ లైకిట్. యూవిత్ డ్రా ద మేరేజ్"

కౌముది నవ్వేసింది "మీకు నేను పెళ్ళి చేసుకున్న విషయం తెలియ జెప్పాలికదా, అది నా ధర్మం కదా అని చెప్పాను. సలహా గురించి కాదు"

"ఓ మాట విను"

కౌముది 'నో' అని ఫోన్ పెట్టేసింది.

"అసిస్టెంట్ సెక్రటరీనా, జాయింట్ సెక్రటరీనా?"

"అబ్బే..చాలా చిన్న ఉద్యోగస్తుడు. సాదా ప్యూన్..."

"ప్యూనా...?"

"ప్యూనే"

"నీకేమన్నా పిచ్చెక్కిందా బేబీ..."

"ఇందులో పిచ్చి ప్రసక్తిలేదు సార్"

కౌముది ఆ సాయంత్రం వరకూ రక రకాల అభిప్రాయాల్ని, విముఖతల్ని, ఆశ్చర్యాన్ని, అసహ్యాల్ని వింది... మనిషి ఎదుటి మనిషికి సాయం చేయడు. ఆ మనిషి తనకు తానుగా ఓ దారి వెదుక్కుంటే దానికి సవాలక్ష వంకలు

పెడతాడు. అంతస్తు, హోదా, కులం, అంటూ ఏవేవో కనబడని అగడ్తల్ని వూహించి చూపిస్తూ భయపెడతాడు. అర్థంకాని విషయం కూడా ఒకటే. ఈ లోకంలో బతికే అవకాశాలు వున్నప్పుడు ఆ బతుక్కి అడ్డు తగిలేవాళ్ళు. ఎదటి వాళ్ళెప్పుడూ కష్టాలు పడాలనీ, కన్నీరు రుచి చూడాలనీ, తమ ప్రాపుతో తప్ప బతకకూడదనీ కోరుకుంటుంటారు. ఆమెకు ఆఖరిగా అర్థమయిన నిజం-జీవితంలో ఎప్పుడూ ఎవరిలాగో బతకాలని కలగనకూడదు. మన జీవితాన్ని మనమే జీవించాలి" అనేది.

యాదగిరి కౌముదికన్నా ఎక్కువగా విమర్శల్ని, హేళనని ఎదుర్కోవల్సి వచ్చింది.

"దొరసాన్ని పట్టావ్. అదృష్టవంతుడివి. ఎట్లా పట్టినావురా?" అన్నారు.

"తొందరగ ఆ మెట్రిక్ కానీయ్. క్లర్కు అవచ్చు. ఆ పైన రికమెండేషన్‌తో..."

"ఈయనగారికి పెద్ద పెద్ద పనులేం చెప్పకండి. ఆవిడగారికి రిపోర్ట్ చేస్తే మెమోలు అందుతాయి. జాగ్రత్త"

గురుమూర్తి మరో అడుగు ముందుకు వేసి అన్నాడు-

"నీ దుంపతెగా. మేం అందరం సాధించలేనిది ఎలా సాధించావ్? అయినా చేతులు మారిందే కావాల్సి వచ్చిందా",

యాదగిరికి కోపం ఆగిందికాదు.

"నువ్వు మర్యాదగా మాట్లాడుసారూ! నాకు ఈ ఆఫీసులో అందరి సంగతీ బాగా తెలుసులే. నీ సంగతి కూడా"

"అదేమిటి"

"రాళ్లు విసరడం నీకు చేతగావొచ్చు కానీ నాకు చేతులు విసరడం అలవాటు"

"ఓరినీ" అన్నాడు గురుమూర్తి.

యాదగిరి ఆ సాయంత్రం సరాసరి కూకట్‌పల్లి వెళ్లాడు.

"నాలుగు రోజులనుంచీ రాలేదు. ఎక్కడికి పోయినవ్" అంది కోపంగా నాగమ్మ.

"ఆఫీసు డ్యూటీమీద వరంగల్ పోయినా"

"ఇంటికివచ్చి పోవచ్చుగా"

యాదగిరి మాట్లాడలేదు.

"మా నాయన వచ్చాడు" అంటూ నాగమ్మ అన్ని విషయాలు చెప్పి-''రేపు నన్ను తోలుకుపోతనంటున్నడు''

"మంచిది"

"నువ్వు శెలవు పడేసి వూరురా. నే ఒక్కతినీ పోను"

యాదగిరికి ఏమనాలో తెలియలా.

"రేపు ఆదివారం ఆ స్తలే. నువ్వు మీ నాయనతో పో ముందు"

"అయితే నా కూడా రానంటవ్"

"పనుందే" అన్నాడు నాగమ్మ పక్కన కూర్చుని.

నాగమ్మని చూస్తే జాలివేసింది. నాలుగేళ్ళు తన సహచర్యంలో బతికిన మనిషి. అటువంటిమనిషికి తను ద్రోహం చేశానన్న భీతి అతనిలో లిప్తపాటు కదిలింది.

"నువ్వెట్టా వుంటావ్...బువ్వ ఎట్లా?"

"అమ్మింటికాడ తింటను"

నాగమ్మ నవ్వేసింది అంత బాధలోనూ.

"అదికాదే..."

"రాత్రుళ్లు ఎట్టా పడుకుంటాననా"

"అసలే నువ్వు దూకుడి మనిషివి"

"ఆ భయం వద్దులే"

"ఒట్టెయ్యి మరి తిరగనని"




"ఒట్టు"

"నామీద వేయాలా"

"ఏడాది నన్ను ఉపవాసం పండ మంటావ్. న్యాయంగా వుంటుందా"

"పోనీ మరీ ఎక్కువగా తిరగనని"

"సరే"

"సారాదుకాణాల వెంటబోనని కూడా ఒట్టెయ్"

"కాంతారావు సారు దగ్గరే ఒట్టు తిన్నా-సారా నెలకోమారుతప్ప ముట్టనని బాగా తగ్గిందిలే అలవాటు"

నాగమ్మ నవ్వింది.

* * *

ఆరోజు కౌముది ఆఫీసుకు వెళ్ళలేదు జ్వరం వచ్చినట్టు అన్పించి. యాదగిరి కౌముది వళ్ళుచూసి - "జ్వరం వచ్చి నట్టుగానేకొడ్తోంది" అన్నాడు.

యాదగిరి మాటకి కౌముదికి నవ్వొ చ్చింది "కొట్టడం ఏమిటి. కనిపిస్తోం దనాలి" అంది.

యాదగిరి ఊరుకోలేదు. వెంటనే అన్నాడు - "జ్వరం కన్పిస్తదా? అదే మన్నా మనిషా. లోన ఉంటుంది" అని, "గయితే నన్ను ఆఫీసుకు లీవుపెట్ట మంటవ్?" అన్నాడు.

"నేను డాక్టరు దగ్గరకు వెళ్ళి ఇంజక్షన్ చేయించుకుంటాను. నీ లీవులు ఎందుకు వేస్ట్ కావడం"

"మంచిది" అని యాదగిరి ఆఫీసుకు వెళ్లాడు.

యాదగిరి ఆఫీసుకు వెళ్ళేటప్పటికి పదకొండు గంటలయింది - బస్‌లు దొరక్క.

"దొరా...వచ్చావా.ఇప్పుడుటైమెంత య్యిందో తెలుసునా ?" అన్నాడు గురుమూర్తి.

"లేటయినాది. బస్‌లు దొరకలే"

"ఏదో వంకచెబుతావు...మీమూలంగా సెక్రటరీ నన్ను ఎడాపెడా వాయించాడు ఎమర్జెన్సీ అనైనాతెలియదా"అని తెగవాగి పన్నెండు గంటలకు యాదగిరిని పిల్చి ఓ కవరిచ్చి చిన్న నోట్ బుక్‌లో సంతకం చేయించుకున్నాడు.

"ఏంటిసారూ ఇది?"

"శ్రీముఖం. ఇరవైనాలుగు గంటల్లో దానికి నువ్వు జవాబు రాసివ్వాలి"

యాదగిరి సెక్షన్‌లో దాన్ని చదివించు కున్నాడు. ఆఫీసుకు ఆలస్యంగా వచ్చి నందుకు సంజాయిషీ యివ్వమన్న కాగితం.

యాదగిరికి అర్థమయ్యింది- ఆ మెమో అన్నదెందుకు వచ్చిందో, పక్క సెక్షన్లోవున్న రాధాకృష్ణ దగ్గరకు వెళ్ళి-

"దీనికి జరా సమాధానం రాసిపెట్టు సారూ" అంటూ కాగితం అందించాడు.

రాధాకృష్ణ ఏమనకుండా ఆ మెమో చదివి తనకు తోచిన జవాబు రాసి "గురుమూర్తిగారు ఇచ్చారు కదూ"

"అవ్"

"ఇడియట్. వాడికి బుద్ధిలేదు"

"దొరుకుతాడులే. నేనే గట్టిగా జవాబు చెప్తా సారూ" అన్నాడు.

"అటువంటివాళ్ళతో మనకేమిటి యాదగిరీ! లోకంలోవున్న మంచివాళ్ళతో పాటు ఇటువంటివాళ్ళతో కూడా మసలడం ఎలాగో నేర్చుకోవాలి"

యాదగిరి మాట్లాడలేదు.

కానీ అతని మనసంతా దేవినట్టుగానే వుంది. మధ్యాహ్నం అయిన తర్వాత గురుమూర్తి యాదగిరిని పిల్చి ఓ ఫైలు యిచ్చి పక్క డిపార్ట్‌మెంటులో సంతకం తీసుకుని మరీ యిచ్చిరమ్మన్నాడు.

యాదగిరి ఆ ఫైలు తీసుకుని దారిలోవున్న కేంటీన్‌కి కాఫీ తాగడానికి వెళ్ళాడు. యాదగిరిని చూసి పాత స్నేహితులు పలకరించారు. వేళాకోళం చేశారు. కొందరు తీపీ, కారం తినిపించమన్నారు. మరికొందరు కల్లు కాంపౌండ్‌కి పోదామన్నారు.

యాదగిరి నాలుగైదు రూపాయలు ఖర్చుపెట్టి నలుగురి స్నేహితులకు కాఫీ, టిఫిన్లు యిప్పించాడు. దాంతో అరగంట అయ్యింది అక్కడే. యాదగిరి లేచి ఫైలు కోసం పక్క బెంచీమీద చూసుకున్నాడు. ఫైలు కనబడలేదు. అతనికి కంగారు పుట్టింది. స్నేహితుల్ని అడిగాడు. సర్వర్లని అడిగాడు. ఎవరూ కూడా ఆ ఫైలు తీసినట్టు చెప్పలేదు.

యాదగిరికి తలతిరిగినట్టయ్యింది. ఓ స్నేహితుడు అన్నాడు—

"నిన్ను ఆడించడం కోసం ఎవరో తీసి తిరిగి సెక్షన్లో పెట్టివుంటారు. అక్కడికి పోయిచూడు" అన్నారు.

యాదగిరి తలవంచుకుని సెక్షన్లోకి వచ్చి తోటి ప్యూన్స్‌ని అడిగాడు. అందరూ మాకు తెలియదంటే మాకు తెలియదన్నారు. యాదగిరికి భయం ఎక్కువయ్యింది. తర్వాత్వరగా రాధాకృష్ణ దగ్గరకు వెళ్ళి జరిగింది చెప్పాడు.

"అలా జరక్కూడదే. ఆ కేంటీన్‌లో మరోసారి చూడు" అని, "పద నేనూ వస్తాను" అంటూ యాదగిరితో కలిసి కేంటీన్‌కి వెళ్ళాడు. ఎవరూకూడా సరియైన సమాధానం చెప్పలేకపోయారు.

"నీవెనక నీ సెక్షన్‌నుంచి ఎవరయినా కేంటీన్‌కి రావడం చూశావా?"

యాదగిరికి ఏదీ గుర్తురాలేదు. "యాదు లేదు సారూ"

"ఈ పని ఎవరో కావాలనే చేసి వుండాలి నిన్ను ఇరకాటంలో పెట్టాలని. ఆ...ఆమె డ్యూటీకి రాలేదా ఈ రోజు" అన్నాడు ఏదో ఆలోచించి.

"జ్వరం తగిలిందని శెలవెట్టింది"

"ఏంచేద్దాం ఇప్పుడు?" అంటూ రాధాకృష్ణ యాదగిరి మొహంలోకి చూసి—"ఏది జరగాలో అదే జరుగుతుంది. ఆ గురుమూర్తిగాడితో చెప్పు. తర్వాత మరో సంగతి — వాడికి బాగా నమ్మకమయిన ప్యూన్ ఎవరో నీకు తెలుసా? వాడెవడో వాడిమీదే కన్ను వేసిఉంచు" అన్నాడు.

ఇద్దరూ సెక్షన్‌లోకి వచ్చారు. దార్లోనే యాదగిరి అన్నాడు—

"ముందు ఆ గురుమూర్తితో నువ్వు చెప్పు"

రాధాకృష్ణని చూసి గురుమూర్తి—

"చాలాకాలానికి కనిపించావు. ఏమిటీ.. ఈ దొరగార్ని వెంటేసుకు వచ్చావు?"

"పెద్ద పొరబాటు జరిగిపోయింది" అంటూ గురుమూర్తితో జరిగింది విడమర్చి చెప్పాడు.

"వాట్" అంటూ గురుమూర్తి కుర్చీ వెనక్కువాలి—

"నో నో! దిసీజ్ షీర్ నెగ్లిజెన్స్. ఈమధ్య ఇతని బిహేవియర్ నేను చూస్తున్నాను. ఆఫీసర్లని మించిపోయాడు. అది టాప్‌సీక్రెట్ ఫైలు. పైగా రేపు ఆ ఫైలు చీఫ్‌మినిస్టర్‌గారు చూడాల్సివుంది.నోనో. ఐ కాంట్ కీప్ క్వయిట్" అంటూ ఫోన్ తీసి ఎవరికో ఫోన్‌చేసి ఏవేవో చెప్పి అలానే అలానే అంటూ అటునుంచి సలహాలుపొంది ఆ తర్వాత టేబిల్ మీద గ్లాసులో నీళ్లుతాగి జేబురుమాలుతో కళ్ళజోడు తుడుచుకుని—

"వెంటనే ఇతగాణ్ని సస్పెండ్ చేయ




మంటున్నాడు సెక్రటరీ"

రాధాకృష్ణ ఏదో అనబోయాడు.

"ప్లీజ్...మీరు కలగజేసుకోవద్దు మధ్యలో! ఐ కాంట్ హెల్పిట్"

గురుమూర్తి స్టెనోని పిల్చాడు. ఆ తర్వాత యాదగిరినిచూసి - "పోయి నీ సీట్లోకూర్చో.వళ్లుదగ్గర పెట్టుకుని పనిచేయ నందుకు నువ్వేమిటి, నేనేమిటి ఎవరయినా శిక్ష అనుభవించవల్సిందే" అన్నాడు.

అరగంటలో యాదగిరిని సస్పెండ్ చేస్తూ కాగితం తయారయ్యింది.

యాదగిరికి పెద్దగా విచారం కలగలేదు. ఆఫీసులో గాలివాననీ, పిడుగుల్నీ, ఉరుముల్నీ అతని మనసు అంతకుముందే వూహించుకున్నట్టు...అది వాస్తవంలో జరిగినట్టు అనిపించింది. కానీ ఇంత త్వరగా నెత్తిమీద సమ్మెటపోటు జరుగుతుందనుకోలేదు.

"ఏంచేస్తావురా?"అన్నాడు స్నేహితు డొకడు.

"చేసేదేం వుందిలే"

"చూస్తే ఇదంతా కావాలని చేసినట్టులే''

"ఆయనే కావాలని చేసిండు"

"మరిగయితే''

యాదగిరి ఏం మాట్లాడలేదు. ఆఫీసు నుంచి బయటపడ్డాడు. మెదడు వేడెక్కినట్టుగా వుంది. సహజంగా ఏ చీకాకు వచ్చినా, ఘనసుకు దెబ్బతగిలినా వెంటనే సారాకొట్టుకు పరిగెట్టటం అలవాటు. రెండుగ్లాసులు తాగితే మనసు కుదుటపడినట్టుగా వుంటుంది. ఇంకో గ్లాసు పడితే మెదడుకు విశ్రాంతినిచ్చి జోకొట్టుకోవచ్చు.

ఆ రోజు ఆ పని యాదగిరి చేయలేక పోయాడు. దానికి కారణం కౌముది. కౌముదితో పెళ్లి అయి సంసారం మొదలైన రెండునెలల్లో అతనెన్నోసార్లు తాగాలని అన్పించినా తాగకుండానేవుండిపోయాడు. తన భార్య నాగమ్మే ఓర్చుకోకుండా నానా మాటలు అన్నప్పుడు కొత్తభార్య, అందులోనూ ఈ రకం అనుభవం ఎరుగని ఆడదాని ముందుకు తాగి వెళ్ళడానికి అతనిలో వున్న వివేకం మొరాయించింది.

కాసేపు పార్క్‌లో కూర్చుని నాలుగైదు సిగరెట్లు కాల్చాడు. జేబులో వున్న రెండు కవర్లూ గుండెలమీద బరువుగా అన్పించాయి. వాటిని ఏవిధంగా కౌముదికి చూపించాలో, ఏం చెప్పాలో అతను వూహించసాగాడు. ఏంచెప్పి కౌముదిని నమ్మించాలాని మార్గాలు అన్వేషిస్తున్నాడు.

కౌముది తనని సరిగ్గా అర్థం చేసుకోదేమోనన్న ఆలోచనే అతనికి పదే పదే రాసాగింది.

'ఏమవుద్ది. గంతగా అయితే నౌఖరీ పోతుంది...పోనీ' అనుకున్నాడు.

ఇంటికి బయలుదేరాడు. దూరంనుంచే కౌముది వీధి తలుపు దగ్గర నుంచుని వుండడం అతను గమనించాడు.

* * *

రెండు రోజుల్లో కౌముదికి జ్వరంతగ్గింది. ఆ జ్వరంతో వచ్చిన నీరసంకన్నా - యాదగిరి పరిస్థితివల్ల ఆమె మరింత నీర్సపడింది. ఆ కలతని మాటల్లో కనబడకుండా ఆ రెండు రోజులూ జాగ్రత్తపడింది.

"నువ్వు ఆఫీసుకు పోతనంటున్నావుగా. నేను ఓ మారు మాఇంటికి పోయివస్తా. నా భార్య ఏమన్నా ఉత్తరం రాసిందేమో"

"సరే" అంది కౌముది. కానీ వెంటనే ఏదో జ్ఞాపకం వచ్చి - "తొందరపడి

ఆమెకు నీ ఉద్యోగం గురించి రాయకు. కంగారుపడుతుంది" అంది.

కౌముది మామూలుగా ఇంటికి తాళం వేసి ఆఫీసుకు బయలుదేరింది. ఆమెకు ఆఫీసు దగ్గరవుతోన్న కొద్దీ మనసులో ఏదో చెప్పలేని జంజాటన మొదలయ్యింది. మెదడు డిస్టర్బ్ అవడం అంటే అదే నేమో. యథాప్రకారం సెక్షన్లోకి వెళ్ళి తన కేబిన్‌లో కూర్చుంది. సెక్షన్‌లోపలికి వచ్చే ముందే గురుమూర్తి కేబిన్‌వైపు ఓ సారి చూసింది. లోపల మనిషివున్న అలికిడిలేదు.

వెళ్ళి సీట్‌లో కూర్చుంది. అచేతనంగా బెల్ కొట్టింది. సెక్షన్ లోపలినుంచి కొత్త ప్యూన్ లోపలికి వచ్చి సలాం చేశాడు.

"ఫైళ్ళు తెచ్చిపెట్టు" అంది. అతని వైపోసారి చూసింది. అతను మామూలుగా లోపలికి వెళ్ళిపోయాడు.

కౌముదికి ఏంచేయాలో తోచలేదు. నాల్గురోజులనాటి ఫైళ్ళు ఎక్కడివక్కడే వున్నాయి. పదినిముషాలు కళ్ళు మూసుకుని తలవంచుకుని అలాగే కూర్చుంది. మెదడు ఏ పని ముందుచేయాలో, ఏ పనికి వ్యతిరేకించాలో తేల్చుకోలేనట్టు చిన్నరకం అలజడిలో కొట్టుకుంటోన్నట్టుగా వుంది.

ఇంతలో ఫోన్ మోగింది.

"కౌముదీ హియర్" అంది.

"నేను . . . గురుమూర్తిని. నీతో అర్జెంటుగా మాట్లాడాలి. నువ్వు ఒక్కత్తివీ వున్నావా?"

"ఏం మాట్లాడాలి"

"యాదగిరి గురించి"

"నాకు తెలిసింది"

"అదికాదు. నేను వచ్చి చెప్తాను" గురుమూర్తి ఫోన్ పెట్టేశాడు. రెండు నిముషాల తర్వాత గురుమూర్తివచ్చి కుర్చీలో కూర్చుని "అనుకోకుండా అంతా విచిత్రంగా జరిగిపోయింది. నేను చాలా ట్రైచేశాను. సెక్రటరీతో కూడా చెప్పి చూశాను. లాభం లేకపోయింది"

''నాకు అతను జరిగింది చెప్పాడు''

''నేనీమధ్య అతన్ని బాగా పరకాయించి చూస్తున్నాను. నెగ్లిజన్స్ పెరిగిపోయింది''

కౌముది ఏం మాట్లాడలేదు.

''నిన్నా, మొన్నా యంక్వయిరీ జరిగింది. కనీసం దానికయినా అతను హాజరుకాలేదు. దాంతో సెక్రటరీకి మరీ కోపం వచ్చింది. యాదగిరిని డిస్మిస్ చేస్తూ ఆయనే ఆ పేపర్‌మీద సంతకం చేశాడు"

కౌముది ఆశ్చర్యపోయింది. ఆమెకేం అనాలో తెలియలేదు.

"రెండు రోజుల్లో ఇంత త్వరగా అతగాణ్ని ఉద్యోగంలోంచి తీసేశారా?''

"యమర్జెన్సీ రోజులు. మన వుద్యోగాలకే ఢోకాలేదు. అందులో అది బడ్జెట్‌కు సంబంధించిన ఫైలు. అది పోగొట్టాడు. ముఖ్యమంత్రిగారు మామీద విరుచుకుపడ్డారు. మాకూ మెమోలు దొరికాయి''

కౌముది ఏం మాట్లాడలేదు.

"నువ్వు లేని సమయంలో ఇలా జరగడం నాకు చాలా బాధనిపించింది. నువ్వేమనుకుంటావోనని"

"యాదగిరిని సస్పెండ్ చేసినరోజు మీరు నాకు కబురు పంపుతారనుకున్నాను. అతను యంక్వయిరీకి రాకపోతే ఆ విషయంలో అతని పొరబాటేం వుంది కనుక? సస్పెన్షన్ ఆర్డర్స్‌లో అది మీరు మెన్షన్ చేయలేదుగా"

"మళ్ళీ నువ్వు రూల్స్ మాట్లాడుతున్నావ్. రోజులు ఎలాంటివో నీకు తెలుసు. అతను చేసింది పెద్దనేరం. అది కప్పిపుచ్చడం నువ్వు డ్యూటీలోవున్నా నీవల్ల కూడా అయ్యేదికాదు. నువ్వు బాధపడి ప్రయోజనంలేదు. ఈ విషయం వ్యక్తిగతంగా తీసుకోవడం అంతమంచిది కాదు"

"ఎంతగా ఆలోచించినా ఇది అతని పొరబాటువల్ల జరిగిన పనని నాకన్పించడంలేదు. మీరు ఎలా వూహిస్తున్నారో నాకయితే తెలియదుగానీ...పోనివ్వండి. నా మూలంగా అతని ఉద్యోగం పోయిందని నేను అనుకున్నా, అలా జరగలేదని మీరు నన్ను కన్విన్స్‌చేసినా ఒక వ్యక్తి పొట్టమీద కొట్టడం జరిగింది''

"నువ్వు ఈ విషయంలో పెర్సనల్ ప్రిజుడీస్‌కి సావకాశం ఇస్తున్నావు''

కౌముది నుదురు రాసుకుని ''లీవిట్ సర్! ఆ విషయం మర్చిపోదాం'' అంది.

''ఇందుకేనే వచ్చింది-వెడతాను. అతగాడితో చెప్పు-అతనికి రావల్సిన డబ్బులన్నీ నెలాఖరుకి బిల్లుచేసి పెడతానని''

కౌముది సీట్లో కూర్చోలేకపోయింది. ఆమెకి తన అసహాయత పదే పదే గుర్తుకురావడం మొదలుపెట్టింది. కళ్ళవెంట అనుకోకుండా నీరు కదిలింది. లంచ్ ఇంటర్‌వెల్‌వరకూ నిలదొక్కుకుని వున్నది ఆ వాతావరణం తనింక భరించలేక డైరెక్టర్‌కి ఫోన్‌చేసి వంట్లో బావుండలేదనిచెప్పి లీవు రాసి ఇంటి మొహం పట్టింది.

దారి పొడుగునా ఆమెని తోచనితనం వెంబడిస్తూనేవుంది. యాదగిరికి ఈ విషయం ఎలా చెప్పాలా అనే ఆలోచిస్తోంది. ఉద్యోగం పోవడం ఎవరికయినా బాధాకరమైన విషయమే. యాదగిరి ఈ హటాత్ పరిణామానికి తట్టుకోగల్డా. తన అసహాయత పైకి వ్యక్తీకరించలేకపోయినా మనసులోనైనా తనగురించి ఏవేవో అనుకోవచ్చు.

యాదగిరి, అతనిమీద ఆధారపడి బతికేవాళ్ళు పరోక్షంగా తనని ఎంతగానో శపించవచ్చు. సాఫీగా సాగే అతని బతుకులో నిప్పులుపోసిన మనిషిగా తనని నిలదీస్తే తన దగ్గర జవాబేంవుంది.

దిక్కుతోచకుండా నాలుగు రోడ్ల కూడలిలో చిక్కుపడిపోయిన పసివాడిలా ఆమె కలతపడిన మనసుతో ఇంటి మొహం పట్టింది.

"యాదగిరీ ఇటు రావోయ్'' అంటూ చిన్నకారులోంచి ఎవరో పిల్చినట్టయ్యి యాదగిరి పక్కకి చూశాడు. కారులోంచి తల బయటకుపెట్టి రామానుజం పిలుస్తున్నాడు.

''నువ్వా సారూ'' అన్నాడు.

"ఎక్కడికి నడుచుకుంటూ పోతున్నావు. రోడ్లు కొలుస్తున్నావా''

"నేకాళ్ళతో కొలవబోతూంటే మీరు కారుతో లెక్క కడుతుండరు. గంతేగదా తేడా"

"కారెక్కు నీతో మాట్లాడాలి"

"నే జల్దీ పోవాల"

"కౌముది దగ్గరకే కదా! నే దిగబెడతాను. సరేనా"

"అద్దు.నాతో పనేమిటో చెప్పు.చాలు"

"పోనీ ఏ బార్‌కయినా పోదామా"

"అలవాటు లే..."

"నువ్వు తాగవంటే నేనమ్మతానా" రామానుజం నవ్వాడు.

"తాగనంటలే బార్‌లకి పోను. మాకు కల్లు కాంపౌడ్‌లుంటాయి. బార్‌కన్నా

చవక"

"బార్ అనుభవం తెలుస్తుంది. మరీ బెట్టుచేయక"

రామానుజం యాదగిరిని కారెక్కించుకుని కారు వెనక్కితిప్పి పెద్దబార్‌కి తీసుకెళ్ళాడు. రామానుజాన్ని చూసి కౌంటర్‌లో కూర్చున్న మేనేజర్ నవ్వుతూ విష్ చేశాడు.

యాదగిరి అంతవరకూ అంతటి ఖరీదయిన బార్‌ని చూడలేదు. ఓ చిన్న సైజు కుషన్‌కుర్చీలో రామానుజం మహారాజులా కూలబడ్డాడు. యాదగిరికూడా పక్క కుర్చీలో కూర్చున్నాడు. హాల్లో ఇరవయి వరకూ బల్లలూ, వాటిచుట్టూ అధునాతనంగా అలంకరించుకున్న స్త్రీ పురుషులూ కన్పించారు. హాలంతా కన్‌సీల్డ్ లైటింగ్‌తో సంజవెలుగు ఛాయలు చిమ్ముతోంది. గుసగుసలు చెప్పుకుంటోన్నట్టు మాటలు వినీవినబడని మాటకి కనీకన్పించని నవ్వు పెదాలమీద లాస్యం చేస్తోంది. కళ్ళల్లో మత్తుకు జవాబుగా చేతులు కలుపుకోవడం' టేబిల్ కిందనుంచి అతిసున్నితంగా కాళ్ళు తాకడం, తాగినమైకం చేయించే అతి అధునాతన శివతాండవానికి ప్రభాత గీతాలు ఆలాపిస్తున్నట్టు ఎక్కడినుంచో వినిపించే సంగీతం.

యాదగిరి అతినాజూకుగా రామానుజం తాగడం చూశాడు. అరగంట అయినా ఆయనముందు బీర్‌బాటిల్ సగం ఖాళీ కాలేదు. యాదగిరికి నవ్వొచ్చింది. చుట్టూ

ఎవరూకూడా త్వరత్వరగా తాగడంలేదు. పెదాలతో చప్పరిస్తున్నారంతే. యాదగిరికి వాళ్ళందరూ తాగడంలో ఇంకా ప్రారంభ దశలోవున్న వ్యక్తులైనా కావచ్చు లేకపోతే పెద్ద సైజు నటులయినా కావచ్చునని పించింది.

తను ఎంత ఘాటయిన సారా అయినా రెండు మూడు నిముషాల్లో-అదీ రెండు మూడు గుక్కల్లో పట్టించేయ గలడు. చుక్క చుక్కనీ లెక్కపెట్టు కుంటూ తాగితే అయినట్టే. నిషా నిము షాలమీద రావడం ఆ నిషాతోనిండిన బుర్రని అంతకు మించిన వేగంగా ఇంటికి జేరవేయడం తనకలవాటు. కల్లుకాంపౌండ్ గుర్తుకొచ్చింది. ఆరుబయటే తాగడం నడుస్తుంది. కాంతారావు సారు అన్నట్టు 'ఓపెన్ ఎయిర్ బార్' అది. అక్కడి మనుషులు మాత్రం మొరటు జనం.. తాగినదానికి నాలుగురెట్లు వాగడం— మాటకి పది బూతులు- కాకపోతే తన్ను లాటలకి సిద్ధమవడం చేస్తారు.

"కొత్తగా వుందా"

"ఏం లేదు"

"అప్పుడే క్వార్టర్ బాటిల్ పట్టిం చేశావ్... నీది కడుపా, ఖండవిల్లి మడుగా" అన్నాడు ఆశ్చర్యంగా.

"మీలా తాగితే అయినట్టే"

"మరో బాటిల్ తెప్పిస్తాను"

"ఎందుకు.. అద్దు..."

రామానుజం వినలేదు.. బేగ్ పైపర్

తెప్పించాడు.. తానూ తాగాడు. యాదగిరి విస్కీ గ్లాసులో పోసుకుని తన సహజసిద్ధమైన ఫాషన్‌లో తాగేశాడు.

"ఇక్కడ కొంచెం స్టయిల్ మెయిన్‌టెయిన్ చేయాలి"

"నాలా తాగితే ఎక్కువ చార్జీ చేస్తారా?" యాదగిరి నవ్వాడు. స్పీడుగా తాగడంతో యాదగిరికి తిప్పు కూడా వుప్పెనలా వచ్చింది.

"పోదాం పద సారూ..."

"నీతో మాట్లాడాలన్నాను కదా"

"చెప్పు"

"సరిగ్గా విను. ఆఫీసులో నువ్వేదో గొడవల్లో ఇరుక్కున్నావుట కదూ..నిన్ను సస్పెండ్ చేశారట. నిజమేనా?"

"అవ్..."

"మరేంచెయ్యాలనుకుంటున్నావ్..."

"చేసేదేం వుంటది"

"అదికాదు యాదగిరీ.. మరి నీభార్య ఆఫీసర్ కదా! ఆమెకి విషయం తెలుసా?"

"తెలుసు"

"ఏం చేస్తానంది.."

"తనేం చేస్తుంది.. ఇది నా గొడవ"

"నీ గొడవని వదిలేసిందనుకో... అప్పుడు?"

"నౌఖరీ పోతుంది.."

"పోతే...?"

"పోతే ఏం వుంది.. మల్లా ఉద్యోగం వెతుక్కోవాల"

"ఓరి నీ దుంపతెగా. అయితే నీకు ఉద్యోగం అంటే భయం లేదా?"

"నౌఖరీ ఏమన్నా మొగుడా, దెయ్యమా.. భయపడ్డానికి"

రామానుజం ఆశ్చర్యంగా యాదగిరిని ఓసారి చూసి "నీకు నేచెబుతున్నదీ అర్థమయ్యిందా"

"మంచిగ"

"సరే. నీకు తెలియని సంగతొకటి చెప్తున్నా విను. నిన్ననే నిన్ను ఉద్యోగం లోంచి డిస్మిస్ చేశారు. నువ్వు ఇంటికి వెళ్ళేసరికి బేబీ ఎలానూ చెప్తుం దనుకో..."

యాదగిరి ఆశ్చర్యంగా రామానుజాన్ని చూసి, తల ఓసారి వంచుకుని "గయితే అనుకున్నంత అయ్యిందన్న మాట" అనుకున్నాడు నెమ్మదిగా.

"నువ్వనుకున్నావా..బేబీ చెప్పిందా?"

"నేనే అనుకున్నా...అదే చేసుంటాడీ బాడుఖావని.. ఆడే.. గురుమూర్తి గాడు.. నా కొడుకు.."

"వుష్.. నెమ్మది"

"నీకు సిగ్గనిపిస్తుందా? బయటకు పోదాం పద"

"యాదగిరీ! నువ్వేం భయపడకు. నీ వెనక నేవుంటా"

"సరే"

"నీ ఉద్యోగం నీకు వచ్చేటట్టు చేస్తాను. అదికాకపోతే దాని బాబులాంటి ఉద్యోగం నా కంపెనీలో ఇస్తా. కానీ ఓ పని చెయ్యాల.."

"గురుమూర్తిని తన్నమంటావా?"

"కాదు"

"మరేంది...?"

రామానుజం టేబిల్ మీదకి వంగి "నీకు ఉద్యోగం ఒకటే కాదు.. కావల్సి నంత డబ్బిస్తా. ఆలోచించు"

"ఏందో చెప్పరాద"

"సరాసరి మనిద్దరం బేబీ ఇంటికి వెదదాం. బేబీ కలగచేసుకోని మూలంగానే కదా నీ ఉద్యోగం పోయింది. అందుకే బేబీని నాలుగు చీవాట్లు పెడతావో, బూతులే తిడతావో, నీ ఇష్టం.

అవి కానిచ్చి మీ పెళ్ళికీ, సంసారానికీ ఓ మంగళహారతి పాడేసి గమ్మున తిరిగి వచ్చేయ్. మళ్ళీ ఆ గడప తొక్క కూడదు... ఏం"

యాదగిరికి అప్పటికే చాలామటుకు తిప్పు తగ్గిపోయింది. రామానుజం హిత బోధతో అది టప్పున గాలికెగిరిన కాగితం అయ్యింది. కానీ అతనికెందుకో తిప్పు తగ్గినట్టు ప్రవర్తించకూడదనిపించింది. మృగంలా కన్పిస్తున్న రామానుజానికి బాగా బుద్ధి చెప్పాలనిపించింది..

''గట్ట చేయమంటవ్.. అవ్నా?"

''అవును"

"నేను ఆ పిల్లనట్ట చేసిన్ననుకో. నీ కేంటి లాభం"

రామానుజం తెలివిగా మాట్లాడుతున్నా ననుకుని–

"కిందవాడివికదా అని నిన్ను బాగా వాడుకుంది. దాని సంగతి నీకు తెలియదు. షోగ్గావుందని నీకళ్ళకి బైర్లు కమ్మాయి. అది ఏడాదికాదు బహుశా ఈవేళే నిన్ను గడపతొక్కనీయక పోవచ్చు"

"ఆ పని వేశ్యలు చేస్తరని విన్నా"

"నిజం చెప్పావ్. నూరేళ్లు బతుకు"

"గట్టా చేయలేదనుకో. సంసారే అవుద్దికద అప్పుడు"

రామానుజం కాసేపు ఆలోచించి "సంసారి వేషాలేసే వేశ్యలు కూడా వుంటారు. నీకు అనుభవం తక్కువ"

"అన్నీ నువ్వే అంటావు. ఎలాసారూ నీతో. పరేషానీగా వుందే"

"ఏదో ఒకటి..నే చెప్పినట్టు చేస్తవా"

యాదగిరి మాట్లాడలేదు.

రామానుజం బేరర్‌ని పిల్చి మరో విస్కీకి ఆర్డరిచ్చాడు.

''లోడు సరిపోలేద... మల్లా తెమ్మన మంటున్నవ్''

''నీ కోసం"

''నాకు చాలు. బాగా తాగిన. నువ్వే తాగు"

''హీరోవి నువ్వే తాగాలి"

యాదగిరి ఏమనకుండా సగం తాగి మిగతాది రామానుజం ముందుకు తోశాడు.

అరగంట తర్వాత ఇద్దరూ కారు ఎక్కారు. రామానుజం కారు నడుపుతున్నాడు స్పీడుగా. పది నిమిషాల్లో కారు కౌముది ఇంటిముందు ఆగింది.

''నేను కారుని ఇక్కడే ఆపుంచుతా. జల్దీరావాలి" అన్నాడు.

యాదగిరి కారు దిగి జేబులు తడుముకున్నాడు. చేతికి తళతళ మెరుస్తూ చాకు తగిలింది. యాదగిరికి నవ్వొచ్చింది. అది జేబులో పెట్టుకున్నది ఓ మహాకార్యం పూర్తిచేయడానికి... గుణ్ణం మూర్తిగాడికోసం. యాదగిరి నేలమీదకి వంగి ఆ చాకుతో కారు ఫ్రంట్ టైర్‌ని మూడు కోతలు పెట్టాడు. గాలి బయటకు రావడం మొదలయ్యింది.

''ఏమయ్యింది... ఏమిటి?" అన్నాడతను.

''పని పూర్తి చేస్తున్నా"

రామానుజం ఒంగి యాదగిరి చేస్తున్న పనిచూసి– ''ఓరె... ఓరే నీకేమన్నా మతిపోయిందా? టైరు కోశావు దేనికి భడవా" అంటూ కారు దిగాడు. యాదగిరి కాలర్ పట్టుకోబోయాడతను.

యాదగిరి అలానే ఎడంచేత్తో వెనక వున్న రామానుజాన్ని ఒక్క విసురుతో వదిలించుకుని–

"చూసినావు ఏమయిందో"

''ఫూల్‌లా వున్నవ్. టైర్ కోస్తావా?"

యాదగిరి నవ్వేసి అన్నాడు-

"న్యాయంగయితే నీ పీక కోయాల. ఆ పని చేయలే... సంతోషించు. ఎదవ నాయల... భార్యని వదిలి రావాలిట. అందుకు పైసలిసానంటవ్!"

"నీకిష్టంలేకపోతే చేయనని చెప్పాలి. ఇదేంపని"సణుక్కున్నాడు రామానుజం.

"సరయితే... నాకు ఇష్టవే. కానీ ఓ షరతు. ఒప్పుకుంటావా?"

"చెప్పు"

"ఈ పనికి నీ కూతుర్ని నా దగ్గర పండబెట్టాల. ఈ రాతిరికే..ఏమంటావు?"

రామానుజం మాన్పడిపోయాడు.

యాదగిరి ఎడంచేత్తో రామానుజం గెడ్డం ఎత్తి-

"ఆ పనికికూడా నువ్వు సైఅంటావు గానీ నాకిష్టంలే. నీ దారినపో. మల్లా ఈడ కన్పిస్తవో ప్రాణం తింటను" అన్నాడు. రామానుజం మొహం పాలిపోయింది.

"వెడతన్నా" అంటూ యాదగిరి చాకు చేత్తో తుడిచి జీరాలోకి వెళ్ళబోయి ఎదురొస్తున్న నరశింహనిచూసి ఆగిపోయాడు. నరసింహ కూడా తన తోటి ప్యూన్. గురుమూర్తి దగ్గర పనిచేశాడు చాలా కాలం. యాదగిరికి చటుక్కున తను ఫైలు పోగొట్టుకున్న రోజు కేంటీన్‌లోకి నరశింహ రావడం గుర్తొచ్చింది.

నరసింహ దగ్గరగావెళ్లాడు. నరశింహ ఫుల్ లోడ్‌లో వున్నాడు. యాదగిరిని చూసి - "భాయ్. ఏడకి పోతన్నవ్" అంటూ అడిగాడు.

"మా పెదనాయన ఇంటికి పోయి వస్తన్న. నువ్వు?"

"దోస్తులు కలిసున్రు. కాంపౌండ్ పోయిన"

"నేనూ అచేపోతన్నా . రాకూడదా.. చేరో గ్లాసు వేసుకుందాం"

"నాకాడ పైసలులేవు భయ్. బీడీలు మాత్రం వున్నయ్"

"పైసలు నాకాడ వున్నయిలే. పా"

యాదగిరి నరశింహ భుజం మీద చెయ్యివేసి అతని భార్యా పిల్లల గురించి, ఇంట్లో ఇబ్బందుల గురించి ఎంతో ప్రేమగా అడిగాడు. నరశింహ భార్యకి వంట్లో బాగుండలేదనీ, పైసల కోసం పరిషానీలో వున్నట్టూ ఏవేవో చెప్పాడు.

"ఆఫీసులో ఎవర్నయినా అడగ కూడదా. గురుమూర్తి సారు వడ్డీలకు పైసలు తిప్పతాడని విన్న"

"ఆ సారుకాడ కూడా తీసుకున్న మొన్ననే"

"మొన్నన?"

"అవ్"

"నేనడిగినా అన్నా. పైస లేదన్నడు. చూసినావ్! నీకిచ్చిందన్న మాట. ఏమైనా నువ్వంటే సారుకి నమ్మిక"

"ఏదోలే. నడస్తంది... నడవనీ"

ఇద్దరూ కాంపౌండు దగ్గరకు చేరారు. యాదగిరి నరశింహ తాగుతానన్నంత తాగించి మిర్చీలూ, బజ్జీలూ కొనిచ్చాడు.

"నువ్వసలు ముట్టనేలేదు. అద్దా?"

"ఈరోజు శనివారం. వెంకటేశ్వర స్వామికి మొక్కుకున్నా"

"దేవుడు. దేవుడు! సరిగ్గా ఈ రోజు అడ్డు వచ్చిండు. పాడు"

"నా గళాసుకూడ నువ్వే ఏసుకో. ఏం చేయాలి"

అరగంటలో నరశింహ తలలో దిమ్మ, నరాల నాట్యం మొదలయ్యింది.

"పా పోదాం. బాగ చీకటిపడింది"

యాదగిరి నరశింహ భుజంమీద

చెయ్యేసి తిరిగి కబుర్లలో పెట్టాడు. నరశింహ నడుస్తూనే రోడ్డు పక్కనవున్న సినిమాబోర్డుల మీద వున్న సినిమా తారల్ని చూసి నోరు చప్పరించే దశకు వచ్చాడు.

"సినిమాకు ఎదదాం. జయమాలిన డాన్స్ చూడల"

"బాగా చిత్తుగా తాగినవ్. నీకు నాగేశ్వర్రావుకీ, జయమాలినికీ తేడా తెలవదీ దినం"

"గట్టనకు భయ్! ఆడ వాసన అంత దూరం నుంచే పసిగడత"

యాదగిరి చిన్నగా నవ్వి – "ఇటు.. అటుకాదు. రస్తా"

"ఈ గల్లీ ఏందీ క్రొత్తగ వుంది"

"మా ఇంటికి పోదాం. నా భార్య ఈ దినం కోడికూర వండింది. జర్ర తినిపోదువు గాని"

నరశింహ నోరు చప్పరించుకుంటూనే "సరెనే" అన్నాడు.

యాదగిరి దారిలో ఆగి పాన్‌షాప్ దగ్గర 'రామ్‌ప్యారీ' ఒకటి కట్టించుకుని దాన్ని బుగ్గన పెట్టుకువి – "పద" అన్నాడు.

యాదగిరికి ఇల్లు దగ్గరవడం మొదలవుతూన్న కొద్దీ ఆవేశం పెరగసాగింది. నరశింహ వైపు చూశాడు. ఫరవాలేదు... మనిషి పూర్తిగా చెట్టెక్కాడు.

యాదగిరి ఇంటిముందు ఆగి తలుపు తోసి చూశాడు. తలుపు వేసివుంది. తనకే అలవాటయిన పద్ధతిలో తలుపుకున్న ఇనప గడియ మూడుసార్లు కొట్టాడు.

లోపలినుంచి "వస్తున్నా" అన్న కౌముది మాటలు విన్పించాయి. యాదగిరి ఓసారి తనలో తను వుగ్గ బెట్టుకున్నాడు. రెండు నెలలుగా ఈమధ్య తాగడం మానేశాడు. తాగినప్పుడు తను ఎలా ఉంటాడో, తాగినప్పుడు తన ప్రవర్తనలో ఏ పొరబాటు దొర్లుతుందోననే భయం అతనిచేత తాగుడుని దూరంచేసింది. కానీ ఈ రోజు తప్పలేదు.

కౌముది తలుపుతీసి యాదగిరిని చూసింది. ఆమెకు గాలిలోతేలి ఓ రకమైన వెగటు వాసన, పులుసు కంపుకొట్టింది. ఆమె క్షణం నివ్వెర పోయింది..

"ఏమనుకోకు.. ఇన్ని దినాల తర్వాత ఈ దినం కొద్దిగా తాగిన. అదీ ఆ రామానుజం గాడి దయవల్ల. అందుకే రెండు తగిలించి రుణం తీర్చుకున్న. చూసినావా... వీడు నరశింహ. ఆదినం ఫైలు పోయిందని చెప్పిన చూడు. ఈ దొర ఆడనే వున్నడు. ఈడి నోటివెంట నిజం చెప్పిస్తా. విను" అంటూ–

"నరశింహా! లోనికి రా భయ్. అరుగుమీద ఏం కూర్చుంటావ్.."

"వస్తన్న" అంటూ నరశిహ లోపలికి వచ్చి మత్తు కళ్ళతోనే కౌముదిని చూసి, రెండు క్షణాల తర్వాత పోల్చుకుని.

"అమ్మ" అనేసి యాదగిరివైపుతిరిగి "నీ ఇంటికని చెప్పినవ్.."

"ఇది నా ఇల్లేరా... కూర్చో" అంటూ లోపలికి వెడుతూ కౌముది వైపోసారి చూసి–

"ఏమీ చెడుగ అనుకోకు ఇలా ఈ లుచ్ఛాని ఇంటికి తోలుకొచ్చానని. వీణ్ని తంతే సత్యం తెలుస్తది"

కౌముదికి ఏమనాలో తెలియలేదు.

యాదగిరి పడగ్గదిలోకి వెళ్ళి తలుపు పక్కన వున్న చాపాటి కర్ర తీసుకుని వచ్చాడు.

"కోడికూర కావాల్నా" అంటూ

నరసింహని అడిగాడు యాదగిరి.

"ఎట్లు. మల్లా తొందరగ పోవాల"

యాదగిరి నరశింహాన్ని కుర్చీలోంచి లేపి– "బాడుఖావ్... కోడికూర తింటవా. తిన్ను.." అంటూ జుట్టు పట్టుకుని గుంజి వీపు మీద బలంగా నాలుగు గుద్దులు గుద్దాడు.

నరశింహ కుర్చీలోంచిపడి–

"మరగయా... మర్‌గయా" అంటూ లేవబోయాడు.

"అరిచావంటే చంపుత. నా కొడక" అంటూ మొహం మీద మరో గుద్దుగుద్ది. "లే... సత్యం చెప్పు. మొన్న దినం కేంటీన్‌లో నే బెంచ్ మీద ఫైలు ఎట్టిన. అదెవడు తీసిండు. నువ్వు తీయలే. చెప్పు" అంటూ ఒక్క తన్ను తన్నాడు.

"ఫైలేంటి భయ్. నాకు తెలవదు" నరశింహ మూలిగాడు.

"నా చేతిలో చస్తవ్... చాకుదూసిన నంటే. బోలో. సచ్ బోలో" అంటూ చాకు నరశింహ పీకమీద పెట్టాడు.

"వద్దు... పోనివ్వు" అంది కౌముది భయంగా.

"నువ్వూరుకో. రక్తం కళ్ళ చూస్త. చెప్పు. చెప్పవ్ కదూ."

"తీసినభయ్. తప్పయిపోయింది. నేనే తీసినా"

"ఎందుకు తీసినవ్?"

"గురుమూర్తి సారు చెప్పిండు. అందుకని చేసిన."

కౌముది ఆశ్చర్యపోయింది.

"ఏడ పెట్టినవ్. నీకాడవున్నదా?"

"నేదు. ఆసారుకే యిచ్చినా"

"నా పొట్ట మీద కొట్టినవ్ కదూ కుచ్చా... బద్మాష్.. ఎన్ని పైసలిచ్చిండు ఈ బాడుఖాపని చేసినందుకు"

"యాభై రూపాయలు యిచ్చినాడు"

"వింటివా.." అన్నాడు యాదగిరి కౌముది వైపు తిరిగి–

"ఎంత పని చేశావ్ నరశింహా! నీ మూలంగా ఇతని నౌఖరీ పోయింది. డబ్బుకోసం ఇలా చేస్తావా"

"తప్పయినదమ్మా"

"రేపు ఆఫీసులో నలుగురి ముంగటా ఈ మాట చెప్పాల. తెలిసినాదీ. కాదన్న వంటే ప్రాణం తింటను"

"చెప్తా అన్నా... సత్యం చెప్తా. నన్నొదులు. నీ కాళ్ళు అట్టుకుంటా. నన్ను పోనివ్వు"

"నేను సెక్రటరీగారితో అంతా చెప్తాను.. నీ వుద్యోగానికేం భయంలేదు. ఒకళ్ళ పొట్టమీద కొట్టడం అన్యాయం. నీ ఉద్యోగం ఇలా అపనింద వేసి తీసే శారు అనుకో నీ భార్యా పిల్లలు ఏమవు తారు. అది ఆలోచించద్దా."

"తెలవక చేసిన. తప్పయి పోయింది"

"చెలో. ఇంకెక్కువ మాట్లాడక. యాదుంచుకో– రేపు ఆఫీసులో జరిగింది జరిగినట్టు నోట చెప్పాల"

"మాట తప్ప. అస్త" అంటూ నరశింహ వీధిలోకి పోయాడు.

"ఛా. ఏం మనుషులో. దమాక్ కరాబయిపోయింది"

కౌముది కుర్చీలో కూర్చుని తల రాచు కుంటూన్న యాదగిరి దగ్గరగా వెళ్ళి– "లే... భోజనం చేద్దాం. అప్పుడే పద యింది" అంది

* * *

ఆఫీసుకు యాదగిరీ కౌముదీ కలిసే వెళ్ళారు. ఇద్దరూ ఒకేసారి సెక్షన్లోకి వస్తూంటే అందరూ విస్తుపోయి చూశారు. కొందరు నవ్వుకున్నారు. కౌముది ఏం

గమనించనట్టే తన కేబిన్‌లోకి వెళ్ళింది. యాదగిరి కూడా కౌముది వెనకే వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. యాదగిరి గురించి సెక్రటరీతో పది నిముషాలు మాట్లాడి–

"డిటెయిల్డ్‌గా అతను మీకో మెమో రాండం ఇస్తానంటున్నాడు.. నరశింహని కూడా మీరు క్రాస్ ఎగ్జామిన్ చేయచ్చు'' అంది.

అటునుంచి సెక్రటరీ అంతా విని "మీరోసారి ఇటురండి. గురుమూర్తిని కూడా పిలుస్తాను'' అన్నాడు.

కౌముది సీట్లోంచి లేచి ''నువ్వు నరసింహ మీద కాపేసి వుంచు. నేను ఫోన్ చేస్తాను. అప్పుడు అతగాణ్ణి తీసుకుని మీరిద్దరూ రండి'' అంది.

యాదగిరి తలవూపాడు.

అరగంట తర్వాత కౌముది యాదగిరికి ఫోన్ చేసి–"నువ్వు నరశింహని తీసుకుని సార్‌గదికి రా..'' అంది.

యాదగిరి సెక్షన్లోకి వెళ్ళి నరశింహాన్ని పట్టుకుని ''పా... నిన్నూ నన్నూ పెద్ద సార్ పిలుస్తుండు''

నరశింహ క్రోధంగా యాదగిరివైపు చూసి ''పా'' అన్నాడు.

మౌనంగా నమస్కారం చేసి యాదగిరి, నరశింహ రూమ్‌లోకి వెళ్ళారు.

యాదగిరివైపోసారిచూసి, అదే చూపు కౌముది మీదకి మళ్ళించి పెన్సిల్‌తో టేబిల్ మీద చిన్నగా చప్పుడు చేసి నరశింహాన్ని చూసి– "నాలురోజులనాడు ఏం జరిగిందో నిజం చెప్పు" అన్నాడు.

"ఏంకాలేదు సారూ..."

"ఏం కాలేదంటే..."

నరశింహ ఓసారి సెక్రటరీని చూసి "యాదగిరి కేంటిన్‌కి పోయిన్ది నే చూడలె. ఆడి ఫైలు వూసు నే ఎరగనే ఎరగ. ఈడు సారూ, రాత్రి బాగా తాగి నన్ను జీరాలో అట్టుకుని కొట్టిండు. చాకు దూస్తనన్నడు... ఈ అమ్మ కాడికి కొనిపోయి చంపుత, నరుకుతనన్నడు. తాగివుండు కదా చంపతడేమోనని ఫైలు తీశానన్న. సత్యంగా ఆ ఫైలు నాకు తెలవలా"

"గురుమూర్తిగారిపని చేయమన్న పనీ, డబ్బిచ్చిండనీ సెప్పవా నేదా?"

"ఆరి వూసు నే ఎత్తనే నేదు."

"నిజం చెప్తున్నావా"

"ప్రమాణం సారూ"

గురుమూర్తి అందుకున్నాడు–

"నరశింహ నా దగ్గర పనిచేస్తాడు. చాలా నమ్మకంగా పనిచేస్తాడు. అంత మాత్రం చేత వాడి చేత నేసీపని చేయిస్తే నాకు లాభమేమిటి? యాదగిరిని సస్పెండ్ చేయడానికి,అతగాడి ఉద్యోగం పోవడానికి నేనెందుకు కారణం వహిస్తాను? అతనికీ, నాకూ ముందూ, మునుపూ ఏ గొడవలూ లేవే" అంటూ యాదగిరిని చూసి– "చెప్పవోయ్! నేను నిన్నెప్పుడయినా తిట్టానా. గొడవ పడ్డామా మనిద్దరం?''

"లే..."

"మరి నీమీద నాకు కక్ష ఎందుకు వుండాలి చెప్పు''

యాదగిరి విస్తుపోయి గురుమూర్తిని చూస్తున్నాడు. అతని కళ్ళల్లో క్రోధం వుబుకుతోంది. అటు కౌముది కూడా లోలోపల బాధని అణిచి పెట్టుకుంటోంది.

వాళ్ళిద్దరికీ తెలిసిన సత్యం, వాళ్ళు విన్న నిజం ఒక్కరాత్రితో కళ్ళముందు గాలిబుడగ మాదిరి ఎలా పేలిపోయింది

చూసి బొమ్మలయిపోయారు. సెక్రటరీ కాసేపు ఆగి ''కనీసం ఫైలు దొరికినా మనం ఇంత హెల్ప్ చేసేవాళ్ళం ఇదంతా గొడవగా ఉంది''

నరశింహ వెంటనే జేబులోంచి ఓ పెద్ద కాగితం తీసి సెక్రటరీ ముందు పెట్టి— "సారూ! నాకు ఈడేం చేస్తడోనని భయంగవుంది. రాతిరే నామీద చాకు చూసిండు...మల్లా తాగొచ్చి ఏమైనా చేసినాడంటే నేనేమవ్వాలి. ముందుగనే కాగితం రాసివ్వమంది నా భార్య" అన్నాడు.

రెండు మూడు నిమిషాలు గడిచాయి.

"మీరెళ్ళొచ్చు'' అన్నాడు సెక్రటరీ యాదగిరినీ, నరశింహని చూసి. వాళ్ళిద్దరూ బయటకు వెళ్ళారు. ఆ తర్వాత గురుమూర్తి— ''నాకు శెలవిప్పించండి వెడతా'' అన్నాడు.

"యస్...''

ఆ తర్వాత సెక్రటరీ కౌముది వైపు చూశాడు. ఆమె కళ్ళల్లో బాధ అతనికి అర్థమయ్యింది. ఆయన పెద్దవాడు. కౌముది చరిత్ర కొంతలో కొంత ఆయన విన్నాడు. జరిగిందీ చూశాడు. అయినా ఆమెని ఎలా ఓదార్చాలో ఆయనకు తెలియలేదు.

"న్యాయానికి కళ్ళుండవుని చెవులే వుంటాయంటారు. ఏం చేస్తాం" అన్నాడు.

కౌముది కళ్ళెత్తి ఆయన్ని చూసింది.

‘‘ఏం చేద్దామనుకుంటున్నావ్?’’

“నేవెడతాను. శెలవ్’’ అంది సీట్లోంచి లేచి.

“ఒక్కమాట, చూడు కౌముదీ! జీవితం చాలా చిత్రమయింది. అది మనల్ని ఆడిస్తుంది. ఈ ఆట తప్పని సరి. అందుకే ఆ ఆటలో తగిలిన దెబ్బల్ని లెఖ్ఖచేయకూడదు. జీవితానికి ఎదురు తిరిగే అవకాశం చాలా కొద్ది మందికి వస్తుంది. నువ్వు ఏపని చేసినా ఒకటి రెండుసార్లు ఆలోచించి మరీ చెయ్యి. యూ ఆరే వైజ్ వుమన్. ఐ నో యిట్’’ అన్నాడు.

‘‘మంచిది” కౌముది తన సీట్లోకి వచ్చింది. సెక్షన్లో ఎవరి పన్లలో వాళ్ళున్నారు. కౌముది వెళ్ళి తన సెక్షన్లో కూర్చుంది. సెక్రటరీ అన్న మాటలు ఆమెకి పదే పదే గుర్తురావడం మొదలు పెట్టాయి. ఆమెకు జరిగింది కళ్ళముందు తిరుగుతోంది. జరిగింది ఎలా జరిగిందో తెలుసు. ఎందుకు జరిగిందో తెలుసు వెనకవుండి ఎవరు ఈ పని చేయించినా వాళ్లు పరోక్షంగా తనని హెచ్చరిస్తున్నది ఒకటే ‘‘నీ పరిధి చాలా తక్కువ. నీ జీవితం విస్తరించుకునే శక్తి నీకు మేం ఇవ్వం. బతుకుని కుదించుకో. ఇరుకుగా బతుకు. అదే నీ హక్కు” అని.

తన జీవితం మీద ఇందరి ప్రభావం పడటం తను సహించలేదు. దీనికి చరమాంకం పాడాలి. ఉద్యోగంకోసం వ్యక్తి

త్వానికి దెబ్బతిగిలితే ఆ వుద్యోగం ద్వారా తినే తిండి, దొరికే సుఖం, లభించే ఆనందం-అన్నీ కూడా ఎంగిలివే అవుతాయి. స్వేచ్ఛలేని జీవితంలో, వుచ్చులమధ్య, ఇనపచట్రం మధ్య బతుకులో రుచిలేదు... చేవలేదు. మర మనిషిగా జీవించడంకన్నా మరణం మంచిది.

డ్రాయర్ సొరుగుతీసి ఓ పేపర్ లాక్కొని తల వంచుకుని గబగబా ఏదో రాసింది. పది నిమిషాల్లో కాగితం నలుపైంది. ఆమె నిట్టూర్చింది. మరోసారి ఆ కాగితం చదువుకుని బెల్ కొట్టింది. బయటనుంచి ప్యూన్ వచ్చాడు.

"సెక్రటరీ సార్కి ఇచ్చిరా" అంది.

వాచీ చూసుకుంది. 12 గంటలయ్యింది. లంచ్కు మరో గంట టైం వుంది. అలానే కుర్చీలో కూర్చుంది. ఇంతలో ఫోన్ వచ్చింది.

"నేను... యాదగిరిని. ఇంటికి పోతున్నా"

"ఫోన్ ఎక్కడినుంచి చేశావ్?"

"బయట హోటల్నుంచి"

"నేను వస్తున్నా. కలిసే పోదాం"

"మంచిది"

కౌముది టేబిల్ సర్ది సంతకాలు చేయవల్సిన కాగితాలు పూర్తిచేసి, సొరుగు తెరిచి పర్సనల్ పేపర్స్ తీసుకుని పది నిమిషాల్లో తనకీ, ఆఫీసుకూ వున్న బంధాలూ-ముళ్లూ విప్పుకుంది.

మళ్ళీ ఫోన్ వచ్చింది. "కౌముదీ హియర్"

"నేను... సెక్రటరీని. నీ పేపర్ చూశాను"

"మంచిది సార్"

"ఇదేంపని?"

"బాగా ఆలోచించి చేశాను. మంచి నిర్ణయానికి వచ్చాను"

"వాటెబవుట్ యువర్ ఫ్యూచర్?"

"దానికేం!అది భద్రంగా వుంటుంది"

"నోనో... థింక్ ఎగేన్"

కౌముది అండర్ సెక్రటరీ క్కూడా చెప్పి సీట్లోంచి లేచి సెక్షన్లోంచి విజిటర్ మాదిరి బయటపడింది. ఆమెనెవరూ గమనించలేదు.

యాదగిరి ఆమెను చూసి రెండడుగులు ముందుకు వేశాడు.

"టైము కాలేదు కదా?"

"అయింది" అంటూ కౌముది అక్కడేవున్న ఆటోని పిల్చింది. ఇద్దరూ ఎక్కారు.

"నరశింహగాడి అంతుచూస్తా ఈ దినం"

"పాపం. వాడేంచేశాడు? మనం డబ్బిస్తే మనం చేయమన్నట్టు కూడా చేసేవాడే"

"అవ్. ఆ గురుమూర్తి, ఆ రామానుజం. ఆళ్లు చేస్రు"

"ఒకమాట చెప్పమంటావా?" అంది నెమ్మదిగా.

"చెప్పు"

"నీ ఉద్యోగం పోవడానికి నేను కారణం. దీనికి మించిన ఉద్యోగం నీకు దొరికేటట్టు చేస్తాను. అంతవరకూ మనిద్దరం ఒకే బోటులో ప్రయాణం చేస్తే బావుంటుందని నేనూ ఉద్యోగానికి రాజీనామా చేసేశాను"

అతనికి నోట మాటరాలేదు.

"నౌఖరీకి రాజీనామా చేసినావ్"

"ఈ పని ఎప్పుడో చేసుంటే చాలా బావుండేది. ఈ పాటి తెలివితేటలు ఆనాడెందుకు లేవా అని ఆలోచిస్తున్నా.."

"చాలా పొరబాటు పని చేసినావ్"

"ఏం... ఎందుకని?"

యాదగిరికి ఎలా చెప్పాలో తెలియ లేదు. ఉద్యోగంపోతే ఇల్లెలా గడుస్తుంది- రేపన్నది ఎలా వెడుతుందీ అని ప్రశ్నించ డానికి అతనికి అవకాశంలేదు. కారణం భర్తగా తనామాట అనకూడదని అతనిలో వివేకం హెచ్చరించినట్టయ్యింది. 'నీకేం భయంలే. నేవున్నా' అనడానికి ధైర్యం చెప్పడానికి- తన పరిధి గుర్తొచ్చి మనసు ఒకసారి కుంచించుకుంది.

కౌముది మీద తనకున్న చొరవకి, అధికారానికి హద్దువుందని గుర్తుకు రావ డంతో అతని నోట మా ట రా లే దు. మనసు మాత్రం కల్లోలమయిపోయింది. అందుకే "నే వుండగ దిగులేం పెట్టు కోకు" అని మాత్రం అనగల్గాడు.

"నాకేం దిగులు లేదు. ఈ వేళ చాలా ఆనందంగా వుంది నాకు" అంది.

యాదగిరి కౌముది మొహంలోకి చూశాడు.

ఆమె మొహంలో కొత్త కళ, కొత్త జీవం కన్పించింది అతనికి. ఇద్దరూ ఇంటిముందు ఆటో దిగుతూంటే వాళ్ళ ఆటో వెనకే మరో ఆటోవచ్చి ఆగింది.

కౌముది వెనక్కి తిరిగి చూసింది. ఆటోలో దిగిన మోహనరావుని చూసి ఆశ్చర్యపడి, "మీరా బావగారూ! ఏమిటిలా వచ్చారు హటాత్తుగా"

"కేంప్ మీద వచ్చాను" అం టూ యాదగిరిని చూసి-"ఇతనూ" అని ఆగి పోయాడు.

"ఈయనే మావారు.- నా ఉత్తరం అందిందిగా"

"ఆ" అనేసి "నమస్తే" అన్నాడు. యాదగిరి చేతులు కలిపి.

"నమస్తే" అన్నాడు యాదగిరి తిరిగి.

"ఏం... ఈరోజు ఆఫీసులేదా?"

"లోపలికి రండి. కాఫీ తాగిన తర్వాత అంతా చెప్తాను. నళిని ఎలా వుంది: పిల్లలు కులాసానా?" అంటూ ఇంటి తాళం తీసింది.

"బాగానే వున్నారు"

కాఫీలు తాగిన తర్వాత ముగ్గురూ డ్రాయింగ్ రూమ్‌లో కూర్చున్నారు. కౌముది నెమ్మదిగా రెండునెలలుగా తన జీవితం తీసుకున్న పరిభ్రమణాలు, అందులో తన పాత్రా; చివరిగా గంట క్రితం జరిగిన సంఘటనా-అన్నీ చెప్పింది.

మోహనరావు కాసేపు ఏం మాట్లాడ లేదు.

"ఏమిటీ అలా వుండిపోయారు."

"జీవితంలో అద్భుతాలు జరగడం అంటే ఇదేనేమో !! అప్పుడు చుట్టూ వాళ్ళూ చెప్పేదేం వుండదు- చూడ్డం తప్పించి"

"ప్రస్తుతం మేం ఇద్దరం నిరుద్యో గులం" అంది కౌముది నవ్వుతూ.

"యాదగిరిగారూ. మీరేం బెంగపెట్టు కోకండి. మీరు కౌముదికి చేసింది చాలా గొప్ప వుపకారం. మీకు ఉద్యోగం నేను చూపిస్తానని హామీ ఇస్తున్నాను. సరేనా."

"నాక దిగులేం లేదుసారూ. గిదంతా నాకూ కొత్తగా కొట్తోంది."

"అవునులే. ఆరుబయట స్వేచ్ఛగా తిరిగే పక్షిని పంజరంలో బంధిస్తే ఈ బెదద తప్పదు. చూశావా మా జీవితాల్లో ఎంతటి కల్లోలం వుంటుందో! ఎంతటి కల్మషం వుంటుందో! పగవాడు కూడా ఇలా మధ్యతరగతి కుటుంబాల్లో పుట్ట కూడదని కోరుకో. వాడి ఆలోచనలు,

అడుగులు, మనసు ఎప్పుడూ మధ్యస్తం గానే వుంటాయి. ఈ దేశంలో తను సుఖపడకుండా ఎదటి మనిషిని సుఖపడనీయకుండా చేసేది మేమే!"

యాదగిరి చిన్నగా నవ్వేశాడు.

"ఎలా వుంది మీ సంసారం. మా చెల్లెమ్మ నువ్వు చెప్పినట్టు వింటోందా?"

యాదగిరికి మోహనరావు ప్రశ్న అర్థమయినా జవాబు వెంటనే తోచలేదు. అతను ఆలోచిస్తున్నది ఒకటే. ఇంత ఆత్మీయత, కలివిడితనం ఎదటి మనిషి ఏ వర్గం వాడయినా మనస్ఫూర్తిగా మాట్లాడగల్గడం అతను కాంతారావులోనే చూశాడు. అందుకే యాదగిరి కాంతారావునీ, మోహనరావునీ పోల్చి చూసుకుంటున్నాడు.




మరో రెండు నెలలు గడిచిపోయాయి.

మోహనరావు బెంగుళూరు వెడుతూ యాదగిరిని తనకు తెలుసున్న ప్రయివేటు ఫ్యాక్టరీలో జేర్పించాడు. గవర్నమెంటు ఆఫీసులో వచ్చే జీతం కన్నా ఓ యాభై రూపాయలు తక్కువ దొరికేది అయినా యాదగిరి డబ్బు గురించి పెద్దగా పట్టించుకోలేదు. కౌముదికి పన్నెండేళ్ల సర్వీసు చేసినందుకు ప్రభుత్వం నుంచి రావల్సిన ప్రోవిడెంట్ ఫండ్‌లాంటి మొత్తం చేతికొచ్చింది. ఆమెకూ, నళినికీ తెలుసున్న ఒకామె ప్రయివేటు క్వానెంటు నడుపుతూ కౌముది ఉద్యోగం మానేసిందని తెలిసి — ''మా కాన్వెంటులో చేరు నీకూ కాలక్షేపం అవుతుంది. నువ్వు బ్యాంక్ బేలన్స్ మెయిన్ టెయిన్ చేయగల్గేటంత యివ్వలేకపోయినా నెలకి ఐదారువందలు యివ్వగలను'' అంది.

"నీ సహాయం వెలగట్టలేనిది. డబ్బు అవసరమయినా అదే అంత ముఖ్యమయిందని నేననుకోను'' అంది.

ఆ నెలజీతం అందుకుని యాదగిరి తన దగ్గర వున్న డబ్బులో సగం కౌముది చేతిలో పెట్టి-

''ఇది లెఖ్ఖకట్టు. నాకొచ్చిన జీతంలో సగం నీకిచ్చినా.మిగిలింది ఆమె కంపినా''

''ఈ కొత్త పద్ధతి ఎప్పటినుంచీ?'' అంది అదోలా కౌముది.

"నాదీ, నీదీ కలిపినా కూడా నీ పూర్వం జీతమంత కాలేదుగా! నాకూ లెఖ్ఖలు తెలుసు" అన్నాడు.

"నీ జీతంలో తక్కువయిన డబ్బు నేనిద్దామనుకున్నాను" అంది.

"తిండి పెట్టడంకాక సాదరుఖర్చులు ఇస్తనంటవ్... గంతేనా"

"నువ్వేమనుకున్నా సరే"

"అద్దు. నీకాడనేవుంచు"

కౌముది మరేం అనలేకపోయింది. అతని ఆర్థిక పరిస్థితి అర్థం చేసుకుని తను సహాయం చేయాలనుకుంటుంది. అతని వెనక వున్నవాళ్లు గుర్తొచ్చి ఈ పని తప్పనిసరి అనుకుంటుంది. కానీ అతని ఆలోచనా ధోరణి వేరు. ఛరగా తాళికట్టినందుకు తను కౌముదిని పోషించాలనీ, ఆమె కోరికల్లో కనీసం చిన్నవయినా తీర్చి ఆనందపడాలనీ అనుకుంటాడు.

నాగమ్మయితే -"నాకు ఆ అమెరికా జార్జెట్టు చీర కొనవా. మన పక్కింటామె కట్టిందనో" లేకపోతే "ఇంటి పూసు పట్టించుకో. బాసందులు కొను. బంగారం కొని దాచుంచాలా అగ్గువలోనే" అనో తెగ మాట్లాడి, అతను వినకపోతే పోరీ, అలాగూ నెగ్గకపోతే మూతి బిగించో పని సఫలం చేసుకునేది.

భార్యముందు ఆమె కోరికలు తీర్చ లేనివని ఎంత కొట్టిపారేసినా భార్య తాలూకూ 'పోరు' అతని చెవిలో ఎప్పుడూ జోరిగలా విన్పిస్తూనే ఉంటుంది. కౌముది అతన్ని తన కోరికల జాబితాతో విసిగించకపోయినా ఆ విసుగును అతనికి తెలియకుండానే కౌముది నుంచి అతను కాంక్షించాడు. ఈ వింత మనస్తత్వం వెనక వున్నది పురుషత్వపు కోరికని అతనికి తెలియదు.

వారం రోజుల తర్వాత యాదగిరి తమ్ముడు వచ్చి తలుపు కొడుతూంటే కౌముది తలుపు తీసి,

"ఎవరు కావాలీ" అంది

"యాదగిరి అన్న. ఇంట్లో లేడా?"

"లేడు. పనిమీద వెళ్ళాడు"

"గట్లనా" వాడు బిక్క మొహం వేశాడు.

"ఏం?"

"వదినెకి బాగా సుస్తీ చేసిందట. ఊరునుంచి పెదమామ వచ్చిండు. అమ్మ అన్నని తోలుకు రమ్మంది"

"అలానా" అని కౌముది కాసేపు ఆలోచించి-

"నువ్వోపని చెయ్యి. మీ అన్న పని చేసే కంపెనీ యడ్రసు రాసిస్తాను. అక్కడికిపోయి మీ అన్నతో చెప్పు. సరేనా" అంది.

"గట్టనే...."

కౌముది కాగితం మీద యాదగిరి యడ్రసు రాసిచ్చి-

"జాగ్రత్తగాపో" అంది.

* * *

యాదగిరి సరాసరి తండ్రి ఇంటికి వెళ్ళాడు. వాకిట్లో మామ చంద్రయ్య వున్నాడు.

యాదగిరినిచూసి "ఊరికి పోదాంప. బిడ్డకి ఆరోగ్యం బాగాలే''

''ఏమయింది?''

''మిషన్ ఆస్పతల్లో జేర్పించినా నీకోసం ఒకటే ఏడుస్తున్నది బిడ్డ డాక్టరమ్మ మళ్ళీ ఆపరేషన్ చేయాలం టున్నది''

''పోయిరా. జేబులో పైసలు న్నాయా?'' తండ్రి అన్నాడు.

యాదగిరి 'నేవు' అన్నాడు.

''తనఖా ఎత్తినావుకదా. పైసలేమయి నట్టు?"

యాదగిరి మాట్లాడలేదు. వెంటనే కాసేపు ఆలోచించి-

"నే దేడ్ గంటలో వస్తా. అప్పుడు పోదాం'' అంటూ బయటకువచ్చాడు.

భార్య నాగమ్మ నీడలా కూడా నడుస్తు న్నట్టే వుంది. ఏమయివుంటుంది ఆమెకి? ఎందుకు ఏడుస్తోంది. బాధచేతా? లేక తను మరో పెళ్ళి చేసుకున్న సంగతి తెలిసా? అతని దృష్టి పైసల మీదకి పోయింది. చటుక్కున అతనికి కాంతా రావు గుర్తొచ్చాడు. ఊరి చివర్నవున్న కాలనీకి వెళ్ళాడు. అప్పుడే కాంతారావు ఇంట్లోంచి బయటకు వస్తున్నాడు. యాద గిరినిచూసి - "బావున్నావా?" అంటూ పలకరించాడు. యాదగిరి ''బాగానే వున్నా సారూ'' అంటూ జరిగిన సంగతి

చెప్పాడు. కాంతారావు "అరె" అని తలుపు తెరిచి లోపలినుంచి రెండొందలు తీసుకువచ్చి యాదగిరిని చేతికిచ్చి–
''జాగ్రత్త. అక్కడికి వెళ్లిన తర్వాత ఉత్తరం రాయి ఏ సంగతీ" అన్నాడు.
యాదగిరి త్వరత్వరగా ఇంటిమొహం పట్టాడు. బస్‌స్టాప్‌కి వచ్చేసరికి అతనికి కౌముది ఎదురు పడింది. కౌముదిని చూసి అతను ఆశ్చర్యపోయాడు. ఆమెని పలక రించడానికి నోరురాలేదు.
''నీకోసంవచ్చా. ఎలా వుందిట నీ భార్యకి?"
''ఊరినుంచి మామ వచ్చిండు. నే పోతన్నా" అన్నాడు.
కౌముది చేతిలోని చిన్న పర్సుతీసి–
"ఈ డబ్బు దగ్గర వుంచు" అంది.
''పైసలు సారుకాడ తీసుకున్నా. సరిపడతయ్‌లే'' అన్నాడు.
యాదగిరి చుట్టూ చూశాడు. ఎరుగున్న వాళ్లు తమని ఎంతగా చూస్తున్నారని అతను గమనించాడు. కౌముదితో తర్క వితర్కాలు చేయబుద్ధికాలేదు.
''నువ్వు ఈడకి రాకుంటే బావుం డును"
''ఏం...తప్పుపనికాదుగా నేచేసింది?"
"మంది చూస్తే..."
"ఏవీకాదు"
"నువ్వు పో ఇంటికి" అన్నాడు నెమ్మదిగా.
"ఇంటిదగ్గర రాములు లేడా ... అమ్మ లేదా?"
"అఖ్ఖు నామీద మండిపడ్తన్నారు"
"నే ఒచ్చి చెప్పనా"
''అప్పుడు నీమీద దుముకుతారు... అద్దు..నువ్వెళ్ళు"



కౌముది సరేనని తిరిగి బస్ ఎక్కింది. యాదగిరి ఇంటిమొహం పట్టాడు.

* * *

యాదగిరి నిర్మల్ వెళ్లేసరికే నాగమ్మ హాస్పటల్లో చనిపోయినసంగతి బంధువులు చెప్పారు. యాదగిరికి దుఃఖం ఆగిందికాదు. మామ ఒళ్ళోపడి బావురుమన్నాడు. నాలుగేళ్ళు తనతో కష్టాలూ, సుఖాలూ పంచుకున్న మనిషి ఇకలేదు అనగానే ఆ వెలితి నిముష నిముషానికీ ఎదగడం మొదలుపెట్టింది.

నాగమ్మ భార్యకానేకాదు మరదలుగా చిన్నతనంనుంచీ తెలుసు. తాత ఇంట్లో ఇద్దరూ పడి ఆడుకునేవారు.

"దాన్ని నే చేసుకోను" అనేశాడు.

"నోర్ముసుకో" అంది తల్లికోపంగా.

"ఎందుకు చేసుకోనంటన్నావ్. అది పుట్టినకాడనుంచీ నీ భార్యనే" అన్నాడు తండ్రి. రెండురోజులు తర్వాతగానీ యాద గిరి ఒప్పుకోలేదు. అలా పెళ్ళికావడం, నగరంలో నౌఖరీ దొరికి సంసారం పెట్టడం, ఓ సంవత్సరం కుటుంబం మొత్తం కలిసి వుండడం, ఆతర్వాత తండ్రినుంచి వేరయి వేరే ఇంట్లో వుండడం – అన్నీ త్వరత్వరగా జరిగిపోయాయి. ఏణ్ణర్ధం నాడు మొదలయ్యింది నాగమ్మ అనా రోగ్యం. చూసిన ప్రతీ డాక్టరు దానికి ఒక్కొక్క పేరు పెట్టారు. డబ్బు మంచి నీళ్ళుగా ఖర్చయ్యింది. ఆపరేషన్ జరి గింది. నాగమ్మ బతికి ఇంటికి వచ్చింది. కానీ ఇంటి మీద అప్పులభారం. మనసులో దిగులు..అతని దిగులు చూసి ఆమె బెంగపడేది.

ఆఖరికి ... ఆఖరికి మనిషి దూర మయ్యింది.

సాయంకాలానికి ఊరి నుంచి యాద గిరి తల్లిదండ్రీ వచ్చారు. బంధువులు పోగయ్యారు. చీకటిపడే వేళకి నాగమ్మ

మట్టిలో కల్సిపోయింది.

ఆరాత్రి నాగమ్మ తండ్రీ, తల్లీ కూతురుకోసం దుఃఖిస్తూనే యాదగిరిని నానా దుర్భాషలూ ఆడారు.

"పట్నంలో ఎవత్తో షోకులాడిని మరి గిండు. మాకు అంతా ఎరుకయ్యింది. బిడ్డ ఆ బెంగనేపడి పాణాలు వదిలింది" నాగమ్మ తండ్రి అన్నాడు.

"బంగారం ఎట్టినాం. కట్నం కానుకలూ ఇచ్చినాం. చాల్లే మనిషికి. రెండోది కావల్సివచ్చినాది" అత్త అంది.

యాదగిరి మాట్లాడలేదు. అత్త మామలు, బంధువులు ముఖాముఖీ తిట్టడం అతను చాలాసేపు సహించి ఇక లాభంలేదనుకున్న సమయానికి అక్కడి నుంచి లేచి బజార్న పడ్డాడు.

కానీ ఆ తిట్లు, సూటిపోటి మాటలు వెనకే వస్తూన్నట్టుగా వుంది అతనికి.

యాదగిరి తనకి తెలియకుండానే కల్లు దుకాణం దగ్గర ఆగిపోయాడు. రెండు సీసాలు కొనుక్కున్నాడు. తాగుదామని నోటిదగ్గర పెట్టుకున్నాడు. చటుక్కున కాంతారావు మాటలు గుర్తొచ్చాయి–

"ఈ తాగుడవల్ల దుఃఖం మాయమయితే అది దివ్యౌషధం అవ్వాలి. కాదేమరి! కొన్ని గంటలు నీ భయాన్ని, నీ ఆలోచనల్ని మాయంచేయగలదంతే! పలాయనవాదాన్ని సమర్థించే తత్వంకల వాళ్లు తాగుతారు గానీ– ఖలేజావున్న మనిషి తాగనవసరంలేదు.. ఆలోచించు. మాటతూలుడు, మనిషితూలుడు. అంతకు మించి ఇందులో నువ్వనుకునే 'ఖాస్' ఏం లేదు. తాగిన మైకంపోయిన తర్వాత నీ బాధా, దుఃఖం, అశాంతి నీదగ్గరే మిగిలి వుంటే మరునాడు మళ్ళీ తాగకు! లేదూ ఈ సారాసీసా నా సమస్యల్ని పరిష్కరించింది అనుకున్నావో తిరిగి తాగు"

యాదగిరి గతంలో చేతిలోకి తీసుకున్న సారాసీసాని ఏనాడూ ఖాళీ చేయకుండా వదల్లేదు. కానీ ఇప్పుడు పక్కనే వున్న తుప్పల్లోకి విసిరికొట్టి, ఊరివైపు తిరుగు మొహం పట్టాడు.

* * *

యాదగిరి తిరిగి హైదరాబాద్ వచ్చేశాడు. ఆత్మీయుల్ని చూడగానే చెమర్చే కళ్ళు వర్షిస్తాయి. రాజుకున్న గుండె ఒక్కసారి గుప్పుమంటుంది. కాంతారావుతో యాదగిరి అన్నీ చెప్పి, "నువ్వు చెప్పు సారూ. భార్య జబ్బు పడినాది. ఆమె ఎలాగూ చస్తదని నేనామెని పెళ్ళి చేసుకున్ననా...మంది అన్నరు. అత్త మామలు అన్నరు. నాయనా అన్నడు"

కాంతారావు జాలిగా నవ్వేసి–"ఛాఛా! నాకు తెలియదా నిజం. మనిషిలో బాధ వుందే అది వివేకాన్ని చంపి మాట్లాడిస్తుంది. అంతే..."

"అందుకేసారూ. నోరువిప్పలే.ఘర్షణ పడితే నోర్‌మూసుకుని వెళ్ళొచ్చినా"

"లీవు అయిపోయిందా?"

"రేపు డ్యూటీకి పోవాల..."

కాంతారావు ఏదోజ్ఞాపకంవచ్చి – "నీ ఉత్తరం అందిన మర్నాడు కౌముది కన్పించింది. జరిగింది చెప్పాను. ఆమెకి ఉత్తరం ఎందుకు రాయలేదు. చాలా బాధ పడింది"

"మనసు బాగోలేక సార్..."

"అటు వెళ్ళావా?"

" లే "

"ఎందుకని?"

యాదగిరి ఇదీ అని జవాబు చెప్పలేక పోయాడు. కానీ "ఈరోజు పోతా" అన్నాడు వెంటనే.

"అది సరే యాదగిరీ! నేను రేపు మా స్వగ్రామం వెడుతున్నాను. మా నాన్న గారికి వంట్లో బాగోలేదు. ఓ నెల శెలవు పెట్టాను"

"సారూ! నువ్వూ వూళ్ళో వుండకుండా పోతే..."

"ఏమవుతుంది?"

యాదగిరి చిన్నగా నవ్వాడు. అంతే!

"నా యడ్రసు ఇస్తాను. అవసరం అయితే ఉత్తరం రాయి" అని చెప్పి ఓ కాగితం మీద తన యడ్రసు రాసిచ్చి వెళ్ళి పోయాడు.

యాదగిరి అక్కడి నుంచి సరాసరి ఫ్యాక్టరీకి వెళ్ళాడు. ఫ్యాక్టరీలో అతనికి పరిచయస్తులు తక్కువ. అందుకని అతన్ని ఆత్మీయతతో పలకరించేవాళ్ళు, ఆ తర్వాత వారిదగ్గరనుంచి ఓదార్పు అందుకోవల్సిన అవసరం రాలేదు. ఓ గంట తర్వాత సెక్షన్‌లో సూపర్‌వైజర్ యాదగిరినిచూసి–"నీకు ఫోన్ వచ్చింది" అని చెప్పాడు.

యాదగిరి ఫోన్‌దగ్గరకువెళ్ళి–"హలో" అన్నాడు. అటునుంచి "నేను..కౌముదిని" అన్నమాటలు వినిపించాయి.

"ఆ...మొన్ననే వచ్చిన వూరునుంచి"

కౌముది అంది – "జరిగింది నాకు ఫోన్‌చేసి చెప్పచ్చుగా. ఉత్తరం కూడా రాయలేదు. ఏం?" అంది.

"రాతిరికొచ్చి అంతా చెప్తా"

"సరే"

యాదగిరి సాయంకాలం వెళ్ళేసరికి కౌముది వంటింట్లో వుంది. యాదగిరి సరాసరి వంటింట్లోకి వెళ్ళి – "కులాసనా" అన్నాడు.

కౌముది యాదగిరిని చూసి పక్కన వున్న పీట వాల్చింది.

"ఎలా జరిగింది. అంత జబ్బేం చేసింది ఆమెకి?"

"రక్తం పాడయిందిట. కేన్సరని చెప్పిందు డాక్టర్"

"పాపం" అంది నొచ్చుకుంటూ.

"ఏం చేయాల. ఆమెని ప్రాణంపోక మునుపు చూడలేకపోయినా. చూసుంటే నా బాధ కొంచెం తగ్గేదేమో"

"అలాగే అన్పిస్తుంది. మన చేతుల్లో ఏం లేదుగా"

"పెద్దవాళ్ళు అలాగే అంటారు"

కౌముది మౌనంగానే యాదగిరికి భోజనం పెట్టింది. తను తింది. యాదగిరి కంచందగ్గరనుంచి లేచి డ్రాయింగ్ రూంలో కూర్చుని సిగరెట్ వెలిగించుకున్నాడు. ఆలోచనలు ఎటోపోతున్నాయి.

* * *

కాంతారావు, యాదగిరి కౌముదిని తీసుకుని లేడీ డాక్టర్ దగ్గరకు వెళ్ళాడు. ఆమె ఓ గంట పరీక్షలు పూర్తిచేసి కౌముది ప్రెగ్నెన్సీని కన్‌ఫరమ్ చేసింది.

"నువ్వు చాలా వీక్‌గా వున్నావు. మందులు వాడాలి" అంది.

ముగ్గురూ బయటకు వచ్చారు. టాక్సీలో ముందుసీట్లో కాంతారావూ, యాదగిరీ కూర్చున్నారు. కౌముది వెనక సీట్లో ఒక్కత్తీ కూర్చుంది. ఆమెకు అంతా కలగా, కొత్తగా వుంది. ఏం మాట్లాడాలన్నా బిడియం... ఏదో మాట్లాడాలనే తహ తహ. ఆమెకు చూసిన మనుషులు, చదివిన పుస్తకాలు గుర్తుకొచ్చాయి. నళినికి మొదటిసారి కడుపని తెలిసినప్పుడు వాళ్ళింట్లో పెద్ద పండుగ కళ వచ్చింది. మోహనరావు నళినిని చంటిపిల్లలా... గాజుబొమ్మలా చూసేవాడు.

అందరికీ కష్టాలూ, సుఖాలూ వాటంతట అవే వస్తాయి. ప్రతీ కష్టాన్నీ, సుఖాన్నీ ఢీకొని, వాళ్ళు వాటి అనుభూతితో ఎదుగుతారు. కానీ తన పరిస్థితి వేరు. తన జీవితం వక్రమార్గాన నడిచింది. పెళ్ళి కూడా కొత్తరకంగానే జరిగింది. పదినెలలుగా యాదగిరి తనకి ఎంత కొత్త జీవితం చూపించినా, ఏ మూలో అతను తనవాడు కాదనే అనిపిస్తోంది.

అతనందించే సంతోషం, అతను పంచే స్నేహశీలతకి ఓగడువు వుందని అన్పించినప్పుడల్లా తనే ముడుచుకుపోయిన రోజులెన్నోవున్నాయి. 'ఈ కాలం ఆగేది కాదు' అనేమాట తన బతుక్కి వర్తించదని తెలిసినప్పుడల్లా దుఃఖం కల్గేది.

ఇది ఒకరితో చెప్పుకునే బాధకాదు. ఒకరు సరిదిద్దగల సమస్యాకాదు.

కాంతారావు హోటలు ముందు టాక్సీ ఆపించి, వెనక్కి తిరిగి—"దిగండి. ఈ రోజు మీరు నాకు పార్టీయివ్వాలి" అన్నాడు.

ముగ్గురూ హోటల్లోకి వెళ్ళారు. అరగంట అక్కడ గడిచింది. ఆ తర్వాత కాంతారావు వాళ్ళదగ్గర శెలవు తీసుకుని—"నే చెప్పింది గుర్తుందిగా..." యాదగిరితో అని "రేపు తిరిగి మిమ్మల్ని కలుస్తాను" అని కౌముదికి చెప్పి వెళ్ళిపోయాడు.

"మనం ఇంటికి వెడదాం" అంది కౌముది చిన్నగా.

"అట్టనే" అన్నాడు యాదగిరి. ఇద్దరూ ఆటోలో కూర్చున్నారు. యాదగిరి ఆటోలో కూర్చుని బయటకు చూస్తున్నాడు. కౌముదిని తిరిగి ఆలోచనలు చుట్టుముట్టాయి. ఆమెకి ఎంత కాదనుకున్నా ఉదయం తనింటికి వచ్చిన రాములు ఆమెకి గుర్తుకొస్తున్నాడు.

"చిన్నమ్మా... యాదగిరిగాడికి మల్లా పెళ్ళి చెయ్యాలనుకుంటున్నా..."

కౌముది ఉలిక్కిపడింది.

"వాడు నామాట చెవినిపెట్టడంలే... అద్దు అనేస్తన్నాడు"

కౌముదికి తనేం జవాబు చెప్పాలో తెలియలా.

"వాడూ, సువ్వూ భార్యా భర్తలని నాకు ఎరుకే ... గయితే..?'" కౌముది వెంటనే అంది—

"యాదగిరికి నువ్వు పెళ్ళి చేస్తానంటే నేను ఎప్పుడూ అడ్డురాను రాములూ... నిజం"

"మరిగయితే నీ మాట?"

రాములుకు కౌముది ఏ సమాధానం చెప్పలేకపోయింది.

"ఇంటికాడకి వచ్చేసినాం" అన్నాడు యాదగిరి.

కౌముది మాట్లాడకుండా ఆటో దిగింది.

"ఈ రాతిరికేం వంట చేయకు...నాకాకలిగాలేదు"

"అదేం...?"

"మస్తుగా టిఫిన్ తిన్నాగదా..."




కౌముది రెండు కాఫీలు కలిపితెచ్చి ఒకటి యాదగిరికి ఇచ్చి పక్క కుర్చీలో కూర్చుంది. కాసేపు ఆగి-

"ఉదయం మీ నాయన వచ్చాడు" అంది.

యాదగిరి అదోలా చూశాడు కౌముది వైపు-

"ఏమన్న డేం?"

కౌముది వెంటనే సమాధానం చెప్ప లేకపోయింది.

"నా పెళ్ళివూసు ఎత్తిండు కదూ?"

"అవును"

"నేచెప్పినా వినలా. నీదగ్గరికురికి వచ్చిండన్న మాట"

"ఆయన ఆతృత ఆయనది"

ఈసారి యాదగిరి మాట్లాడలేదు.

"నీ ఉద్దేశం ఏమిటని" యాదగిరిని అడగలేదు కౌముది.

"గయితే నువ్వేమంటావ్'' అని కౌముదిని అడగలేదు యాదగిరి.

అప్పుడు ఇద్దరి హృదయాల్లో లక్ష లాది సంశయాలు చోటు చేసుకుని. వున్నాయి. ఇద్దర్నీ కట్టి పడవేసిన చెమ్కీ దారాలు అతిసున్నితంగా ఎగురు తున్నాయి. వాటి మెరుపు ఇద్దర్నీ క్షణం సంతోషపెడుతోంది. వాటి ఆయుష్షు ఇద్దర్నీ క్షణం భయపెడుతోంది. యాద గిరే ఆఖర్ని అన్నాడు.

"కట్నం దొరుకుతుందని నాయన ఆశ పడతన్నాడు. అందుకే వురికిక్కడికి వచ్చిండు''

కౌముది కేలండర్ వేపు చూసింది. ఆ రోజు నెల మొదటరోజు. ప్రతీ నెల మొదటిరోజు ఆమెకి అదోలా ఉంటుంది. కారణం తాము పెళ్ళిచేసుకున్నది నెల మొదటిరోజునే చిరిగిన ప్రతీనెల తాలూకు కాగితం ఆమె జాగ్రత్తపెడుతూనే ఉంది. ఇప్పటికవి పదకొండు అయ్యాయి.

తన వివాహిత జీవితం వయసు పద కొండు నెలలు. దాని ఆయుష్షు మరొక్క నెల...ఒక్క నెల!

యాదగిరి కూడా ఎగిరిచప్పుడు చేస్తూన్న కేలండర్ వేపు చూశాడు.

మౌనంగా తలవంచుకుని పమిట కొంగుని చేతివేళ్ళకి చుట్టుకుంటూ తిరిగి విప్పుకుంటూ కూర్చున్న కౌముదినిచూస్తే అతనికి జాలివేసింది. కుర్చీలోంచి లేచి, "ఇదిగో మల్లెపూలు.దండకట్టు''అన్నాడు కౌముది తలనిమిరి.

కౌముది పువ్వులపొట్లాం అందుకుంది.

* * *

ఆ నెలలో పదిహేను రోజులు కౌముదికి వంట్లో బాగుండలేదు. కాన్వెంట్ కు శెలవు పెట్టింది ... యాదగిరి తనకు వచ్చిన పద్ధతిలో వంట చేసేవాడు. దగ్గరవుండి ఆమెచేత అన్నం తినిపించేవాడు ... అలా ఆమె పక్కన కూర్చుని అన్నం తినిపిస్తోన్నప్పుడల్లా అతనికి భార్య నాగమ్మ గుర్తుకొచ్చేది. ఫ్యాక్టరీకి వెడితే తోచేదికాదు. అలాగని ఇంటికివచ్చినా మనసుకు కుదురు వుండేదికాదు...

కౌముది యాదగిరికి తన బ్యాంక్ చెక్ బుక్ ఇచ్చి-"నే చూస్తున్నా..నువ్వు డబ్బెక్కడినుంచి తెస్తున్నావో నాకు తెలియదు. మనింట్లో వుండగా అప్పు లెందుకు చేస్తున్నావ్."

"ఏంకాదులే..." అనేవాడు యాదగిరి.

ఓరోజు యాదగిరి ఫ్యాక్టరీకి వెళ్ళిన సమయంలో రాములూ, అతని భార్యా వచ్చారు. కౌముదిని మంచంమీద చూసి వాళ్ళు హడలిపోయారు.

"ఏమయినాది?'' అంది సీతమ్మ.

"వట్టి జ్వరమే."

కాసేపు భార్యా భర్తలిద్దరూ మొహాలు చూసుకుని– "తల్లీ..యాదగిరి పెళ్ళిమాట కాదు. మా బిడ్డకి వరుడు దొరికిండు. ఆళ్ళు పెళ్ళికి ముందుగనే పైసలిమ్మంట న్నరు. యాదిగాణ్ణి అడిగితే నేవు పొమ్మన్నాడు..."

"అలానా"

"నీకు తెలవందేముంది చిన్నమ్మా! నాకా నౌఖరీనేదు. బిడ్డపెళ్ళికి ఆడు పైస లివ్వకిపోతే..."

"ఎంత కావాలిట?"

"ముందుగ ఐదు వేలిమ్మంటన్నరు"

"నేనిస్తాలే" అంది కౌముది.

"అద్దు. ఆడితో చెప్తావుగందా అని నీతో చెప్పిన'' అంది తల్లి.

"ఫరవాలేదు. నేనిస్తాను డబ్బు. యాద గిరితో చెప్పనులే" అని చెక్‌బుక్‌తీసి ఓ చెక్‌రాసి–"ఇది బ్యాంక్‌లో మారుతుంది. వాళ్ళు పైసలిస్తారు" అంది.

రాములూ, సీతమ్మా వెళ్ళిపోయారు.

సరిగ్గా ఆ మధ్యాహ్నమే మోహనరావు దగ్గరనుంచి కౌముదికి ఉత్తరం వచ్చింది–

"నేను ఎందుకు ఈ ఉత్తరం రాస్తు న్నానో నీకు అర్థమయి ఉంటుంది. సరిగ్గా మరో పదిరోజుల్లో నీకూ, యాదగిరికీ జరిగిన వివాహం రద్దుఅవుతుంది. అఫ్ కోర్స్ అది రద్దుకాకుండా ఆపగల శక్తి మీ చేతుల్లో వుంది.

మనిషి మరో మనిషికి ఎందుకు దగ్గ రవుతాడో, అదే మనిషి మరో మనిషిని ఎందుకు ద్వేషిస్తాడో ఇంతవరకూ ఎవరూ చెప్పలేదు.

ప్రేమవల్లా, ఆప్యాయతవల్లా మనుషులు దగ్గరవుతారనీ... ఈర్ష్యవల్లా, క్రోధం వల్లా, మనసును వక్రమార్గంలో పట్టించు కోవడంవల్లా మనుషులు దూరమవుతారని మాత్రం ఖచ్చితంగా చెప్పొచ్చు. కానీ అధునాతన మానవశాస్త్రం మనిషి తనలో వుండే వర్గవిభేదాలవల్లా; ధనకాంక్షవల్లా, మతమౌఢ్యంవల్లా మరో మనిషిని చిన్న చూపు చూస్తాడని చెప్తోంది.

యాదగిరితో నీ వివాహం వింత పరి స్థితుల్లో, వింతపద్ధతిలో జరిగింది. అప్పటి నీ మానసిక క్షోభ, చుట్టూ మనుషుల్లో నీకున్న అపనమ్మకం, భావిజీవితంలో నువ్వు కోరుకునే మాతృత్వం అనే బిరుదు నిన్నో పరిధిలో ఆలోచించేటట్టు చేశాయి.

ఈవేళ నువ్వు ఏడాది అతనితో కాపురంచేసి గృహిణిగా అతికొంచెం అను భవం సంపాదించివుండాలి. ఆ అనుభవం నీకే పాఠాలు నేర్పిందో ఒకటికి పదిసార్లు మననం చేసుకో! జీవితంలో నువ్వు పొందాలనుకున్న సుఖం, మనశ్శాంతి అతని సహచర్యంలో లభించిందో లేదో మననం చేసుకో! ఒకవేళ అతను భర్తగా నిన్ను ప్రేమించిన విధానంలో లోటు వుంటే అది అతని నేరంగా వూహించి చూడకు.. అతను విద్యావంతుడు కాదు. సంస్కారాన్ని నీలా తాత, తండ్రుల నుంచి నేర్చుకుని వుండకపోవచ్చు. ఈ లోపాలు వదలి అతని ప్రవర్తనని గుర్తుచేసుకో...మధ్య వర్తిగా, క్రిటిక్‌గా ఆలోచించు.

అప్పుడూ నీకు యాదగిరి నచ్చక పోతే మీరు నిరభ్యంతరంగా విడి పోవచ్చు.

చాలా పెద్ద కుటుంబంలోంచి వచ్చిన నేను సమిష్టికుటుంబంలోనూ, నళిని భర్త గానూ, ఓ కంపెనీలో బాధ్యతకల్గిన ఉద్యోగిగానూ అనేకసార్లు కిందకి దిగ

 

జారి ప్రవర్తించానని నా అనుభవం చెప్తోంది... కానైతే ఆ తప్పుల్ని మళ్ళీ మళ్ళీ చేయకుండా లెంపలు వేసుకున్నా. అందుకని యాదిగిరిని మనిషిగా గుర్తించి ఆలోచించు. నీకు మనస్ఫూర్తిగా అతగాడు నచ్చితే మీరు మరో ఏడాదేకాదు- జీవితాంతం భార్యాభర్తలుగా కొనసాగండి.

ఆఖరిగా...నువ్వు రాసిన ఉత్తరం అందింది. నువ్వు తల్లివికాబోతోన్నందుకు చాలా సంతోషం...నళినితో చెప్పాను. ఉంటాను.

మోహనరావు"

కౌముదిఆ ఉత్తరం ఒకసారికి నాలుగుసార్లు చదివింది.

* * *

కాంతారావు చిన్నగా నవ్వేసి యాదగిరిని చూసి – "ఇంతకీ నీ బాధేమిటి?" అన్నాడు.

"ఏమని చెప్పాలో తెలవడంలా..."

"నాకు తెలుసు. నేను చెప్తాను విను"

"చెప్పు సారూ"

"మీ పెళ్ళి ఎప్పటితో రద్దవుతుంది?"

"ఈ దినంతో"

"రేపటి నుంచి నీకూ, ఆమెకీ ఏవిధమైన సంబంధం వుండదు. అంతేకదా?"

"గంతే..."

"సరే. ముందు నా ప్రశ్నకి సమాధానం చెప్పు. ఏడాది ఆమెతో కాపురం చేశావ్... ఆమె ఎలాంటిది? అంటే ఆమె బుద్ధి..."

"నాకు దోషం కనపడలే..." నెమ్మదిగా అన్నాడు ఆలోచించిన తర్వాతే !

"నిన్ను ఎలా చూసేదీ ? ఎప్పుడైనా తక్కువగా చేసి మాట్లాడిందా? అది ఎందుకైనా కావచ్చు. డబ్బుగురించి, నీలో వున్న అవిద్య చూసీ, నిన్ను తక్కువ సంస్కారిగా మాట్లాడీ ... అలాంటి వేమన్నా చేసిందా?"

"లే..." బుర్ర గోక్కుంటున్నాడు యాదగిరి.

"ఏడాది కాపురం చేసే మనిషీ, ఇతగాడితో మనకేమిటని నిర్లిప్తంగా వుండేదా? ఆమె చేతల్లో, ప్రవర్తనలో నటనలాంటిది చూశావా?లేకపోతే నీ భార్య నాగమ్మలా నిన్ను భర్తగానే మనసు నిండుగా ప్రేమ నింపుకున్న మనిషిలాగే ప్రవర్తించేదా?..."

"నాబుర్రకేం యాద్ రావడంలే. కానీ నా మనసు నొచ్చుకోలే ఏ దినం కూడ"

"అయితే ఆఖరిగా ఓ మాట... బాగా ఆలోచించి చెప్పు. నువ్వు నీ జీవితాంతం ఇలా చిన్న ఉద్యోగస్తుడిగానే వుంటావ్, ఏదో మిరకిల్ జరిగితే తప్ప! ఒకవేళ చదువుకుని డిగ్రీ సంపాదించి కొంచెం సోషల్ స్టేటస్ సంపాదిస్తే అది వేరే విషయం! ఆమె చదువుకుంది. ఈవేళ కాకపోతే రేపు ఆమె మరో మంచి ఉద్యోగం సంపాదించుకుంటుంది. మీ ఇద్దరి సంపాదనలో వ్యత్యాసంవుంటుంది. దానికి నువ్వు బాధపడకూడదు. ఇక నీకూ, ఆమెకీ తెలియని విషయం ఒకటుంది. మీ వివాహ జీవితం ఒకే సంవత్సరం అన్న కారణాన్ని మీరు సర్దుకుపోయే మనస్తత్వంతో ఈ ఏడాదీ గడిపారా–లేక మీ కలయికలో వున్న అనుభూతి హృదయాంతరాళాల్లోంచి వచ్చిందో మీకు అర్థంకావాలి. దాన్ని నువ్వు ఎనలైజ్ చేసుకోవాలి..."

"గంటే... సరిగ్గా చెప్పు సారూ..." అన్నాడు.

"అంటే ఏంలేదు. మనిషి నువ్వైనా,

ఆమె అయినా, నేనయినా ఎవరి బలహీనతలు వాళ్ళకుంటాయి. ఆ బలహీనతలు బయటపడకుండా వాటిని మాపుమాప డానికే మనిషికి ఆలోచించే మెదడూ, స్పందించే హృదయం వున్నాయి.

ఆలోచనల్ని సక్రమ మార్గంలో పెట్టుకుంటే మెదడు మనకు బానిసవుతుంది. కాకపోతే మనం దానికి బానిసలవుతాం. ఆమె లేకుండా నేను జీవించలేను. భార్యగా ఆమెని నేను స్వీకరిస్తాను. ఆమె హోదా, చదువు సాంస్కారాలతో - నా చదువూ, సంస్కారాలతో కలిపి వాటి మధ్య యుద్ధం సృష్టించే అవకాశం ఇవ్వనని నువ్వు ఓ గట్టి నిర్ణయానికి వస్తే ఆమెతో నువ్వు మిగిలిన జీవితాన్ని గడపవచ్చు. తప్పేం లేదు"

యాదగిరి అంతా విన్నాడు. అతనికో సంశయం మిగిలిపోయింది. "సారూ ఆమెకు ఈ కథ నడపటం ఇష్టం లేదనుకో...ఆ సంగతి నాకెలా తెలవాలి?''

కాంతారావు నవ్వేశాడు. ''మనిషి అందుకే మాటకి తోడు ప్రవర్తన కూడా నేర్చుకున్నాడు. ఆమెకు నీమీద ప్రేమ ఉంటే ఆమె ప్రవర్తనలో ఈ రాత్రే నీకు తేడా కన్పిస్తుంది. లేదంటావ్- ఆడవాళ్ళు విషయంలో అతి నేర్పరులు. మాటలాడకుండా మౌనంగానే ఇష్టాన్ని, అయిష్టాన్నీ కూడా ఎక్స్‌పోజ్ చేయగలరు''

యాదగిరి నవ్వేశాడు.

కాంతారావు ఆఖరిగా అన్నాడు-''రేపు నువ్వు ఫ్యాక్టరీకి రాకపోతే నీ జీవితంలో కొత్త మలుపు వచ్చిందని అర్థం చేసుకుంటాను. ఫ్యాక్టరీకి వచ్చావో సరేసరి. ఫోన్ చేస్తాను. అర్థమయిందా''

యాదగిరి అర్థమయినట్లు నవ్వాడు.

* * *

ఆ రాత్రి కౌముది పెట్టెలోంచి పెళ్ళినాటి మధుపర్కం తీసి కట్టుకుంది. పువ్వులమ్మే మనిషిని పిల్చి మల్లె పువ్వులూ,కనకాంబరాలూ, దవనం కొంది. వాటిని మాలగా కట్టింది. ఆతర్వాత వంటగదిలోకి వెళ్ళి త్వరత్వరగా వంటచేసింది. అప్పటికీ ఆమెకి లోటుగానే వుంది. బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి యాదగిరి పెట్టె తెరిచి పెళ్ళినాటి అతని మధుపర్కాలు తీసి హేంగర్‌కి తగిలించింది.

డ్రాయింగ్‌రూమ్ సర్దింది. బెడ్‌రూంలోకి వెళ్ళి గదంతా శుభ్రం చేసింది.

అప్పటికి ఆమెకి ఆయాసం వచ్చింది. డాక్టరు చెప్పిన సలహా గుర్తొచ్చి నవ్వొచ్చింది. కుర్చీలో చతికిలబడి చేతులు తడిమి చూసుకుంది. అద్దంలో మొహం చూసుకుంది. ఆ తర్వాత గడియారంవైపు చూసింది. ఆరు దాటింది. వీధి గుమ్మం వరకూ ఒకటికి పదిసార్లు వెళ్ళి మెట్లుదిగి వీధి కొనవరకూ చూసి, ఆ పైన గుమ్మాన్నానుకుని నుంచుని - చిన్నరకం విసుగుతోస్తే కుర్చీలో చతికిలబడింది.

యాదగిరి తెరిచివున్న తలుపులు చూసి ఆశ్చర్యంగా లోపలికి వచ్చాడు. కుర్చీలో కౌముది కూర్చున్న తీరు అతనికి ఆశ్చర్యం కలిగించింది.

"అప్పుడే వంటయినాది. ఇంతజల్దీ" అన్నాడు.

"ఆ..త్వరత్వరగా కానిచ్చేశానీరోజు"

యాదగిరి టిఫిన్ బాక్స్ టేబిల్ మీద పెడుతూ స్టీలు పళ్ళెంలో వున్న పూల దండని చూశాడు. ఆ తర్వాత టవల్ కోసం హేంగర్ దగ్గరకు పెళ్ళినాటి మధుపర్కం, తెల్ల కమీజు చూసి విస్తుపోయాడు.




"వీటిని నువ్వు పైకి తీసినావ్" అన్నాడు.

"ఆ..."

యాదగిరి మరేం మాట్లాడకుండా స్నానం చేసి వచ్చాడు. హేంగర్ మీద వున్న పంచెం కట్టుకున్నాడు. వంటింట్లోకి వెళ్ళి పీటమీద కూర్చుని అన్నంతిన్నాడు. ఆ తర్వాత డ్రాయింగ్ రూంమ్‌లోకి వెళ్ళి కుర్చీలో చతికిలపడ్డాడు. గంట తర్వాత కౌముది పడగ్గదిలోకి వెడుతూ-

"నిద్రరావడం లేదా?" అంది చిన్నగా.

"అస్తోంది"

"మరి...?"

"నాకు ఈడ పక్క వేయనేదేం?" అన్నాడు.

"ఈడనా?" అంది విస్తుపోయి.

యాదగిరి మాట్లాడలేదు.

"ఎందుకుట ... ఇక్కడ బాగా చలి వేస్తుందిగా"

"అవ్‌ననుకో"

"మరెందుకూ?"

"చెప్పేదా...?"

"చెప్పు..."

"మంచిగనో, చెడుగనో నువ్వన్న ఏడాది పూర్తి చేసినా. ఈ దినంతో మనం మల్లా మామూలు మనుషులం అయిపోయినాం. నా మూలంగా నిన్ను ఏడ్పిస్తే, కష్టం కలిగితే ఏమనుకోకు. మనసులో వుంచుకోకు" అనేశాడు.

"ఇవన్నీ ఎందుకు?" అంది భయంగా.

"అవసరం పడ్డప్పుడు చెప్పాల"

"ఎవరికొచ్చింది అవసరం. నీకా?"

యాదగిరి మాట్లాడలేదు.

"అయితే నువ్వు ఏడాదయిందని వెళ్ళిపోదామనుకుంటున్నావా?"

"ఈ ఉద్దేశం నీ మనసులో వుంటే నిన్నే చెప్పొచ్చుగా"

"నా మనసులోనేదు. నీ మనసులో వుంటదేమోనని..."

"నా మనసు నీకు తెలుసునను కున్నా"

"గంటే...?"

"నన్ను అర్థం చేసుకున్నావను కున్నా"

"గంటే?"

"ఈ ఇల్లూ, ఈ వాతావరణం, భోజనం అక్కడచూడు...ఆ పూలు, నా చేతివంటా, ఈ గది అలంకరణ..."

"చదువుకున్నోళ్ళు ఇట్టనే చెప్తాలా మనసులో మాట. నాకు తెలవదులే" యాదిగిరి చిన్నగా అన్నాడు.

"నీకన్నీ తెలుసు..." కౌముది కళ్ళవెంట నీరు కదిలింది.

"అరే...ఎడస్తున్నవ్.కళ్ళు తుడుచుకో. గట్టయితే కడుపున బిడ్డ బెంగపడుంది. నేరం" అని యాదగిరి కుర్చీలోంచి లేచి కౌముది వైపు వెళ్ళాడు.

"ఎదుటివాళ్ళు ఏడిపిస్తే ఎడుపు వస్తుంది. నవ్విస్తే నవ్వే వస్తుంది. అంతేగా"

"దాన్నే బతుకంటారని చెప్పిండు సారు"

కౌముది క్షణం క్రితం జరిగినవన్నీ మర్చిపోయి ఆశ్చర్యంగా....ఆ తర్వాత ఆనందంగా - ఆఖరిగా ఆత్మీయతతో యాదగిరి వైపు చూసింది.

"సత్యం చెప్పు. నిద్ర అస్తోందా నీకు?" యాదగిరి కౌముదికి కితకితలు పెడుతూ అడిగాడు.

"లేదు లేదు" అంటూనే గలగలా నవ్వేసింది కౌముది!





# మేడిన్ హెవెన్

వెంకట్రావు అన్ని విధాలా తెలివైన వాడే! ఎమ్మెస్సీదాకా ఫస్టుక్లాసులోనే పాసయ్యాడు. ఆ తర్వాత పీహెచ్‌డీకి కూడా పరీక్షలంటూ ఉంటే బాగుండేదే కానీ దానికి పరీక్షలు లేవు. ఏదైనా విషయమై పరిశోధనలు చేసి- పరిశోధనలకొక రూపం వచ్చేక ఆ వివరాలన్నీ థీసిస్ అనబడే పుస్తకరూపంలో రాసి యూనివర్శిటీ రిజిస్ట్రార్ ఆఫీసులో సబ్మిట్ చేయాలి మరి.

రీసెర్చిలో చేరగానే వెంకట్రావుకు మంచి ప్రోబ్లమే దొరికింది. దాంతో అతడి వర్క్ చక్కగా కొనసాగింది. రెండేళ్ళలోనే ప్రయోగాలు చేయడం అయిపోయింది.

ప్రొఫెసరుగారు "ఇంక నువ్వు థీసిస్ రాయడం మొదలుపెట్టవచ్చు" అన్న మర్నాడే అనుకోకుండా వెంకట్రావుకి ఉద్యోగం వచ్చింది.

"ఉద్యోగంలో చేరిపో. నెమ్మదిమీద థీసిస్ సబ్మిట్ చేయవచ్చు" అన్నారు ప్రొఫెసరుగారు ప్రేమతో.

వెంకట్రావు ఉద్యోగంలో చేరాడు. అది ఓ రీసెర్చి లాబరేటరీలో సైంటిస్టు పని. అసలాఫీసు టైములోనే అతడు థీసిస్ రాసుకున్నా అడిగేవారెవ్వరూ లేరు. కానీ వెంకట్రావు థీసిస్ రాయలేదు పీకెలమీద పరీక్ష, తేదీ - అంటూ ఏమైనా ఉంటే తప్ప అతడికి కాగితం, కలం తీసే అలవాటు లేదు. అతడికి తెలివితేటల పాళ్ళకంటే బద్ధకం పాలు ఎక్కువ. తెలివైనవాళ్ళే బద్ధకస్తులవుతారని చిన్నప్పుడో హరిదాసుగారుచెప్పగా విని ఉన్నాడతను.

వెంకట్రావుకు శ్రేయోభిలాషులు చాలా మంది ఉన్నారు. వాళ్ళంతా అతడిని థీసిస్ రాయమని సతాయించారు.

"వేదవ్యాసుడంటివాడు గణపతి దొరికితేగానీ భారతం చెప్పలేదు. నాకూ ఓ గణపతి కావాల్సి వచ్చేట్లుంది" అన్నాడతను.

తను చెబుతూంటే రాసేవాడు రాసుకు పోవాలి. తనకాపనిలో సాయపడాలనుకునేవారు ఇరవై నాలుగు గంటలూ తనని అంటిపెట్టుకొని ఉండాలి.

ఈ షరతుకు అతడి స్నేహితులెవరూ ఒప్పుకోలేదు. కానీ మరో విధంగా అతడికో అవకాశం వచ్చింది. చంద్రం అనే అతను గది దొరక్క ఇబ్బంది పడుతూంటే తన గదిలో ఉండవచ్చునని వెంకట్రావే అన్నాడు.

చంద్రంచేత వెంకట్రావు థీసిస్ రాయించుకుంటాడని అంతా అనుకున్నారు. కానీ అలా జరుగలేదు.

వెంకట్రావు శ్రేయోభిలాషులు "ఇంక లాభం లేదోయ్! నీకింక థీసిస్ నీ భార్యే రాసిపెట్టాలి" అన్నారు.

ఉద్యోగంలో చేరిన మూడేళ్ల దాకా వెంకట్రావు పెళ్ళిగురించి ఆలోచించలేదు. ఈలోగా ప్రొఫెసరుగారు థీసిస్

విషయమై అతడికి చాలా ఉత్తరాలు రాశారు. వర్కు పూర్తిచేసి ఇంతకాలం థీసిస్ రాయకుండా ఉండిపోయి ఆయన శిష్యవర్గంలో రికార్డు సృష్టించి ఉన్నాడు వెంకట్రావు.

థీసిస్ కోసమేనో ఏమో వెంకట్రావు పెళ్ళిచేసుకోవాలన్న నిర్ణయానికివచ్చాడు. ముందే ఓ మంచి ఇల్లు చూసుకున్నాడు. తనెలాగూ థీసిస్ భార్య చేతనే రాయించుకోవాలనుకుంటున్నాడు కాబట్టి పెళ్ళిచూపులకు వెళ్ళేటప్పుడు అమ్మాయి కనీసం గ్రాడ్యుయేటైనా అయుండాలని చూసుకునేవాడు. దస్తూరీ ఎలా ఉండేదీ తెల్సుకునేవాడు.

వెంకట్రావుకి పెళ్ళయింది. పెళ్ళి నాటికి పెళ్ళికూతురు బియ్యే పాసై మూడేళ్ళయింది.

వెంకట్రావు శ్రేయోభిలాషులందరూ ఎంతో సంతోషించారు. ఇంకనైనా అతడు థీసిస్ రాసి పీహెచ్‌డీ సంపాదించుకుని లాబొరేటరీలో మిగతా చాలామందికివలెనే తనూ డాక్టర్ అనిపించుకుంటాడని ఆశించారు.

వివాహమైన కొత్తలో దంపతు లిద్దరూ కొన్నాళ్ళపాటు చిలకాగోరింకల్లా తిరిగారు. ఆ తర్వాత సాయంత్రాలు భార్యమాత్రమే పేత్తనాలకు వెళ్ళేది. 'అతడింట్లో ఉండిపోయేవాడు. ఏమిటని ఎవరైనా అడిగితే "ఆయన రాసుకోవాలి కదా మరి!" అనేది.

ఈ వార్త విని శ్రేయోభిలాషులు ఎంతగానో సంతోషించి అతడిని అభినందించాలని ఓ రోజు సాయంత్రం అతడింటికి వెళ్ళారు. ఇంట్లో అతడొక్కడే ఏదో రాసుకుంటూ కూర్చుని ఉన్నాడు.



"నీ భార్య తను రాయకపోయినా నీచేత థీసిస్ రాయిస్తోంది. ఈ మార్పుకు మాకు చాలా సంతోషంగా ఉంది. థీసిస్ ఎంతవరకూ వచ్చింది?" అనడిగారు శ్రేయోభిలాషులు.

"ఇది థీసిస్‌కాదు. మా ఆవిడ ఎమ్మే పరీక్షకు కడుతోంది. నోట్స్ ప్రిపేర్ చేస్తున్నాను." అన్నాడు వెంకట్రావు గంభీరంగా.

"ఆవిడ ఎమ్మే పరీక్షకు కట్టడమేమిటి? అంతగా ఎమ్మే చదవాలని ఉంటే బియ్యే చదివాక మూడేళ్ళు ఖాళీగా ఉంది కదా అప్పుడు చదవలేకపోయిందా?" అనడిగారు శ్రేయోభిలాషులు ఆశ్చర్యంగా.

"తనకు మొదట్నించీ ఎమ్మే చదవాలని ఉందట. కానీ బియ్యేకిలాగ ఎమ్మేకి గైడ్సులేవుగదా. ఇంట్లో ఎవర్నడిగినా పెళ్లైతే నీ మొగుడు రాసి పెడతాడులే కాస్త చదువుకున్నవాణ్ని చేసుకో అన్నారుట. అందుకని ఎమ్మేకి ఇప్పుడు కడుతోంది" అన్నాడు వెంకట్రావు.

"అవును. వివాహాలు స్వర్గంలో నిర్ణయమవుతాయన్న విషయం పెద్దలు ఎప్పుడో చెప్పారు గదా" అని నిట్టూర్చేరు మిత్రులు.

—వసుంధర

# ట్రిక్

బస్సు కోసం ఎదురు చూస్తున్నాడు మూర్తి. బస్సు రానే వచ్చింది. ఆ హాల్టులో పాసెంజర్సు దిగకపోగా మరికొంత మంది ఎక్కి సర్దుకున్నారు. మూర్తికి కూచోడానికి కాదుకదా నిల్చోడానికి కూడా చోటు దొరకలేదు. మూర్తికి చెడ్డ కోపంగా ఉంది. 'టికెట్...టికెట్' అంటూ వచ్చాడు కండక్టరు. సీటు దొరకనందుకు కండక్టరు మీద తన ఆగ్రహాన్ని కక్కేసాడు. కండక్టరేమీ తక్కువ తినలేదు. అసలా హాల్టులో బస్సు ఆపడమే తను చేసిన తప్పు అన్నాడు. ఏదో దయతలిచి పాసింజర్సుని ఎక్కించుకొంటే ఇలా దండయాత్ర చెయ్యడం ప్రతీ తలమాసిన వెధవ చేసేపనే అని మాటకు మాట అప్పజెప్పాడు. మూర్తికి తల కొట్టేసినట్లనిపించింది. అవమాన భారంతో మాట్లాడకుండా పదిరూపాయల నోటుఅందించి 'పార్వతీపురం'అన్నాడు. కండక్టరు టికెట్ అందించి 'చిల్లర లేదు. దిగేటప్పుడు టికెట్ చూపించి డబ్బు వసూలు చేసుకో'మని చెప్పి ముందుకు కదిలాడు. మూర్తి టికెట్ వెనక్కు తిప్పి చూసుకున్నాడు. అంకె ఒకటి వేసి ఉంది. అంటే ఇంకా రూపాయి రావలసి ఉంది. మూర్తికి కసిగా, కచ్చగా ఉంది.

బస్సు కీచుమంటూ ఆగింది. అందరూ దిగారు. మూర్తి వెళ్ళి రెండు సోడాలు వరుసగా తాగాడు. ఐడియా తళుక్కున మెరిసింది. నంబర్‌వన్‌కి వెళ్ళినట్లు వెళ్ళి టికెట్ తీసి డాట్ పెన్నుతో గీత పెట్టాడు.

పార్వతీపురం చేరుకొనేసరికి సాయంత్రం అయింది. జనం హడావిడిగా దిగిపోతున్నారు. దిగినవాళ్ళను దిగకుండా ఎక్కేవాళ్ళు ఎక్కుతున్నారు. మూర్తి అందించిన టికెట్ తీసుకొని వెనక్కు తిప్పి చూసి ఏడు రూపాయలు ఇచ్చాడు. మూర్తి హుషారుగా ఈల వేసుకొని ముందుకు నడిచాడు.

ఇంటికి వెళ్ళి తలుపు తట్టేసరికి ఎదురుగా భార్యామణి ట్రిమ్‌గా తయారై ఉంది. చేతిలోని పూల పొట్లం, సపోటాలు చేతికి అందించి బుగ్గ గిల్లాడు. "ఛీ...




పోదురూ!బాబు ఇంకా మేల్కొనే ఉన్నాడు'' అంది భామామణి. ''అవునూ! మీకు రాను రాను మతిపోతోందే! లేకపోతే నెలాఖరు రోజులుకదా!ఇన్నేసి పూలు,పళ్లు ఎందుకు కొన్నట్లు" ముద్దులగుమ్మ గొణిగింది. "పిచ్చిమొహమా! ఇవి కష్టార్జితంతో కొన్నవి కావే" అన్నాడు గర్వంగా మూర్తి. అర్థం కానట్లు చూసిందామె. "కండక్టరు టికెట్ వెనుక రాసిన ఒక గీతకు అడ్డంగా మరో గీత జోడించడం మూలాన అది ఏడయి కూచుంది. దాంతో ఆరు రూపాయలు అదనంగా లాభం. వాటితోనే ఈ శోభనం సామగ్రి" అని మూర్తి చెప్పిన మాటలకు మురిసిపోయింది ఆ ఇల్లాలు.

"నాన్నా ... నాన్నా!" పిలుపుతో, తెలివి వచ్చింది మూర్తికి. ఎదురుగా కొడుకు. "నాన్నా! దీని మీద చప్పున సంతకం పెట్టు. స్కూల్లో ఇవ్వాళ ఇచ్చేయాలి'' అని ప్రోగ్రెస్ కార్డు అందించాడువాడు. మూర్తి ఆవులించి ''పెన్ను'' అన్నాడు. రడీగా పట్టుకొన్న పెన్నుని తండ్రికి అందిచ్చాడు. సంతకం పెడుతూ మార్కులు చూసాడు మూర్తి.

''శభాష్! ఏ సబ్జెక్టు దెబ్బయికి తగ్గలేదు. వెరీగుడ్'' అని సంతకం చేసి నిద్రలోకి ఒరిగిపోయాడు మూర్తి.

ఆ ముందురోజు తను చేసిన ట్రిక్కే తన సుపుత్రుడు చేసినట్లు తెలీదు పాపం మూర్తికి.

— ఆనందరావ్



Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004.    Regd No. H/HD/402